# తథాగతుడు

రచన :

ప్రొఫెసర్ కిళాంబి రంగాచారి, ఎం. ఎ., బి. ఎల్.,

జనతా ప్రచురణాలయం
బకింగ్‌హామ్‌పేట P. O. విజయవాడ - 2.

# ప్రకాశకుల మనవి



"తథాగతుడు" బుద్ధుని జీవితవిశేషాలు అన్నీ సమగ్రంగా విశదీకరించే గ్రంథం. దీనిని పాళీభాషనుండి అనువదించి ఎన్నో విషయాలను తెలియజేయడానికి కీర్తిశేషులైన కిలాంబి రంగాచారి గారు ప్రయత్నించి కృతకృత్యులయినారనడం నిస్సందేహం.

దీనిని తెలుగు పాఠకలోకం ఆదరిస్తుందని ఆశిస్తున్నాము. దీని ముద్రణలోనూ, దీన్ని తెలుగు పాఠకలోకానికి అందజేసేందుకు తోడ్పడిన మిత్రులు శ్రీ అవసరాల సూర్యారావుగారికి మా కృతజ్ఞతాభివందనలు.

ఇట్లు,

5—3—'60. ప్రకాశకులు.

ప్రాచీనకాలమున అనగా రెండువేల అయిదువందల సంవత్సరములకు పూర్వం ఈనాటి నేపాల రాజ్యానికీ, సంయుక్త బీహారు రాష్ట్రాల ఉత్తరభాగానికీ మధ్యనవుండే ప్రదేశంలో, వేర్వేరు జాతులకు నివాసస్థానాలైన చిన్న చిన్న రాజ్యాలుండేవి. వీటిని కొందరు రాజులు పరిపాలిస్తూవుండే వారు. నేడు 'గోరఖ్పూర్' అని వ్యవహరింపబడే పట్టణానికి ఉత్తరంగా కొంతదూరంలో శాక్యుల రాజ్యమొకటి ఆ నాడు వుండేది. ఈ రాజ్యమునకు దక్షిణాన 'రప్తి' నది ప్రవహిస్తూ వుండేది. ఈ రాజ్యాన్ని పరిపాలించే రాజుపేరు సుద్ధోదనుడు. అతను గోతమ కుటుంబీకుడు. అందువల్ల ఆయనను 'సుద్ధోదన గోతమరాజు' అని అనేవారు. ఈయన రాజ్యానికి రాజధాని 'కపిలవస్థు' ఈనగరంలోనే రాజప్రాసాదం వుండేది.

సుద్ధోదనరాజు భార్య పేరు మహామాయ. ఆమె పట్టమహిషి. భార్యాభర్తలిద్దరూ కొంతకాలం సుఖంగా కాపురంచేసిన తరువాత మహామాయ గర్భం దాల్చింది. ప్రస వించే సమయం సమీపించగా ఆమెకు తన పుట్టింటివారిని చూడాలనేకోరిక కలిగింది. ఆమె పుట్టింటివారు అట్టేదూరంలో లేరు. "దేవాదహ" మనే పట్టణం వారి నివాసస్థానం. అక్కడికి వెళ్ళి తనవారిని చూచివస్తానని భార్య భర్తనుఅడిగింది. అతని అనుజ్ఞను వేడింది.

మహారాజు తన భార్యముద్దును చెల్లించడానికి సంతో షంతో అంగీకరించి, నౌకర్లను రప్పించి రాజ్ఞి మహామాయ

పుట్టింటికి వెళ్ళే మార్గాన్ని ఎగుడు దిగుడులు లేక రాళ్ళూ రప్పలూ తీయించి బహుప్రశస్తంగా ఉండేటట్లు తయారుచేయమని ఆజ్ఞాపించాడు. ఆజ్ఞాపించడమే తడవుగాదారిని సేవకులు సుగమం చేశారు.

కపిలవస్థు దేహదహ పట్టణాలకు మధ్యసాలవృక్షాలతో నిండినఒక మహావనం వుండేది. దాని పేరు లుంబిని. వేసవి కాలంలో తాపం అధికంగా వున్నప్పుడు ఈ రెండు నగరాల ప్రజలూ ఆ వనంలోకి తండోపతండాలుగా పోయి సేద తీర్చుకుంటూ వుంటారు. సాలవృక్షాల నీడలలో చల్లగాలి అనుభవిస్తూ వేసవిని తట్టుకుంటారు.

మహామాయ పయనమై వెళ్ళినమాసం 'మే' మాసం. చైత్రఋతువులో సాలవృక్షాలు కిందనుంచి మీదవరకూ మనోహరమైనపువ్వులతో అలరారుతూ ఉంటాయి. లుంబినీ వనం ఎటుచూచినా కన్నుల పండువుగా వుంది. తరుశాఖల్లో నానాజాతి విహంగములు రమ్యంగా పాడుచుండెను. దిశలన్నీ పక్షుల గీతికారవములతో ప్రతిధ్వనిస్తూండెను. ఆ మహావనంలో విరుగబూసిన పలుజాతి పుష్పములపై తేనెటీగలు వాటి మధువును సేకరించుకుంటూ ఝమ్ అని ఎగురుచుండెను.

మహారాణి బయలుదేరిన రోజు మరీ వేడిగా వుండడంచేత లుంబినీవనం చేరగానే ఆమెకు అక్కడ కొంతసేపు సేద తీర్చుకోవాలన్న కోరిక పుట్టింది. వెంటనే ఆమె, బోయీలను తోటలోకి పల్లకిని తీసుకుపొమ్మని ఆజ్ఞాపించింది. పల్లకీ వనంలో ఆగగానే ఆ మహారాణి కిందకు దిగి అటు యిటు తిరుగుతూ

లుంబినీవన సౌందర్యాన్ని చల్లదనాన్ని బహురామణీయకతనూ కనులారకాంచుతూ మనసారఅనుభవిస్తూ ఆనందిస్తూవుండగా ప్రసవవేదన ప్రారంభమయింది. కొంతసేపు పోయాక నానావర్ణ చిత్రిత పుష్పశోభితమున్నూ పక్షికూజితముల ప్రతిధ్వనిస్తూన్నట్టిన్నీ, మధుపముల ఝుంకారములతో నిండినటువంటి మనోరంజకమైన ఆ మహావనంలో మహామాయ ఒక పుత్రుని కనెను.

ఆ రాజ్ఞి ప్రసవించినచోటును ఈనాడుకూడా చూడవగును. సుద్ధోదనరాజు కాలగతిచెందిన నాలుగువందల సంవత్సరముల తరువాతఅశోకుడనే చక్రవర్తి దేశాన్ని పాలించుచుండెను. ఈ సామ్రాట్టు కపిలవస్థు రాజదంపతులైన సుద్ధోదన మహామాయలకు పుత్రుడు జన్మించిన లుంబినీవనంలో ఒక స్తంభాన్ని నిలబెట్టించెను. ఈ మహాసంభవము జరిగినచోటును, రాబోవు పురుషాంతరాలవారికి తెలియ జేయడానికై, ఆ స్తంభాన్ని నిలబెట్టించితినని ఆ చక్రవర్తి దానిపై ఒక శాసనము చెక్కించెను. ఈ స్తంభపుమీదుభాగం విరిగిపోయింది. మిగిలిన మొండెం వాలివుంది. ఈ నాటికికూడా ఆ మహాపురుషుడు స్తంభంమీద చెక్కించిన అక్షరాలను చదవవచ్చును. ఈ ప్రదేశం బౌద్ధులకు ఒక పుణ్యక్షేత్రం. అనేకమంది ప్రతిసంవత్సరం ఆ క్షేత్రానికిపోయి, స్తంభ శకలాన్ని దర్శించి వస్తూ వుంటారు.

కపిలవస్థు నగరానికి బైట కొండ లున్నాయి. ఆ కొండల్లో అనేకమంది ఋషులు నివసిస్తూ యుండేవారు. వారిలో నొకముసలి ఋషి ఉండేవాడు. కపిలవస్తు పురవాసు

లకూ, ఆ పురపరిపాలకునకుగూడా వాని మంచితనాన్ని పట్టి వానియందు అతి గౌరవముండేది. రాజు అనేక విధముల నాతనిని గౌరవించి ప్రేమించుచుండెడివాడు. ఈ వృద్ధ ఋషి, సుద్ధోదనునకు కొడుకు పుట్టినాడనివిని, సంతోషంతో, వానిని చూడటానికి రాజప్రాసాదానికి వెళ్లాడు. ఋషినిచూచి, ఆనందంతో రాజు వానిని సత్కరించి తన పుత్రుని ఆశీర్వదించమని వేడుతూ, ఆ మహామహునకు జోహారు చేయిస్తున్నట్లు, శిశువును వంచి పట్టుకొనెను. అదిచూచి "మహారాజా, నీ కుమారుడు సామాన్యుడుకాడు. ఆతడు తలవంచి నన్ను గౌరవింపపని లేదు. నీ కుమారుని యెదుట నేనే తలవంచి, పూజింపవలెను. ఈతడు ప్రాప్తవయస్కుడై, ఒక గొప్ప మత ప్రబోధకుడు కాగలడు. నేటివరకు ప్రపంచంలో వెలసిన మత ప్రబోధకులందరిలోను, అగ్రగణ్యుడు కాగలడు" అని అనుచు, ఆ ముదుసలి అత్యంతానందంతో చిరునగవు ముఖమునలంకరింప ఒకచో కూర్చుని యుండెను. ఇంతలో నవ్వు మాయమయింది; మెల్లగా నేత్రములు అశ్రుపూరితము లయ్యెను; కన్నీరుధారగా కారుచుండగా ఆతడు మెల్లగా నేడ్వసాగెను. అది గని రాజు ఆతని వింతచర్యను తెలిసికోలేక, తన పుత్రున కేమి ప్రమాదము సంభవింపనున్నదో అని కొంత భయపడి, "ఓ ఋషీ, ఏమిటీ వింతచర్య? ఒక్క నిమిషముపూర్వం, మీరు నవ్వుచుండిరి. ఇప్పుడు తామేడ్చుచున్నారు, ఏదైనా వైపరీత్యమున్నదా? నాకుమారున కేప్రమాదమైనా జరగనున్నదా?" అని ప్రశ్నించెను.

"ఓ మహారాజా, భయపడకుము. ఏ హానీ నీ కొడుకు కామడ దూరములోనైన రాదు. అతడు సర్వ శ్రేయస్సులను కలిగియుంటాడు. అతని పేరు సర్వశోభాయమానంగా వెలుగుతుంది" అని వృద్ధఋషి జవాబిచ్చెను.

"అయితే, ఎందుకు ఏడుస్తున్నారు?" అని రాజు ప్రశ్నించెను.

"అతివృద్ధుడనైతిని గాన అచిరకాలములోనే కాలగతిని చెందవలసివుంది. ఒకనాడు నీ కుమారుడు గొప్పమత ప్రబోధకుడవుతాడనినాకు తెలుసు. నే నది చూడడానికి బ్రతికి యుండనని, విచారంతో ఏడుస్తున్నాను. ఆ మహోదయాన్ని (మంచి కాలాన్ని) నీవున్నూ, ఈ నాడు సజీవులైన అనేకులున్నూ చూస్తారు. కాని, నేను మాత్రం అది చూడడానికి బ్రతికి యుండను. ఓ మహారాజా, అందుకై నా యేడుపు నాపుకోలేకుండా యున్నాను" అని ఋషిపలుకుతూ, ఆసనమునుండి దిగి రెండుచేతులూ జోడించి, శిశువునకు నమస్కరించి తన దారిని పోయెను. ఋషి చెప్పినమాటలకు సుద్ధోదన రాజు అచ్చెరువంది, ఆ చిన్ని బాలునికి తన వండు బుగ్రను ఒంచి నమస్కరించుటగని, ఆ ఋషి యందున్న అపార గౌరముచే, తానును తన చిన్ని కుమారునకు నమస్కరించి, పూజా రూపకంగా తలబంచెను.

మన దేశంలో అనాదినుండి ఒక ఆచారముంది. పురుడు వచ్చిన పదకొండవనాడు తల్లి, పిల్లకూ స్నానం చేయించి, చంటిపిల్లకు నామకరణం చేస్తారు. ఆనాడుమాత్రం, అయిదవ

నాడే శిశువుకు నామకరణం చేసేవారు. ఆలాగున అయిదవ నాడు సుద్ధోదనుడు, నామకరణోత్సవం చేశాడు. పుత్రునకు 'సిద్ధార్థుడు' అని పేరు పెట్టారు. ఆ ఉత్సవానికి కులపెద్దలు, పండితులు, మహామహులు అనేకమంది వెళ్ళారు. ఆ బాలునిచూచి పెద్దలంతా ఆనందించి అతను సామాన్యునివలె వుండడన్నారు. అతడు సంసారంలోకి దిగి తండ్రి అనంతరం రాజ్యభారాన్ని వహించినట్లయితే రాజాధిరాజయ్యే చిహ్నాలున్నాయనీ, అలాకాక రాజ్యపాలనమును నిరాకరించి మతప్రచారకుడే అయితే మత ప్రవక్తలలో అగ్రస్థానాన్ని అలంకరించుతాడనీ ఉత్సవానికి విచ్చేసిన పెద్దలు చెప్పారు. వారిలో ఒక పెద్ద "ఆ బాలుడు తండ్రివలె రాజ్యపాలన చేయడనీ మత ప్రచారకుడై సన్యాసియై ప్రపంచమంతటా యశస్సును పొందుతాడనీ మత ప్రవక్తలలో అతి ప్రఖ్యాతుడౌతాడనీ" నిశ్చయంతో తెల్పాడు.

తన కుమారుడు ప్రతిభాశాలియై, మహామహుడగునని పండితులు కులవృద్ధులు, చెప్పినమాటలు, విని సుద్ధోదనుడు ఆనందించాడు. కాని ఆ యానందం కొంచెం కళంకంతో నుండెను. తన తరువాత కుమారుడు రాజ్యపాలనం చెయ్యాక, గొప్ప సన్యాసి యగుసన్నది కొంచెం జుగుప్స అతనికి కలుగజేసింది. తన కొడుకు మానవులవలె పెరిగి, వివాహం చేసికొని సంసారం చేస్తూ, పిల్లలను కని, తాను వార్ధక్యంవల్ల పరిపాలన చేయుశక్తిలేక యున్నపుడు రాజ్యభారాన్ని వహించి పరిపాలనను వివేకంతోను, మంచిగాను నడిపించునని ఆ రాజు ఆశించుటలో అబ్బురమేమీ లేదు. కొంతకాలమైన తరువాత, నా-

కుమారుడు చక్రవర్తియై ఒక్క కపిలవస్తునేగాక, భారతదేశాన్నంతా పాలింప వచ్చును. ఎవరు చెప్పగలరు! అని ఆ రాజు ఆలోచించుకొనెను. ఈ ఆశ, రాజు మనస్సుని నింపింది. పరమానందంతో సిద్ధార్థుడు సంసారివలె కాలంగడిపేటట్లు చేయుడానికి సుద్ధోదనుడు నిశ్చయం చేసుకొన్నాడు.

ఇంతలో ఆయనకొక విపత్తు కలిగింది. రాజ్ఞి మహామాయ సిద్ధార్థుని కన్నతరువాత రోజు రోజుకూ నీరసించి పోవడం ప్రారంభించింది. రాణికి జరుగగలిగిన చికిత్స, సదుపాయాలు, సేవ, జరిగినా, ప్రసవించిన ఏడవనాడు ఆమె కాలగతి చెందింది. ఆ రాణి పతివ్రతయు శీలవతియు అయియుండడం చేత, ఆమె మరణానికై రాజు అత్యంతం దుఃఖించాడు. ఈ తల్లిలేని బిడ్డను, తన రాణి చెల్లెలైన మహాప్రజాపతి రాణికి వప్పగించాడు. ఆమె ఆ బాలుని తన పిల్లనివలె భావించి పెంచుకొనుచుండెను. సిద్ధార్థుడు తల్లిలేనిలోపము నెరుగక, పినతల్లినే తల్లి అనుకొనుచుండెను.

## 2

నామకరణదినమున పండితులు, పెద్దలు చెప్పిన మాటలు ఋజువు కావడానికి తొందరగా అవకాశం కనిపించింది. తన స్వంతకుమారునివలె మహాప్రజాపతి తన అక్క కొడుకును పెంచుతూంది. సిద్ధార్థునకు ఎనిమిదేండ్లు వచ్చిన తరువాత, ఆయనకు చదువు చెప్పటానికి గురువులను నియమించారు. ప్రతి ఆచార్యుడు బోధించగలిగిన విద్యలనన్నిటిని

చురుగ్గా ఆ బాలుడు నేర్చుకొన్నాడు. ఏ విషయాన్నైనా, బోధించిన ఉత్తర క్షణములో అలవర్చుకొని తిరిగి ఆ విషయాన్ని ఎన్నటికీ మరువకుండ, ఎప్పుడడిగితే అప్పుడు ఆ బాలుడు చెప్పగలిగి వుండడంచూచి, జనకుడు, ఆచార్యులూ, పినతల్లి ఆశ్చర్యపడేవారు. ఈ విధంగా, గణితశాస్త్రంలో ఆ బాలుడు గొప్ప నిపుణత కనబరచేవాడు. ఈతనికి అసామాన్య యోగ్యత అసాధారణ ప్రతిభకలదని అందరికీ స్పష్టమైంది. విద్యలను నేర్చుటలో అనన్యసామాన్య ప్రభావంచూపుతూ శాక్య రాజ్యశ్రీ ననుభవించేవాడయ్యె, తన గురువులకు శిష్యుడు కనపరచవలసిన గౌరవమును చూపుచుండెను. గాంభీర్యముతో, అతిశాంతంగా తన చుట్టుప్రక్కలవారిని అతడు చూచుచుండెను.

చదువులో ఎంత శ్రద్ధ బుద్ధి కుశలత ఉండేవో, ఆట పాటలలోనూ అంత కుశలత ఉండేది. సౌశీల్యము, వినయము, నిస్తంద్రతతో కూడు గుర్రపు స్వారిలో అతి ధైర్యసాహసము లను కనబరచుచు, రథమునడపడంలో నిపుణత చూపించుచు, పేరుపొందిన రథసారధులతో పందెములు వేసి అతను అనేక విజయములను సంపాదించెను పందెము గెలువవలెనని ఎంత కుతూహలముండినను, తన గుర్రములను మాత్రమువాని శక్తినిమించి ఏనాడును తోలలేదు. పందెములో అపజయము సంభవింపవచ్చునుగాని, అశ్వములకు అమితబాధ కలుగకుండా వుండేటట్టు చూచేదయార్ద్రత ఆతనిది. ఒక్క గుర్రముల యందేకాక, సర్వభూతములయందును కృపాళుడై మెలంగు చుండేవాడు. రాజుకొడుకై యుండడంచేత ఏ కష్టములు తెలి యనివాడయ్యె, మనుష్యులైననూ జంతువులైననూ బాధపడు

చుండినపుడు, సానుభూతిచే వాని బాధను తెలుసుకొనుచుండెను. అల్పవయస్సులోకూడా సాధ్యమైనంతవరకువెవ్వరినీ నొప్పింపక, బాధపడుచుండిన వారి బాధను తొలగించుటకు ప్రయత్నించుచుండెను.

ఒకనాడు, తానున్నూ దగ్గిర బంధువుడైన దేవదత్తుడున్నూ జానపదమునకు షికారుకు పోయిరి. దేవదత్తుడు విల్లును బాణములను ధరించియుండుటచే తమ నెత్తిపైగా ఎగురుచుండిన ఒక హంసనుచూచి అమ్ము ఎక్కుపెట్టి కొట్టెను. బాణము ఆ హంసకు తగలగా అది గాయపడి, బాధతో నేలపై గూలెను. ఈ బాలురిరువురును హంసకై పరుగెత్తి పోయిరి. సిద్ధార్థుడు హంసనుచేరి, బాణములను వయికిదీసి, రక్తస్రావము కట్టించుటకై మెత్తని కొన్ని ఆకులను వ్రణముపై వేసి, చల్లని చేతులతో ఆ పక్షిరాజమును నిమురుచు సముదాయిస్తూ వుండెను. అదిచూచి దేవదత్తుడు కుపితుడై తన బాణముతో తాను కొట్టి కిందకు తెచ్చిన హంస తనదేకనుక దానిని తన కివ్వమని వాదులాడడ మారంభించాడు. బాణహత అయిన హంస చచ్చిపోయినట్లయితే అది దేవదత్తునకే చెందునుకాని సజీవమై వుండుటచే దాన్ని ఎవరు పట్టుకుంటే వారిదే అవుతుంది తప్ప ఇతరులకు చెందదని చెప్పి సిద్ధార్థుడు ఆ హంసను ఇవ్వనిరాకరించెను. ఇందుకు దేవదత్తుడెంత మాత్రము అంగీకరించక హంసను కిందకు తెచ్చినది తన బాణమేకనుక హంస తనదేనని పట్టుపట్టెను. ఈ వివాదమును కులపంచాయితీలో తీర్చుకుందామనిచెప్పి పంచాయితీకి వ్యవహారమును సిద్ధార్థుడు ఎఱుకపరచెను.

పంచాయితీదార్లలో కొందరు దేవదత్తుని పక్షమును, మరికొందరు సిద్ధార్థుని పక్షమును వహించి ఎడతెరపి లేకుండా చర్చలు సాగిస్తూవుండగా ఒక అపరిచయస్తుడు లేచి యిలా అన్నాడు. "ఏజీవిఅయినా దాన్ని రక్షింపయత్నించే వారికి చెందవలెనుకాని దాన్నినాశనం చేసేవానికి చెందకూడదు! హంస దెబ్బతిన్న పక్షి. దానిప్రాణములను కాపాడిన వానికి న్యాయతః అది చెందుతుంది కనక ఆహంసను సిద్ధార్థునకీయవలెను." ఈ వివేకవచనమును విని అక్కడి వారందరూ అంగీకారం తెలిపి ఆ హంసను సిద్ధార్థునకే యిచ్చిరి. అతను దానికి మందులు మాకులువైచి వ్రణమును మాన్పి అది యెప్పటివలెతయారైన పిదప మిగిలినపక్షులతో మెలగుటకై దానిని విడిచిపుచ్చెను.

# 3

ఆ కాలంలో మన వారందరూ, మనుష్యుని జీవనమునకవసరము లన్నియు భూమిలోంచే పుట్టుననియు, కావున జీవనధారణమునకవసరములైన ఆహార పదార్థములను పండించే కృషీవలుడే, జాతి కతిముఖ్యమును, ఉపయోగకరమును ఐన పనిచేయువాడని తలంచేవారు. అందువల్ల ఆరోజుల్లో సంవత్సరమున కొకనాడు రాజు, మంత్రిపరివృతుడై, జానపదమునకరిగి తనచేతులతో ఒక పొలమును దున్నే ఆచారముండేది. దీన్నిబట్టి న్యాయమైన పనిబాటులుచేసి కాయకష్టంతో జీవనోపాధిని సంపాదించుకొనుట ప్రశస్తమైన పని

యని రారాజులు ఈ విధమున తమ ప్రజలకు బోధించుచుండే వారు. "హాళికులైననేమి, గహనాంతరసీమల కందమూల గౌద్ధాళికులైననేమి, నిజదార సుతోదర పోషణార్థమై" అని మన పోతన్న కవిశ్రేష్ఠుడు చెప్పియున్నాడుగదా!

ఒకమాటు వసంతఋతువులో, దున్నే సమయము రాగా సుద్ధోదనరాజు, సర్వరాజ చిహ్నా పరివృతుడై కపిలవస్తు నగరముదాటి, ఆచారప్రకారము "రాజకర్షణ" ఉత్సవం జరప టానికి పొలములోనికి వెళ్ళెను. ఊరిలోని ప్రజలందరూ రాజు ననుసరించియుండిరి. సంవత్సరానికి ఒక్కమాటే గొప్పయుత్సవం జరిగేది. రాజు దున్నడం అయిన పిదప, పెద్ద సంతర్పణ, గొప్ప కోలాహలం జరుగుతుండేవి. అందుకయి ప్రజలందరూ ఈ పండుగకు వెళ్తుండేవారు. ఆనాడు రాజు తనకుమారుని కూడా తనతో తీసుకువెళ్ళి, కొంతమంది నౌకరులకు అతన్ని ఒప్పచెప్పి, తాను దున్నడానికై వెళ్లాడు. రాజుచేపట్టిన నాగలి బంగారు రేకుతో కప్పబడియున్నది. నాగలికి పూన్చిన ఎడ్లు సువర్ణా భరణములతో శృంగారింపబడ్డవి. రాజు వెనుక మంత్రులు, వెండితో అలంకరింపబడిన నాగళ్ళతోను, ఎడ్లతోను సామాన్య ప్రజలు, సత్తువైన ఆ నల్లరేవళ్ళను దున్నడం ప్రారంభించిరి.

ఈ దున్నడం ముగియగానే సంతర్పణప్రారంభమయింది. సిద్ధార్థుని వద్దనుండిన నౌకరులు వానిని విడిచి, విందారగించ డానికి పోయిరి. రాకుమారుడు తానేకాకియై యుండడం చూచి, ఈ పండుగ దినమున తాను చూచిన విషయాలను గురించి ప్రశాంతంగా ఆలోచించుకోడానికి సమయం కలిగిందని

ఆనందిస్తూ, మెల్లగాలేచి కొంతదూరానవున్న ఒక మహా ఫలవృక్షఛాయక్రింద చేరి, చూచినదాన్ని గురించి మననం చెయ్యడం ప్రారంభించాడు.

రాజు, మంత్రులు, ప్రజలూ కూడా భూమినిదున్నుతూ అతికులాసాగా కన్పించారు. నాగళ్ళకు పూనిన ఎడ్లు మాత్రం అంతసంతోషంతో ఉన్నట్లు కాన్పించలేదు. గడ్డిదుబ్బులతోను, మోళ్ళతోను నిండిన ఆ భూమిని దున్నడంలో, పూనిపూని యీడ్చినగాని, నాగళ్లు కదలడంలేదు. అందుకై పశువు లన్నీ చెమటలుకార్చుతూ, ఎగశ్వాసలు తీస్తూ, అలిసి సొలసిఉన్నట్లు చూచాడు. అంతేకాక, దున్నువారు కోరునట్లు ఎడ్లు నడవక పోతే, గట్టి దెబ్బలుకూడా తింటుండేవి. ఉత్సవదినాన అందరూ అతిసరతోషంగా ఉండవలసిననాడు, దుఃఖదాయకమైన కొన్ని సంభవాలుమాత్రం జరుగుచుండును.

అక్కడ పక్షులను జంతువులను, పురుగులను అతను చూడ్డం ప్రారంభించాడు. తన పాదములదగ్గరనే ఒక తొండ పురుగులిడుచు పోయి, ఇతరులకు హానిచేయకుండా పాటుబడు చున్న చీమలను నాలుక జాచి కబళించడం కనిపించింది. కొంత సేపటికే ఒక పాము చల్లగానచ్చి తొండనుపట్టి దిగమింగడం కన్నాడు. ఇంతలో ఒక గద్ద ఆకాశంనుండి దూసుకొనివచ్చి పామునుపట్టి, చంపి తినడం కళ్లారా కాంచాడు, సంసారంలో అతిరమ్య దర్శనాల్లో అంతస్థంగా దుఃఖభాజకములైన విషయాలుంటాయని గ్రహించాడు. తన చిరుతప్రాయంలో తానెటువంటి కష్టాలననుభవింపకపోయినా, తనచుట్టూ నిరంతరమూ

ఎవరికో ఒకరికి దుఃఖము, కష్టము కలుగుతూనే ఉంటుందని మన సారా తెలుసుకొన్నాడు. ఈ విధంగా ప్రపంచం దుఃఖభూయిష్టమై ఎందులకుండాలని దీర్ఘాలోచనలో మునిగి, ఆనాటి పండుగను, తండ్రిని, దున్నడాన్ని అతడు మరిచిపోయెను.

ఇంతలో 'రాజకర్షణము' ముగిసింది. సంతర్పణ అయిపోయింది. సిద్ధార్థుని వద్దనుంచబడ్డ నౌఖరులు కడుపార భుజించి, రాకుమారునికై వెళ్ళిరి. ఆతడచట కానక, రాజునకేమి చెప్పుదమా అని భయకంపితులై నిటు నటు ఆ ప్రదేశము నంతటినీ వెదక ప్రారంభించారు. చిట్టచివరకు, శిలాప్రతిమవలె నిశ్చేష్టితుడై, ప్రపంచమును మైమరచి, జీవితం గురించి ఆలోచనా నిమగ్నుడై యుండిన ప్రభు పుత్రుని చూచి, బ్రతుకు జీవుడా అని వానివద్దకు పోయి మాట్లాడదొడగిరి – కాని ఆ బాలయోగి, తన ఊహా ప్రపంచంలో విహరించుచూ, ప్రపంచాన్ని మైమరిచియుండ, సేవకుల మాటలు వాని శ్రోత్రపథమున పడినట్లు కాన్పించ లేదు. కొంతసేపటికి ఆతడు ధ్యానం నుండి బయటపడి, సేవకులతో తన తండ్రివద్దకు వెళ్లెను. తమ తమ ప్రాణముల నమిత్తంగా ప్రేమిస్తున్నా, జీవించడానికి అన్ని కష్టాలననుభవించుచూ జీవాలను పోగొట్టుకొంటున్న జంతువుల గురించి కరుణారసపూరిత మనస్కుడై, వాని శ్రేయస్సు గురించి యోచించుచూ, తండ్రితో ఇంటికి చేరెను.

సిద్ధార్థుడు ఇంతచిరుతప్రాయమునసే, జీవితం, సంసారం, దుఃఖం మొదలైన విషయాలను గురించి తీవ్రంగా ఆలోచించ డంచూచి, ఇసి వరకు ఆ ముదుసలిఋషి చెప్పిన మాటలు

జ్ఞాపకము రాగా, పుత్రుడు సంసారవిముఖత చెంది సన్యసించి, తన తరువాత రాజ్యపాలనముచేయడేమో అని తండ్రి భీతి చెందాడు. పుత్రునిలో ఈ ఆధ్యాత్మిక చింత పెచ్చుపెరిగిన, ఆతడు రాజ్యమును పరిపాలించడని తెలుసుకొని, వానినట్టి దీర్ఘాలోచనలనుండి తప్పించడానికి ప్రయత్నించ నిశ్చయించాడు. అన్ని విధములా పుత్రునకు సర్వసౌఖ్యాలూ భోగాలూ కల్పించిన, భోగానుభవంలో ఆధ్యాత్మికచింతలుమాని, జీవితతత్త్వం గురించి ఆలోచనలు సలపక సంసార సుఖములనను భవిస్తూ, తన తదనంతరం రాజై పరిపాలన కొనసాగిస్తాడని అనుకున్నాడు.

అందుకై, శిల్పులరప్పించి మూడు భవనాలను తయారుచేయమని ఆజ్ఞాపించాడు, చలికాలంలో వెచ్చగా బయట ఉండడానికీ, దిట్టమైన కర్రపలకలతోను, లోపల సువాసనగల దారు శకలాలతోను, ఒక భవనం నిర్మించమన్నాడు. ఈ ప్రాసాదంలో తన కుమారుడు చలిబాధలేకుండా వెచ్చగా శీతాకాలం గడపాలని ఆతని ఉద్దేశం. ఆలాగుననే వేసవికాలంలో సూర్యభగవానుడు ప్రచండకిరణాలతో ప్రపంచాన్ని వేధిస్తున్న సమయంలో, చల్లగా వేడిబాధ లేకుండా, కాలం గడపడానికి మణిశిలలతో ఇంకొక ప్రాసాదాన్ని నిర్మింపమన్నాడు. వర్షాకాలంలో, అధికవర్షాలనుండి కాపాడటానికి ఇటికలతో నీలిపెంకులకప్పుతో మరొక భవనాన్ని తయారుచేయమన్నాడు. ఈ ప్రాసాదముల చుట్టునూ, నానా పుష్పఫలభరితములైన వృక్షములతోను, చెట్లు చేమలతోను, పద్మాకరములతోను, చిన్ని చిన్ని సెలయేరులతోను, ప్రమదవనాలను ఏర్పాటు చేయమ

న్నాడు. రేయింబవలు ఆధ్యాత్మిక చింత లేకుండా, నిరాలోచనాపరుడై కాలం సాగించటానికి అనేకమంది సమాన వయస్కులగు యువకుల నాతనిచుట్టూ వుంచాడు. ఈ కేళీ గృహాల్లో, ఈ ప్రమదవనాల్లో, సర్వ భాగ్యభోగ్యానందాలననుభవిస్తూ తన కుమారుడు ప్రపంచ దుఃఖములను గురించి ఆలోచన సలపకుండా వుండేటట్లు చేయగలుగుదునని రాజు ఆశించుచుండెను.

కాని ఎన్ని ఇట్టిభోగాలను సమకూర్చినా, కేళీభవనాల్లో సౌఖ్యాలను కలుగజేసినా, ప్రమదవనాలెంత రమ్యములైనా, వనవిహారాలెంత ఆనందదాయకములైనా, సిద్ధార్థుడు మాత్రం సంసార దుఃఖాల గురించి ఆలోచించకుండా ఉండలేదు. రాజది గ్రహించాడు. మనస్సును వేధించే తీవ్రాలోచనలనుండి యువరాజు మనస్సును, సౌఖ్యాలమీదకు త్రిప్ప దలచాడు. కాని, రాజు అందులో కృతకృత్యుడు కాలేదు. ఆముదుసలి ఋషి చెప్పిన జోస్యము నిరర్థకమగునటుల ఏమిచేయనా అని ఆలోచించుచు, మంత్రులను రావించి వారితో సలహా చేశాడు.

యువకుని మనస్సును ఆధ్యాత్మిక చింతనుండి తప్పించడానికి, వానికి సౌందర్యరాశియగు కన్యను వివాహం చెయ్యడంకంటె ప్రశస్తమైన కార్యం మరేదీలేదని వారాతనికి సలహా యిచ్చారు. రూపవతి అగు కన్యను వివాహంచేస్తే, ఆమెతో ఆనందడోలికల నోలలాడుతూ, జీవిత దుఃఖాలను మరిచిపోతాడని రాజుతో మంత్రులు విన్నవించారు. అలా చేస్తే సంసార

బద్ధమనస్కుడై, యుక్తకాలమున రాజ్యపీఠమును అతను అధిష్ఠించునని చెప్పుకొన్నారు. ఈ ఉపదేశం రాజునకునచ్చింది. కాని తదితర ప్రపంచాన్ని మరిపింపజేయు సౌందర్య రాశియగు కన్యను సంపాదించుటెట్లు అని రాజు ఆలోచిస్తున్నాడు.

కడు శ్రద్ధతో ఆలోచించి, చివరకు రాజొక ఉపాయాన్ని తలపెట్టాడు. ఒక నిర్దిష్ట దినమున దేశంలోనున్న సుందరమూర్తులగు కన్యలందరూ కపిలవస్తుకువచ్చి, సిద్ధార్థ రాజకుమారుని యెదుట వరుసనుపోవలెనని యు, వారిలో అతి సౌందర్యవతికి యువరాజు తగిన పారితోషిక మిచ్చునని యు, తదితర కన్యలకు వారివారి సౌందర్యాను సరణి తగిన ఉపాయన ముల నిచ్చునని యు, రాజ్యమంతటా రాజు చాటించెను. ఆ నాడు మంత్రులలో కొందరచటనుండి, ఆ రమణీమణుల యాత్రలో ఏ కన్యను గాంచినపుడు యువరాజు ఎక్కువ ఆనందాన్ని కనపరుస్తాడో, అది చూచి, ఆ కన్యనుగురించి తన కెరింగించమని ఆజ్ఞాపించెను.

ఈ సౌందర్య పోటీ రోజు వచ్చింది. రాజ్యంలో నున్న కన్యలందరూ కన్నులు మిరిమిట్లు గొలుపుతూనగరికి వచ్చారు. ఆ సుందరమూర్తులు ఒకరివెనుక నొకరు జనుచుండిరి. ప్రతి రమణీమణికిని, తన యెన్నికలో తగినట్టి ఉపాయనమును ఇచ్చుచుండెను. కాని ప్రతికన్యయు యువరాజ హస్తస్పర్శకై కుతూహలపడక, వాని చెంతకు పోవడమన్న వెరచుచు, పారితోషికమును అందుకొని అతి తొందరగ తమవారిలో కలిసిపోవుటకు ఇచ్ఛగించుచుండెను. ఇందులో కారణము లేక పోలేదు.

సిద్ధార్థుడు ఇతర యువకులవలె సంచరించుటలేదు. వారి వైపు చూచినట్లైనను అతడు కాన్పించుటలేదు. ప్రతి కన్యకకు తగిన ఉపాయనాన్ని అందిస్తూ, తన సౌందర్య ముఖ విలాసాల గురించికాక, అదేదో విశిష్ట విషయముగూర్చి దీర్ఘాలోచనలో మునిగి యున్నట్లు కాన్పించుచుండెను. వారిలో కొంత మంది, సింహాసనముపైని కూర్చునియుండిన యువరాజు మనుష్యునివలె కాక భూమిపై అవతరించిన దేవునివలె కాన్పించెనని చెప్పిరి. ఈ సౌందర్యతీర్థాన్ని కనిపెడుతున్న మంత్రులు, రాజకుమారుడు ఏ కన్యయందునూ ఎట్టివికాసము నూ కనపరచలేదనియు, తలపెట్టిన ఉపాయము నిరర్థకమైనదనియు సుద్ధోదనరాజుతో చెప్పవలసి వచ్చినదని విచారించుచుండిరి.

ఆఖరిపిల్ల ఆఖరి పారితోషికాన్ని పుచ్చుకొని నమస్కరించి పైదాటగా, కొంచెమాలస్యంగా చిట్టచివర నింకొక కన్య వచ్చి, రాకొమరుని గని, ఇతరకన్యలవలె అధోముఖి కాకుండా యుండి, గతుక్కుమంటూ మెల్లగా అతన్ని సమీపించి ముఖంలోకి తేరిబారిచూస్తూ, చిరునవ్వుతో "నాకేమీ పారితోషికం మిగలలేదా?" అని ప్రశ్నించెను. రాజకుమారుడు, ఆమెను చూచి చిరునవ్వుతో "ఇవ్వవలసిన పారితోషికము లన్నియు అయిపోయినవి, అయినా ఇది ఉంది. దీన్ని తీసుకో" అంటూ తన కంఠముననున్న హారమునుతీసి, ఆ కన్యమధ్యమును చుట్ట పెట్టెను. అది కని మంత్రులందరూ ఆనందభరితులై, ఆ కన్య సుప్పబుద్ధుని కుమార్తె యశోధర అని తెలిసికొని, సుద్ధోదనునకు జరిగిన వృత్తాంతమునంతయు తెలిపిరి. ఆ మరునాడె

సుద్ధోదనరాజు తన కుమారునికి యశోధర కన్యనిచ్చి వివాహము చెయ్యమని సుప్పబుద్ధునకు కబురంపెను.

శాక్యులు బలిష్ఠులైన పర్వతవాసులు. వారిలో యువకు డెవ్వడైనను వివాహం చేసికొన తలపెట్టిన, తానురాజ్యములో నున్న యితర యువకుని కెవ్వనికినీ, గుర్రపుస్వారిలోనూ, ఖడ్గప్రయోగములోనూ, బాణమోచనములోను, తీసిపోడని ఋజువు చెయ్యవలసియుండేది. సిద్ధార్థుడు యువరాజైనను, ఇతర యువకులవలె తానును ఈ ఆచారాన్ని అనుసరింప వలసివచ్చినది.

శాక్యయువకులలో కౌతులలోను, ఖడ్గధరులలోను, ధనుష్మంతులలోను అతినిపుణులందరూ కపిలవస్తు మైదానంలో ఒకనాడు కూడినారు. వారిలో ప్రతివాడును, ఆ మంత్రి ప్రజాసమూహ సమక్షమున, అశ్వారోహణ, ఖడ్గప్రయోగ, ధనుర్విద్యలలో తమకుండిన ప్రావీణ్యతను గనపరుచుచుండిరి. తన శ్వేతాశ్వము కంటకముపై స్వారి చేయుచు సిద్ధార్థుడు శస్త్రప్రయోగాది విద్యలలో తన నైపుణ్యమును గనపరిచి, ఎవరికిని తీసిపోడని నిరూపించెను.

తన దగ్గిరబంధువు దేవదత్తుడు బాణప్రయోగములో బహు కుశలుడని పేరు పొందెను. ఆతనికంటెను సిద్ధార్థుడు దూరంగా బాణాన్ని కొట్టగలడని చూపించాడు. ఖడ్గప్రయోగంలో,సిద్ధార్థుడు ఒక్క వేటున ఒక చెట్టును నరికెను. కత్తి ఇవతలనుండి అవతలకు నీటుగా దూసుకొని పోయింది, కాని చెట్టు ఏమి అవనట్టు నిలబడియుండెను. ప్రజలందరూ చెట్టును రాజకుమారుడు నరకలేకపోయెనని అనుకొను చుండగా, చిన్నగాలి

పీచింది. అందుతో చెట్టుమీదముక్క కిందకొరిగింది. ఖడ్గ విద్యలో తన స్వంత సవితితమ్ముడు నందునికంటె ఎక్కువకుశలతను గనపరిచెను. అంతవరకు రాజ్యంలో నందుని మించిన శక్తిశిప్పగలిగినవాడు లేడని అందరూ అనుకొంటుండేవారు.

తన శ్వేతాశ్వము కంటకముపైనెక్కి, సిద్ధార్థుడు ఇతర రాతులను పందెములో నోడించెను. అదిచూచి సహించలేక, పందెమోడినవారు "అట్టి జవాశ్వము మాకుంటే మేము గెలిచియేయుందుము. ఈ గెలుపు, అశ్వ ప్రభావమువల్ల గాని, రాతు నిపుణతవల్ల కాదు. ఇక్కడొక నల్లని పోతుగుర్రమున్నది. ఎవరినీ నేటివరకది స్వారి చేయనియ్యలేదు. ఎవరా గుర్రాన్ని అధిరోహించి, ఎక్కువ కాలముండగలరో పందెము వేసుకుందాము" అని పల్కిరి.

ఒకరితరువాత నొకరు, యువకులు ఆ క్రొగుర్రాన్ని పట్టుకొని, స్వారిచేయ యత్నించిరి. కాని అది ఒక్కనినైనా వీపుమీదఉండనివ్వక కిందపడవైచేది. రాతులందరిలోను ప్రశస్తి వడసిన అర్జునుడను ఆశ్వకుడు కొంత పెనుగులాటతో ఆ గుర్రపు మీదకెక్కి పందెపురాతును చుట్టునూ ఒక్క పర్యాయము కొరడాతో కొట్టి పరిగెట్టించ గలిగాడు. ఇంతలో ఒక్క తృటిలో, ఆ దుష్టాశ్వము తన బుర్ర తటాలున తిప్పి, తన గట్టి పెద్ద పళ్ళతో అర్జునిని కాలుపట్టుకొని, కిందకులాగి కొట్టి, వానిని కాళ్ళతో తొక్కి చంప యత్నించుచుండ, అక్కడి గుర్రపువాళ్ళల్లో కొందరు వానిని పైకీడ్చి, ఇతరులా గుర్రాన్ని కర్రలతో మోది బయట కంపారు. అటు జరగకపోయిన,

గుఱ్ఱము అర్జునుని కాళ్ళతో తన్ని చంపియే యుండియుండును. ఇక సిద్ధార్థునివంతు వచ్చింది. అర్జునిని వంటి రౌతునకే చావు దప్పి కన్నులొట్ట యినట్లైతే, ఇక సిద్ధార్థుడు తప్పక ఆ నీలాశ్వపు దౌష్ట్యానికి గురియయి, మృతిజెందునని అంతాతలంచిరి.

సిద్ధార్థుడు ప్రశాంతంగా ఆ గుఱ్ఱమువద్దకుపోయి, దాని మెడమీద ఒకచేతిని మూతివద్ద యింకొకచేతినివుంచి, చల్లగా పలుకులు పలికి, దాని ప్రక్కల తట్టుచుండెను. ఇంతలో ఆ గుఱ్ఱము ఎట్టి అల్లరి చెయ్యకుండా నిలుచుండెను. దానిపైనెక్కి సిద్ధార్థుడు తనయిచ్చవచ్చినటులు గుఱ్ఱమును పరుగులెత్తించెను. గుఱ్ఱమాతనికి లొంగిపోయి, వశమయ్యెను. తన వద్దకు నిర్భయంగా, కొట్టే ఉద్దేశంతో కాకుండా, ప్రశాంత వచనాలను మాటలాడుతూ, దయతో చూచు కొంటూ మచ్చిక చేయడానికి ఎవ్వరూ ఇదివరలో ఆ గుఱ్ఱమువద్దకు పోలేదు. సిదార్థుడే అటులచేయుటలో మొదటివాడు. అందుకై ఆ గుఱ్ఱము ఆతనికి లొంగిపోయెను.

అప్పుడందరూ సిద్ధార్థునంతటి మేటిరౌతు లేడని ఒప్పుకొనిరి. ఇంతటి ధనుష్మంతుడు, ఖడ్గధరుడు. మేటిగాను యశోధరవంటిసౌందర్య రాశిని వివాహమాడుటకు తగినవాడని అందరూ అంగీకరించిరి. సుప్పబుద్ధుడు సంతోషముతో తన పుత్రికను సిద్ధార్థ రాకుమారున కిచ్చి వివాహము చేయుటకొప్పుకొనెను, సిద్ధార్థ యశోధర వివాహ మతి వైభవముతో జరిగెను. ఈ దంపతులు సుద్ధోదనునిచే నిర్మింపబడి, సర్వ భోగములకు నిలయమైన ఒక ప్రాసాదములో కాపురము చేయుట మొదలిడిరి.

ఇక సిద్ధార్థుని మనమున కెట్టి కలత కలుగకుండా వుండ డానికి సుద్ధోదనుడు, కుమారుని పరివారజనంలో ఒక్కడైన ముసలితనంగూర్చి గాని, జబ్బుగురించిగాని, చావుగురించి గాని ఒక్క మాటనైన జారవిడువ కూడదని నిష్ఠురంగా ఆజ్ఞాపించెను. ఇంతటితో ఆగక పరివారజనంలో వార్ధక్య చిహ్నాలు గాని, బలహీనపులక్షణాలుగాని, జబ్బు రానున్నదన్న అనుమానము గాని యున్నవారినందరినీ పంపివైచి, యౌవ్వనులు, సుము ఖులు, ప్రియదర్శనులు, ఐనవారినే రాజకుమారుని ప్రాసాదం లోను, కేళీవనాల్లోను ఉంచెను. ఎవ్వరైనను జబ్బువడితే వెంటనే వారిని అచటనుండి పంపివేసి, తిరిగి సంపూర్ణారోగ్య వంతులైన తరువాతనే రానిచ్చుచుండెను. యువరాజ సమ క్షంలో ఎవ్వరును దుఃఖమునుగాని, అలసటనుగాని చూపించ కూడదని హుకుమును జారీచేసెను. సేయింబవలు. అందరునూ చిరునగవు మొగములతో, సంతోషంతో, అత్యుత్సాహంతో మెలంగుచుండవలెనని ఆజ్ఞాపించెను. అంతేకాక, గానాబజానా నృత్యం అయిన తరువాతకూడా గాయకులు నటకులు ఎట్టి నీరసాన్నీ వ్యక్తీకరించగూడదని గట్టిగా వక్కాను. ప్రపం చంలో ఆనందమూ, యౌవ్వనమూ, నవ్వూ తప్ప వేరేమీలేదని రాజు సిద్ధార్థునకు నిరూపించ యత్నించెను. యువరాజును ప్రపంచకపు యథార్థపరిస్థితులను తెలుసుకోకుండా ఉంచడా నికై, కేళీవన పరివృతమైన ఆప్రాసాదముచుట్టును ఎత్తైన ప్రహరీ గోడను పెట్టించి అందుండు ద్వార్వారికులకు యువరాజును ఎన్నడును గోడలుదాటి పోనివ్వవద్దని యాజ్ఞాపించెను.

ఈ విధంగా సిద్ధార్థుని రాజు, యౌవ్వన రాజభోగములతో, నిమగ్నుడగునటుల జేసి, సౌఖ్యానుభవంతప్ప వేరేమియు జీవితంలో లేదనియు, సంసారముకంటె సారవంతమైనది లేదనియు, నిరూపించి సన్న్యాసముమీద మనము పోకుండా చేయుటకు వీలైన యత్నము లన్నిటినీ చేయుచుండెను.

# 4

ఎన్నిభోగముల ననుభవించుచుండినా, దుఃఖమన్నది ఏమిటో తెలియకపోయినా, సిద్ధార్థుడు మాత్రము మనస్సులో సుఖము ననుభవించుటలేదు. దాటరాని ఆ చుట్టుగోడలబయట నేమున్నదో తెలియ గోరుచుండెను. బహిఃప్రపంచము నుండి పుత్రుని మనమును త్రిప్పుటకై, క్రొత్తక్రొత్త వేడుకలను, క్రొత్త క్రొత్త ఆనందోత్సవాలను ఏర్పాటుచేయు చుండెను. ఉత్సవము లధికమైనకొలది, సిద్ధార్థుడు తన మూత ముప్పిడి జీవితంతో మరింత అసంతృప్తి చెందుచుండెను. ప్రాసాదకేళీవన జీవితం ఎంత ఆనందముతో నుండినను, ప్రాకారకుడ్యముల బయటనున్న ప్రపంచాన్ని తెలుసుకోవాలన్న వాంఛ దినదినమునకు ఎక్కువగు చుండెను. బహిఃప్రపంచమెటులున్నదో, సామాన్యజనమే విధమున జీవించుచుందురో తెలుసు కొనవలెనన్నదనియు, అట్లు తెలిసికొనినగాని తనెంతమాత్రము సంతృప్తమనస్కుడై యుండనేరననియు, జనకునితో సదేపదే అతడు చెప్పుచుండెను. పుత్రుడీ విధమున తిరిగి తిరిగి అడగడంచూచి, రాజు విసుకుచెంది, ఒకనాడు "పుత్రకా, సరే అటులనే కానిమ్ము.

నీవు ప్రాకారం దాటి సామాన్య ప్రజలేలాగు జీవించుచున్నది చూతువు, కాని నీవుచూడడానికి తగినటుల మొదటనేనన్నియు నేర్పాటు చేయవలసి యుంటుందని" రాజు జవాబిడి, యువ రాజు ఫలానారోజున పట్టణ విహారం గావించునుగాన ప్రజ లందరూ ఆ నాడు, ఇళ్ళను తుడిచి, పరిశుభ్రపరచి వెల్లలు వైచి, కొత్తజెండాలను ఎగరవేసి, గృహాద్వారముల కడనూ. కిటికీలలోను పువ్వులనుంచి, అలంకరించి నయనోత్సవం అయే టట్లు చెయ్యమని వార్తాహరులు గూడా యూరంతటనూ దండోరా వేయించెను. రాకుమారుడు వీధులలో పర్యటించు చున్నంతసేపు, గుడ్డివాడుగాని, గూనివాడుగాని, పొట్టవాడు గాని, కుష్టువాడుగాని, ఏ రుగ్మత యున్నవాడుగాని బయటకు రాకుండా ఇంటిలోన యుండి యుండవలెనని ఆజ్ఞాపించెను. నవ్వుముఖాలతో బలిష్ఠులైన యువకులు మాత్రము బయట తిరుగుతూ రాకొమరునకు స్వాగతం ఇవ్వవలెనని చాటించెను. ఆ నాడు శ్మశానవాటికకు ఏ శవమును దహనార్థము గొంపోవ బడకూడదనియు, మరునాటివరకూ అట్టి శవము ఇంటిలోనే యుంచబడవలెననియు వాని ఆజ్ఞ.

ప్రజలు రాజాజ్ఞను శిరసావహించిరి. వీధులుతుడిచి శుభ్రపరిచి, ధూళిరేగకుండ నీటితో తడిపిరి. ఇళ్ళకు దట్టమైన సున్నపుపూతలుపూసి, గృహద్వారములను పూమాలలతో నలంకరించిరి. యువరాజు పోవుమార్గమున కిరుప్రక్క లనున్న చెట్లనుంచి, రంగు రంగుల గుడ్డజండాలను వేలాడగట్టిరి. వారికి తోచినంతవరకు స్వర్గసీమలోని పట్టణంవలె కాన్పించేటట్లు, ప్రజలు పట్టణాన్ని అలంకరించిరి.

ఈలాగున అంతయూ సిద్ధమైనపిదప, సిద్ధార్థుడు ప్రాసాదమునుండి బయలుదేరి, సుప్రశస్తమైన రథము నెక్కి, మెల్లగా ఊరు వీథులం దిరుగుచుండెను. ఎటుచూచినను నవ్వు ముఖాలతో, ప్రజలందరూ కాన్పించిరి, కొన్నిచోట్ల గుంపు గుంపులుగా ప్రజలు గుమిచేరి, "యువరాజుకూ, జై" అని జయజయ ధ్వానాలు చేసిరి. యువరాజదర్శనమునకై సంతోషించనివాడే కాన్పించలేదు. కొంతమంది రథముముందు పరుగిడుచు, పూవులను బాటపై వెదజల్లుచుండిరి. ప్రజలీవిధమున తనయాజ్ఞల నిర్వర్తించినందులకు రాజు సంతోషించి, ఇక తనకుమారుడు సంతోషదాయకముకాని ఏదృశ్యమును చూడలేదనియు, ఎక్కువ తృప్తితో అప్పటినుండి కుమారుడుండుననియు, దీర్ఘాలోచనలుమాని ఆనందంతో సంసారము గడుపుననియు, ఆనందించెను.

అంతా సవ్యంగా నడిచిందని అందరూ సంబరపడుతూంటే, రోడ్డుప్రక్కనున్న ఒక గుడిశలోనుండి పండుబుర్రతో, చింకిగుడ్డలతో ఒక ముసిలివాడు తప్పటడుగులు వేసుకుంటూ బయటకొచ్చాడు. ముఖమంతా ముడతలు ముడతలు పడియుండెను. కళ్ళుపొరలుగప్పి, నిరానందంగా ఉండెను; నోట ఒక్కపన్నైనను లేదు. వణకుచు, వంగిపోయి, పుల్లలవంటి రెండుచేతులతోను క్రిందపడకుండ ఉండడానికై ఒకకర్రను యూతపట్టుకొనియుండి, చుట్టునూయున్న ఆనందదాయక దృశ్యములను చూడనట్లే, మెల్లగ కాళ్ళనీడ్చుకొని, తినడానికేమైన నివ్వనియెడల ఈ నాడే చచ్చిపోదునని పాలిపోయిన

పెదిమలతో గొణుగుకుంటూ అస్పష్టవచనాలతో బిచ్చమడు గుతూ ఆముసలివాడు పోవుచుండెను.

ఈ ముసిలి బిచ్చగానినిచూచి, అక్కడివారందరూ బహుకుపితులైరి. రాజాజ్ఞకు విరుద్ధంగా, ఆముదుసలి, యువ రాజు ముందటిమాటు పట్టణ పర్యటనంగావించుచుండగా, వానికంటబడ్డం వారికెంతమాత్రమూ ఇష్టములేక, వానిని ఇంటిలోనికి ద్రోయ ప్రయత్నించిరిగాని, యువరాజాతనిని చూచి, ప్రక్కనున్న ఛన్నుడనే సేవకుని "అదేమిటి, ఛన్నా? ఆతడు మనిషియేగదా? ఎందుకాలాగు వంగిపోయి యున్నాడు? నీవలె, నావలె తిన్నగా ఎందుకు నిలబడలేడు? ఎందుకాలాగు వణకుచున్నాడు? ఆతనిజుట్టు, నాజుట్టువలె నల్లగానుండక, ఆ చిత్రవర్ణములో నెందుకున్నది? ఆతని కళ్లేమి ఆలాగునున్నాయి? వాని పళ్లేవి? కొంతమంది మను ష్యులు ఈలాగుపుడతారా ఏమిటి? ఓ ఛన్నా, ఇదేమిటో తెల్పుము" అని తొందరగా ప్రశ్నించెను.

అపుడు ఛన్నుడు, "ఓ రాజా, ఇట్టివాణ్ణే ముసలివా డంటారు. ఆతడీలాగ పుట్టలేదు. తదితరుల వలనే ఈతడు పుట్టాడు; ఒకప్పుడు, యౌవ్వనములో ఆతడు బలంగా, నిట్ట వలెనుండి, నల్లని వెంట్రుకలతో, నిర్మలమైన దృష్టితోనుండే వాడు, చాలాకాలం భూమిమీద సజీవుడైయుండడంచేత, ఈలాగు, తయారైనాడు. ఓ రాజా, అతన్నిగురించి ఆలోచించకుము. ఇది కేవలము ముసలితనము" అని జబా బిడెను.

రాజకుమారుడు, "ఏమిటి నీ మాటల యర్థము, ఛన్నా? ఇది అతి సామాన్యమనియా నీ భావం? భూమిపై చాలాకాలం జీవించే ప్రతివాడునూ, ఈలాగునగుననియా నీ వనేది? అటుగాదుగదా! ఇదివరలో నేనిట్టిదేనినీ కనలేదు. ముసలితనము! ముసలితనమంటే ఏమిటి?" అని ఛన్నుని ప్రశ్నించెను.

రథసారథి ఛన్నుడదివిని "ఓ రాజా, చాలాకాలం భూమిపై జీవించియుండేవాడు, వీనివలెనే అవుతాడు" అని జబాబు చెప్పెను.

"ప్రతివాడూ ఆలాగునవుతాడా, ఛన్నా! నీవు, నేను, జనకులు, నా భార్యా, మనమందరమూ పళ్లులేక, నల్లనిజుట్టు లేక తిన్నగయుండక, వంగిపోయి, కదలవలెనన్న కర్రయూతపై నాధారపడియుండవలెనా?" అని రాకుమారుడు ప్రశ్నించెను.

"ఔను రాజా. ప్రపంచంలో ప్రతివాడును తగినంత కాలం బ్రతికియుండినయెడల, ఈ మనిషివలెనె అగును. దాన్ని అడ్డలేము. అది ముసలితనము" అని ఛన్నుడు ప్రత్యుత్తర మిచ్చెను.

అదివిని వెంటనే తన నింటికి తీసుకొని పొమ్మని సిద్ధార్థుడు ఛన్నుని ఆజ్ఞాపించెను. ఆనాడు పట్టణంలో మరేమీచూడ నిచ్ఛగించలేదు. అతి సంతోషంతో జే జే ధ్వనులుచేయుచున్న పౌరగణాలనుగాని, సుశోభితపట్టణాన్ని గాని చూచి మరి ఆనందించలేక పోయాడు యువరాజు. రాజ్యానికి వారసుడైన తాను, తాను ప్రేమించినవాళ్ళు

ఎంతధనవంతులైనా, గొప్పవాళ్లైనా, బలవంతులైనా, ముసలితనం రాగానే దుర్బలులై, బ్రతుకులో ఆనందంలేకుండా పోవలసిందేనా? అది సంభవించకుండా చేసే తరుణోపాయ మేమియునులేదా? ఇట్టి ఘోరావస్థగురించి ఏకాంతంగా ఆలోచించుకోవాలని ఆతడు ఇంటికిపోవ త్వరపడెను.

ఇల్లుచేరినపిదప, భోజనమునకై కూర్చొనెను. వంటలవారు అతిరుచ్యపదార్థముల తనికి వడ్డించిరి. "ఒకనాడు నేను ముదుసలినయ్యెదను"అని వితర్కించుకొనుచు అతను ఏభక్ష్యమును తాకనైన తాకలేదు. వడ్డనను తీసివేసిరి. గాయకులు, నటకులు తమగేయములతో నాట్యములతో వానికానందము కలుగజేయజూచిరిగాని "ఏదోఒకనాడు, మీరందరూ, మీలో అతిసుందరవతియు, ముసలివాళ్లు అయ్యెదరు"అని చింతించుచు, వారిపాటలను వినలేకపోయెను, వారినాట్యములను చూడలేకపోయెను. వారలనందరిని పంపివేసి, పవళింప యత్నించెను. గాని, నిద్రరాక కంటిరెప్పైన పడలేదు. తాను, సుందరవతియగు తనభార్య, ఒకనాడు పండినజుట్టుతో, పళ్లులేక, ముడతలుపడిన ముఖాలతో తగ్గినదృష్టితో ఆనాడు కపిలవస్తునగర వీధులలో తానుగాంచిన వృద్ధునివలె కురూపులు దుర్బలులు కావలసియున్నదాఅని యోచించుకొనుచు నిద్రలేకయే, రాత్రంతయు గడిపెను. ప్రపంచంలో కోట్లకొలది యున్న నరులలో నొక్కడైనను, ఆ ఘోరమైన ముదుసలితనాన్ని తప్పించుకొనే విధానాన్ని కనిపెట్టలేకపోయాడా అని ఆశ్చర్యపడ్డాడు. అంతేకాకుండా, తదేకదృష్టితో మరేమీచేయకుండా తన సర్వశక్తులనూ వినియోగించి ఎడతెగనిపాటుపడి ప్రయ

త్నిస్తే, తాను, యశోధర, తండ్రి, ప్రతి మానవుడును ఈ ముసలితనమునుండి తప్పించుకుపోయే తరుణోపాయాన్ని కనిపెట్టలేనా అని వితర్కించుకొనెను.

సుద్ధోదనుడు జరిగినదాదంతావిని, రాత్రంతయు నిదుర పట్టక, పుత్రుని సంసారము విడిచిపోకుండా ఏలాగు చెయ్యడమా అని ఆలోచించుకొనెను. కొత్తకొత్త ఆనందోత్సవాల నేర్పాటుచేసి పుత్రుని వాని నానిందించమని కోరెను గాని అందుల కాత డియ్యకొనక, పట్టణప్రజలు ఏలాగు సామాన్యంగా కాలం గడుపుతుంటారో తెలిసికోవడానికి, తన రాకను వారికి తెలియజేయకుండా తాను పట్టణ పర్యటనం గావించడానికి అనుజ్ఞ నివ్వమని తండ్రిని వేడెను.

రాజుకొడుకులూ, సంపన్నుల కుమారులూ, అతి వైభవంతో జీవిస్తుంటారు. కాని సామాన్యులు, కాయక్లేశంతో చెమటోడ్చి,అతికష్టంతో ఆర్జించి, సంసారాలీడ్చుకుంటుంటారు. అది చూచినయెడల వృద్ధ ఋషి చెప్పిన విధాన సిద్ధార్థుడు రాజ్యమును విసర్జించి సన్న్యాసియగునని రాజు భయపడుచుండెను.కాని, యువరాజు అప్పటికప్పుడే, కొంత చూచియుండడం బట్టి ఇంకా ప్రపంచాన్ని చూడనిదే సంతృప్తి జెందక సుఖమన్నదిలేక బాధపడుతూనే ఉంటాడని అతనికి స్పష్టమైంది. ఎంత ఇష్టము లేకపోయినను రాజు, కుమారుని కోర్కెను తీర్చ నిశ్చయించాడు. రాజానుజ్ఞతో సిద్ధార్థుడు, ప్రజలు గుర్తించకుండా ఉండడానికై, రాజకుమారునివలెగాక సామాన్యుని వలె దుస్తులవేసికొని రథమునెక్కక, కాలినడకను, తన

రాక నెవ్వరికినీ తెలియపర్చక, మారు వేషముతోనున్న ఛన్నుని వెంటపెట్టుకొని, ఊళ్లో తిరుగనారంభించెను.

జయజయధ్వనులు లేవు; పుష్పాలంకృత గృహద్వారాలు లేవు. పట్టణం మామూలుగా ఉంది. ప్రజలు తమతమ వృత్తులలో తిరుగుచున్నారు. ఒకచో కమ్మరివాడు, నాగలి నక్కునో, కొడవలినో ఎర్రగా కాలిన ఇనుపముక్కతో తయారు చేయుచు చమటలు కార్చుతూ పాటుబడుచున్నాడు. వీధులలో చిన్న చిన్న దుకాణాలలో బంగారపు వెండి పనివాళ్ళు, కంఠ హారాలో, అందెలో, వడ్డాణాలనో వెండి బంగారాలతో తయారు చేస్తున్నారు. రంగుల వీధులలో, రంగు వేసే వాళ్ళు ఎరుపు, పచ్చన, ఆకుపచ్చన మొదలైన అనేకరంగులను బట్టలకు వేసి, పొడుగ్గా తాళ్ళమీదను, భూమిపైని ఆరవేయుచున్నారు. వేరొకచోట పూటకూళ్ళ ఇండ్లలో, వేడి వేడి రొట్టెలను తయారుచేసి, భోజనానికై వేచియున్న వారలకు అందిచ్చుచున్నారు. ఇట్టి దృశ్యాలనెన్నడూ చూచినవాడు సిద్ధార్థుడు కాడు కావున, అత్యంతోత్సాహముతో నాతడు అన్నిటిని పరికించుచుండెను. ప్రతివాడును అతి శ్రద్ధతో తమ తమ పని పాటులను సంతృప్తుడై, సంతోషంతో నిర్వర్తించుకొనుచుండినట్లు కనిపించుచుండుటచే, రాకొమారుడు సంతోషించుచుండెను. ఈ విధాన సంతోషంతో అతడు వీధులు తిరుగుచుండగా, ఆతని మనమును కలవరపెట్టే ఒక్క దృశ్యం కనిపించింది.

ఛన్నుడు వెంటరాగా సిద్ధార్థుడు ముందుకు పోవుచుండగా "రక్షించుము"ని, ఒక కేక వెనుకనుంచి వినిపించింది.

ఏమిటో ఇది యని వెనుకకు తిరిగిచూడ, దగ్గిరగా ఒకడు ధూళిలో పడి బాధతో సులుచుకుంటూ ముట్టుకోవడం చూశాడు. అతని ముఖంమీదనూ, ఒంటిమీదనూ కూడా ఎఱ్ఱని బొబ్బలు కనిపించుచుండెను. అతని కళ్ళు వింతవింతగా తిరుగుచుండెను. లేవడానికి ప్రయత్నిస్తూ, ఊపిరి రాక బాధ పడుతూ, కొంచెందూరం అతి కష్టంతో తప్పటడుగులు వేసి క్రిందకొరుగుచుండెను. కరుణామయుడగుటచే, ఆ రోగి బాధ చూడలేక ఒక్క దవ్వునవాని దరికి ఉరికి, లేవదీసి, వాని శిరమును తన మోకాలుపైనిడుకొని బుగ్గిలో ఆ రాజకుమారుడు కూర్చొని, బాధ ఏమిటనీ, ఎందుకు లేచి నిలుచోలేడనీ యారోగిని మెల్లగా అడిగెను. ఊపిరి రాక అతడు జవాబివ్వ లేకపోయెను, మూలగడం తప్ప అతడేమీ స్పష్టంగా చెప్పలేక పోవడం చూచి, దగ్గరకువచ్చి ఛన్నునిచూచి సిద్ధార్థుడు

“ఓ ఛన్నా, ఈ మనిషి ఈలాగు నెందుకున్నాడో తెలియ జెప్పు. ఎందు కూపిరి తీయలేకున్నాడు? నాకు జబాబీయ డేమి? అని ప్రశ్నించెను.

ఛన్నుడు “ఓ రాజా! ఆతని ఆలాగు పట్టుకొనకుము. ఈతడు జబ్బుతో బాధపడుతున్నాడు. ఆతనిరక్తము విషపూరితమైంది. ఆతడికి ప్లేగు జ్వరంపట్టి దహించుకు పోతూ ఉంది. అందుకే, ఊపిరి అతికష్టంగా తీస్తున్నాడు. చివరకా ఊపిరినికూడా ఉష్ణం దహించివేస్తుంది” అని సిద్ధార్థుని ఆ రోగిని తాకియుండవద్దని నివారింపజూచెను. సిద్ధార్థుడు “ఇతర మనుష్యులు కూడా ఈలాగునవుతారా?”

ఛన్నుడు "ఓ రాజా, ఆరోగిని అంతదగ్గరగా పట్టు కొనివుంటే నీవుకూడా ఆలాగున కాగలవు ఆతనిని కిందవిడిచి, వాని శరీరమును తాకకుము. ప్లేగు వాని శరీరమునుండి నీ దేహములోకి పాకి ప్రవేశించును. అపుడు నీ వాతనివలెనే కాగలవు".

సిద్ధార్థుడు: "ఈ ప్లేగేకాక, ఇతరపీడలేవైనా మనుష్యులను బంధించేవి ఉన్నాయా?"

ఛన్నుడు: "ఆహా, అనేకములైనవి, అనేకవిధములైనవి, ఇంతబాధపెట్టేవి ఎన్నెన్నో ఉన్నాయి.

సిద్ధార్థుడు: "ఎవరూ వీనినడ్డలేరా? హఠాత్తుగా, తెలియకుండానే ఇట్టి పీడలును మనుష్యులపై పడతాయా?"

ఛన్నుడు: "అదే జరుగుతూంటుంది. ఏనాడు ఈలాగు జబ్బు వస్తుందో ఎవరికీ తెలీదు. ఎవ్వానికైనా, ఎప్పుడైనా ఇట్టిది సంభవింపవచ్చును.

సిద్ధార్థుడు: "ఎవ్వానికైనా, ఛన్నా? రాజకుమారునకుకూడానా? నాకున్నూ"

ఛన్నుడు: "ఓ రాజా, నీకుం కూడాను."

సిద్ధార్థుడు: "నిరంతరమూ ప్రతివాడునూ భయంతో ఉండవలసిందే. రాత్రి పండుకోబోయేటప్పుడు, ఈ దీనునివలె మరునాటి యుదయము ఇట్టిజబ్బుతో లేస్తాడేమో ఎవ్వానికీ తెలీదు".

ఛన్నుడు: "ఓ రాజా, అది నిజము. ఏనాడు జబ్బువస్తుందో తెలీదు; బాధ పడి పడి ఏనాడు మానవుడు చస్తాడో తెలీదు".

సిద్ధార్థుడు: "చావు! వింతమాట! ఛన్నా చావు అంటే ఏమిటి?

ఛన్నుడు: "ఓ రాజా, చూడు".

ఛన్నుడు చూపినవైపు రాజకొమారుడు చూచాడు. ఆ బాటను ఒక చిన్నగుంపు వస్తూయుండెను. వాళ్ళందరూ ఏడుస్తున్నారు. వారివెనుక ఒక బల్లచెక్కపై అతికృశించిన మనిషి, చప్పిదవళ్ళతో, వికృతహాసంతో పళ్ళు గరగట్టి, కదలక మెదలక, ఎట్టికుదుపుండినా ఒక్కమాటైన అనక, కర్రతుండం వలెయున్నవానిని చూచాడు. మోతగాళ్ళలో ఒకడు తొట్రుపాటుబడి, కుదిపివైచినా ఆ చెక్కమీద మనిషి మూలగనైనా మూలగకపోవడం చూచి ఆశ్చర్యపడ్డాడు. ఆ గుంపులోని వారెందుకు ఏడుస్తున్నారో తెలియక నివ్వెరపోయాడు. చూస్తుండగానే కొంతదూరంపోయి, కర్రలుపేర్చి వానిని అందుపైపెట్టి నిప్పంటించారు. ఆతనికాళ్లూ, తలాచుట్టూ మంటలు వెగిసి, కాల్చుచుండినసూ, ఆతడొక్కమాటైనా అనకుండా, నిశ్చలంగా ఉండడంచూచి బోధపడక అచ్చెరువొందాడు.

సిద్ధార్థుడు గాభరాతో "ఓ ఛన్నా, ఇదేమిటి? తనను తగులబెడుతూంటే ఊరుకుంటాడేమి? లేచి పారిపోడేమి? అని ఛన్నుని అడిగాడు.

"ఓ రాజా, ఆ మనిషి చచ్చిపోయాడు. కాళ్ళున్నాయిగాని, ఆతడు పరుగెట్టలేడు. కళ్ళున్నా, అవి ఏమిటో చూడలేవు. చెవులున్నా, మరి వానితో ఏమీ వినలేడు. వేడిమిని గాని, చలినిగాని, నిప్పునుగాని, నీటిని గాని ఆతడు తెలుసుకోలేడు. మరి వానికి ఏ చైతన్యమూ లేదు. ఏ ఇంద్రియ జ్ఞానమూ లేదు. ఆతడు చచ్చిన శవం" అని ఛన్నుడు మారు పల్కాడు.

"చచ్చిపోయాడా, ఛన్నా? చావునకిదా అర్థము? రాజు కొడుకును, నేనుకూడా ఒకనాడీలాగున చావవలసినదేనా? నా జనకులు, యశోధర, నాకు తెలిసినప్రతిమనిషిన్నీ, కాలుచున్న ఆ చితిమీద దీనినివలె ఒకనాడు కాలిపోవలసిందేనా?" అని ఛన్నుని సిద్ధార్థుడు ప్రశ్నించాడు.

"ఔను, రాజా, జీవంతో ఉన్నవాడు ప్రతివాడూ ఏదో ఒకనాడు చావక తప్పదు. అంతకంటె నిశ్చయమైనది మరి లేదు. చేసేది కూడా ఏమీలేదు. చావురాకుండా అడ్డగలిగినవాడు లేడు" అని ఛన్నుడు జవాబు చెప్పెను.

రాజకొమారుడు నిశ్చేష్టుడై, నోటమాటరాక మూగవాని వలె యయ్యెను. రారాజులను, రాజపుత్రులను, సైతము ప్రతిజీవించియున్నవానిని సర్వభక్షకత్వంతో కడుపున బెట్టుకొను ఈ పెనుభూతపు చావునుండి తప్పించుకొనే మార్గమే లేకపోవడం అతి ఘోరంగా కనుపించింది. తిరిగి ఇంటికి చేరుకొని, ఒక గదిలో కూర్చుని గంటలకొలది ఆనాడు తానుచూచినదాన్ని గురించి విలపోయ నారంభించెను.

"పుట్టిన ప్రతిజీవ జంతువుకూ చావక తప్పదని ఛన్నుడంటున్నాడు. చావునుండి తప్పించుకోవడానికి వీలులేదనికూడా చెప్తున్నాడు. ఇది ఒక మహాఘోరం. ఇట్టిపరిస్థితుల నుండి తప్పించుకొనే తరుణోపాయం ఎక్కడో ఉండకతప్పదు. నా జనకుని, యశోధరను, నన్ను, ప్రతివానినికూడా చావునుండి కాపాడే తరుణోపాయాన్ని కనుగొంటాను. ముసలితనం, రోగం, చావు నుండి తప్పించుకొనే మార్గాన్ని కనిపెట్టక తప్పదు" అని నిశ్చయించుకున్నాడు సిద్ధార్థుడు.

ఒకనాడు అతను రాజకేళీవనములకు రథము మీదను పోవుచు, కాషాయవస్త్రములను ధరించిన ఒక సన్న్యాసిని చూచెను. ఆతడు జాగ్రత్తతో, ఆ సన్న్యాసి ప్రశాంత గంభీర రూపాన్ని, ప్రసన్నతను చూచి లోలోన సంతోషించి, అట్టి వాని జీవితము గూర్చి ఛన్నుని ప్రశ్నించెను. సంసార కష్ట దుఃఖాలనుండి రక్షణమార్గమును వెలికికనుగొనుటకై ఆతడు ప్రవ్రజించినవాడని తెల్పెను. అది విని కడు సంతోషముతో రాకుమారుడు కేళీవనమునకుపోయి, సంసారమునువీడి సన్న్యసించుటకు నిశ్చయించుకొని, ఆరోజంతా అతి ఖులాసాతో గడిపెను.

ఇంటికి తిరిగివచ్చి, తాను చూచిన దానిని గూర్చి దీర్ఘంగా ఆలోచిస్తుండగా, యశోధర ఒక పుత్రుని కనెనని వార్తవచ్చెను. ఆ వార్త మాత్రము సిద్ధార్థునకు ఆనందాన్ని కలుగజేయలేదు. "రాహులుడు నాకు పుట్టాడు, ఒక బంధనం తయారైంది." అని సణుగుకొంటూ, మనోవైకల్యాన్ని చూపు

లలో గనపరచెను. పుత్రజననవార్త వినగానే సిద్ధార్థుడు అన్న మాట విని, రాజు మనుమనకు నామకరణమునాడు రాహులు డను పేరు పెట్టెను.

ఆ నాటినుండి సుద్ధోధనుడు ఇక సిద్ధార్థుని సుఖలోలు నిగ నుంచు ప్రయత్నము లాభములేదని గ్రహించి, వానిని యిచ్ఛవచ్చినట్లు కపిలవస్తులో తిరగడానికి అనుజ్ఞ నిచ్చాడు. తరుచుగా రాజకుమారుడు పట్టణములో రథములో బోవుచు, ప్రతివిషయాన్ని పరికించి చూస్తూ, చూచినదానిని గురించి నిరంతరము ఆలోచించుకుంటూ, తన కర్తవ్యమునుగూర్చి తల పోయుచుండెను.

ఒకనాడు ఊరిలో తిరిగి, రాజప్రాసాదములోని ఒక గది ప్రక్కనుండి పోవుచుండగా కిసాగోతమిఅను అంతఃపుర వాసిని ఒకతె, కిటికీలోంచి బయటకు చూచుచు, రాజపుత్రుని చూచి, వాని రూపురేఖా విలాసాలను ప్రసన్నతను గని "అట్టి మహోన్నతుడైన రాజకుమారుని గన్న తల్లిదండ్రులు, కట్టు కొన్న భార్య ఎంత తృప్తితో, సంతోషంతో, ప్రశాంతంతో ఉంటారు," అని ఆశ్చర్యముతో అనెను. కాని అనుకొన్నదాని కంటె బిగ్గరగా అనడంచేత, ఆమెమాటలు సిద్ధార్థుని చెవుల పడెను. "ఇట్టి పుత్రుని గన్న తల్లిదండ్రులు, కట్టుకొన్న భార్య అత్యంతానందంతో సుఖంగా ఉన్నారు. కాని సౌఖ్యం, ఆనందం, తృప్తి అంటే ఏమిటి?" అని లోలోపల ఆ రాజ కుమారుడు ఆలోచించుకొనుచుండెను.

సంసారవిషయాలను చూచి, నిరంతరము చింతాక్రాం తుడైయుండి, సంసారసుఖములనుండి విముఖుడైయుండి సిద్ధా

త్రుడు కోరిక విద్వేషం, మాయలనే జ్వరం పోతేనేగాని, నిజమైన ఆనందం, సుఖం, తృప్తికుదురవు, గర్వము, అసత్యోద్దేశ్యములు, కామముయొక్క జాజ్వల్యమానములైన మంటలు చల్లారినగాని, నిజమైన ఆనందము, శాంతి, తృప్తిగలుగవు. ప్రతి మనుజునకును, నాకునూ కూడ ఇవియే అతి ముఖ్యములు, వాని సంపాదనకై నేనుపోయి ప్రయత్నించవలసియున్నది. సుఖజీవితాన్ని నేనీప్రాసాదంలో ఇకగడపడానికి తగను. నేను వెంటనే బయటపడి, ముసలితనము, రుగ్మత, చావు వీటిబారినుండి మానవకోటిని, నన్నూ కాపాడి తరింపజేసే నిజమైన ఆనందానికై వెదకవలసియుంది. ఈ రమణీమణి నాకు మంచి ఉపదేశంచేసింది. అనుకోకుండా నాకామెయొక మంచి యుపదేశికురాలైంది. ఆమెకు మంచి గురుదక్షిణను పంపాలి" అని అనుకొనుచు, తన మెడలోనున్న ఒక కంఠహారాన్ని, కిసాగోతమిరాజకన్యకకు ఉపాయనంగాపంపెను. ఆమెయు, ఆ రాజకుమారుడు తనను ప్రేమించి, రెండవ భార్యగా స్వీకరించే యుద్దేశాన్ని కనపరుస్తూ కంఠహారాన్ని పంపినాడని యోచించి కడు మోదంతో ఆ యాభరణమును తెచ్చిన వానితో యువరాజునకు తన ధన్యవాదాలను పంపెను.

రాజకుమారుని భావాలుమాత్రం వేరుగానుండెను; అవి రాజునకు, భార్యకుకూడ బాగా తెలియును. రాజకుమారుడు, పట్టణ పర్యటన తరువాత, సంపూర్ణంగా మారిపోయెనని చుట్టునున్న వారందరూ గ్రహించిరి. మునపటికంటె మరింత చింతాక్రాంతుడైనాడనిచూచి, కొడుకును గోల్పోవులను సహింపనేరక, తండ్రి, వానిని సంసారములోనుంచడానికి ఆఖరు

యత్నంచేయకుండా ఉండలేకపోయాడు. అతి సొగసైన పాటకులను, నాట్యకత్తెలను ఊరుకురప్పించి, సిద్ధార్థుని అతిమధురమైన గానములతోను, అతి రమ్యమైన నాట్య హావభావ చేష్టితములుతోను మెప్పించి, ఆనందింపచేయమని వారిని ఆజ్ఞాపించెను. వారినిచూడనని కటువుగజెప్పి జనకునకు బాధకలిగించకుండా ఉండునట్లు కొంతతడవు వారి గానాన్నివింటూ, నాట్యాన్ని చూస్తూ రాజకుమారుడు కూర్చునెను. ఒక్క నిమిషమైన మనమును విడువని ఆలోచనలలో మునిగియుండి, పాటలను వింటూ నాట్యాన్నిచూస్తూ యుండినా అవి వాని మనస్సుకుమాత్రం సోకలేదు. ముసలితనం, రోగం, చావు రాకుండా ఏలాగు దాటుకుపోవడమనే విషయాన్నే ఎడతెగక అతను చింతించుచుండెను. పరప్రపంచం ఆతనికి తెలియడంలేదు. ఆలోచనభారంతో, తలదిమ్మెక్కి, చిట్టచివరకాతడొక మమతలోపడ్డాడు.

ఆ ఆటకత్తెలు, పాటకత్తెలు రాజకుమారినికి ఎంతమాత్రము ఆ గానా బజానా సంతోషం కలుగజేయకపోవడం వల్ల ఆతడు నిద్రపోతున్నాడనిచూచి, ఆయన మేల్గాంచేవరకు వారందరూ ఎక్కడున్నవారు అక్కడే, దీపాలన్నీ వెలుగుచుండగా ఒళ్లు తెలియకుండా నిద్రపోయిరి.

కొంతదనువున రాజకొమారుడు మేల్గాంచిచూచిన దాన్నిపట్టి ఆశ్చర్యమును, రోతనుగూడ జెందెను. దేశంలో ఆట పాటలకు, సౌందర్యానికి పేరుపొందిన ఆ రమణీమణులు, అప్పటివరకు అతి రమ్యమైన నాట్యంచేస్తూ, అతి సొగసైన

పాటలూ పాడుచూ, అతివికారంగా కిందపడి మైమరచి నిద్ర పోవడం సిద్ధార్థుడు చూచాడు. కొందరు పందులువలె గురక పెట్టుచున్నారు; కొంతమంది చొంగకారుతుంటే నోరు తెరచి పడివున్నారు; ఆకలిగొన్న పిశాచాల్లాగ, మరికొందరు వున లుతూ పళ్లుకొరుకుతున్నారు. అంత వికారంగా కాన్పించు చున్న వాళ్లను తాను ఏలాగిదివరకు సహించెనో అని ఆశ్చర్య పోయాడు. రమణీయ మనుకున్న దానిమీద ఆతనికప్పుడు పుట్టినరోత అంతా యింతా కాదు; తానింతవరకు గడుపుతున్న జీవిత విధానంమీదనే అతనికి సంపూర్ణమైన అసహ్యంకలిగింది. ఈ రోతను విడిచిపెట్టి, వెంటనే చెడుగునంతా అంతరింపచేసే నిజమైన ఆనందాన్ని వెదకడానికై నిశ్చయించుకొన్నాడు; ఆనందాన్వేషణార్థమై బయలుదేరుదామనుకున్నాడు.

నిదురపోతున్న యువతులను మేల్కొలుపకుండా, చడీ చప్పుడు చెయ్యక గదిలోనుండిపోయి, ఛన్నుని పిలిచి, దీర్ఘ ప్రయాణార్థమై వెంటనే తన ప్రియ ధవళాన్ని జీనువేసితీసుకొని రమ్మని ఆజ్ఞాపించాడు.

ఛన్నుడు సజ్జువేసి గుర్రాన్ని సిద్ధంచేస్తూ వుండగా సిద్ధార్థుడు తన చిన్ని కుమారుని ఆఖరుసారి చూడ్డానికై అంతఃపురంలోనికి వెళ్ళాడు. గదిలో పాన్పుపైపిల్లవానినిపక్కను పెట్టుకుని యశోధర నిదుర పోతున్నది. గది తలుపు తెరిచి లోపలకు చూచేసరికి శిశువు తలమీద చేయి పెట్టుకొని నిద్ర పోతున్న తన భార్య అతనికి కనిపించింది. తల్లిచేయి అడ్డముగా వుండడంవల్ల శిశువుమోము, అతనికి అవుపించలేదు. "నా

కుమారుని ముఖం చూడ్డానికి, ఆమె చేతిని కదిపితేనా, ఆమెకు మెళుకువ వస్తుంది. మేల్కొని యిక నన్నామె వెళ్ళనీయదు. ఈ మాటు నా కుమారుని ముఖం చూడకుండానే, నేను బయటకు వెళ్ళిపోవాలి. నేను దేనికోసం వెదుకుతూ వెడుతున్నానో అది నాకు దొరకగానే అతనినీ అతని జననినీ చూసెదను!" అని అనుకొంటూ చప్పుడేమి చెయ్యకుండా సిద్ధార్థుడు బయటకు వచ్చేశాడు.

సిద్ధార్థుడు ఇవతలకువచ్చి ఆ నిశామధ్యమందు అల్లరి చేయక, పల్లక నిలుచునివున్న గుర్రమును ఎక్కి, భక్తి గల ఛన్నుడు గుర్రపు తోకను పట్టుకొని వెంటరాగా,పురద్వారము చేరి ప్రేమించుచుండిన జనకుని భార్యను ప్రియపుత్రునివొడిలి, రాజ్యభోగాలను విడిచి నిరాటంకముగా ఎక్కడికో బయలు దేరెను.

కొంతదూరము సవారుచేసి పోయి, గుర్రమునాపి, వెనుకకుత్రిప్పి, నిండు వెన్నెలలో ప్రశాంతంగా గాఢ నిద్రలో నుండెనాఅని అనిపించుచుండిన కపిలవస్తునగరాన్ని ఆఖరి చూపుచూశాడు. పునర్దర్శన మగునో లేదో తెలీదు. ఒకవేళ చూడగలిగిన అవకాశమే యున్నచో అది యేనాడు కుదురునో తెలీదు. తరతరాలు తనవంశానికి చెందిన ఊరు అది.అందులో ప్రియమైన అతి సౌందర్యవతి చిన్నవయస్కురాలగు భార్యను, ప్రియతముడైన చిన్ని కొమారుని విడిచి పోవుచుండినను, సన్న్యసించే తన దృఢ సంకల్పములో ఈషణ్మాత్రమైనను వెనుకకు తగ్గలేదు. తాను పోదలచినదిక్కునకు గుర్రమును

తిప్పి, అనోమ అనే నది ఒడ్డుకు చేరువరకును సవారి చేయుచు బోయెను. అచట గుర్రమునుండి డిగ్గి, కనుచూపమేర వెండివలె తెల్లగ ప్రకాశించుచు వ్యాపించియుండిన ఆ నదీ తటమున నిలుచుండి, సర్వాభరణాలను తీసివైచి "ఓ ఛన్నుడా, ఈ నా ఆభరణాలనూ, ఈ శ్వేతాశ్వమును ఇంటికి తీసుకొని పొమ్ము, సంసారం త్యజించడానికి సమయం వచ్చింది" అని అనుచు ఛన్నునకు తన ఆభరణాలను ఒప్పచెప్పెను.

"ఓ రాజా, ఈలాగు ఏకాకివై వెళ్ళకుము. నేను కూడా సన్న్యసించి నీతో వచ్చెదను" అని ఛన్నుడు అనెను.

ఛన్నుడు తిరిగి తిరిగి తనతో ఉండనిమ్మని సిద్ధార్థుని ఎంత ప్రార్థించినను ఆతడు మాత్రం ఓ "ఛన్నా, సంసారంత్యజించి సన్న్యసించడానికి నీ కింకా ఉచితకాలం రాలేదు. నీవు వెంటనే పట్టణానికి తిరిగిపోయి, జననీ జనకులతో నేను సుఖంగా ఉన్నానని చెప్పుము" అని చెప్పుచు, గుర్రాన్ని ఆభరణాలనుకూడా తీసికొనిపొమ్మని ఆజ్ఞాపించెను.

యజమానుని యాజ్ఞ నిరాకరించలేక, కడు దుఃఖముతో ఆ వెన్నెలరాత్రి కంటకమును కళ్ళెముపట్టి నడిపించుకొని పోవుచు, రాజకుమారుని విచారకరమైన ఉదంతాన్ని కపిలవస్తు పరిపాలకునకు, పురవాసులకూ తెలియజేయడానికి ఛన్నుడు తిరిగి యింటికి మార్గముపట్టెను. చిట్టచివరకు సిద్ధార్థుడు జననీజనకులను, రాజ్యాన్ని, ఇంద్రభోగాలను, సమస్తైశ్వర్యాలను ప్రియతములగు భార్యాపుత్రులను, ఒక మాటలో బహుశోభాయుక్తమగు మేటి సంసారాన్ని పరిత్యజించి సుద్ధో

వచుడు భయపడు చుండినట్టులనే పరివ్రాజకుడయ్యెను. ఈ విధంగా, ఇరవైతొమ్మిదోయేట నిండు జవ్వనములో, వెండ్రుకలు తుమ్మెదలవలె నల్లగాయుండ, దేహ బలము మిక్కుటముగ నుండ, శాక్యకులమునకు జెందిన సిద్ధార్థుడు మానవకోటియు, తానున్నూ జరారోగ మరణములను, తదితర దుఃఖాలను, నిరాశను జయించే పంథాను కనుగొనుటకు సంసారమును విడిచి, సన్యాసాశ్రమమును స్వీకరించెను.

# 5

నదీతటమున నుండిన యొక నికుంజములో కొంత తడవు ప్రశాంతంగా ధ్యాననిమగ్నుడై, దేశదిమ్మరి బికారియైన ఆ రాకొమరుడు, దక్షిణముననున్న మగధదేశము వైపు ప్రయాణమును సాగించుచు, యుచితకాలములో ఆ రాష్ట్రపు రాజధానియైన రాజగృహమును చేరెను. ఆ మగధరాజ్యమును బింబిసారుడను రాజు పాలించుచుండెను. ఈ రాజగృహమునందే ఆయన ముఖ్య ప్రాసాదముండెను. ఇతర సన్న్యాసులవలె భిక్షాపాత్రను చేతబూని సిద్ధార్థుడు ఇంటింటికి తిరిగి బిచ్చమెత్తుకొనుచుండెను. కాని సాధారణపు తిరిపమెత్తుకొనువానివలె నాతడు కాన్పించుటలేదు; దారిపోవు నీ సన్న్యాసినిజూచి, ఆతడు సామాన్యుడుకాడని చూపులో నేగ్రహించి గృహమేధులు తమకున్న ఆహారములో నతి ప్రశస్తమైనదానినే వాని అక్షయపాత్రయందుంచుచుండిరి.

అక్షయపాత్ర నిండినవెనుక, ఈ రాజసన్న్యాసి పట్టణము విడిచి ఊరిబయట ఒకచోట కూర్చుని, సేకరించిన దానిని తినుటకు మొదలిడెను. అయ్యో! ఈరాజ కుమారునికి, ఎట్టిభోజనమిది! రాజకుటుంబమునపుట్టి రాజునకు గారాబు పట్టియై, నోరూరు వంటకములను అతి నిపుణతతో వడ్డించుచుండ, అతి నాజూకుగా తినుచుండిన రాజకుమారునకు ఇట్టి కదంబాన్ని తినవలసివచ్చింది. అనేకులు వండినకూడు, కూరముక్కలు, పచ్చళ్లు, పులుసులు కలిసిపోయిన ఆ చౌ చౌ ముద్దనుచూచి, అతనికి కడుపులో రోతపుట్టింది. ఈకలగూరగంప కూడును తినలేకపోయి, దానిని పారవేయదలచుకొన్నాడు. కాని ఒక ఊహ మనమునపుట్టింది. తనలో తానీవిధాన వితర్కించుకోవడం ప్రారంభించాడు. "సిద్ధార్థా! నీవు అభిజాత్యుడవు, రాజకుటుంబమున జన్మకాంచినావు. అతి సమృద్ధిగా సన్నబియ్యపు అన్నము, ఛాయపప్పులు, పిండివంటలు, పచ్చళ్లు, కూరలు, సూపములు, అపురూపభక్ష్యముల నీవు నిరంతరము తినుచుంటివి. స్వర్గభోగములతో తులతూగుచుండినను, మనసార ఇల్లులేని సన్న్యాసివలె జీవించుటకును, ధర్మాత్ములిచ్చు బిచ్చమును భుజించుచు జీవించుటకు పట్టుపట్టితివి. ఆ సంకల్పము ప్రకారము నాచరించితివి. ఇల్లులేని సన్న్యాసివైతివి. ఐనా, ఇప్పుడేవిధానం ఆచరిస్తున్నావు? ఇల్లులేని సన్న్యాసుల కుచితమైన ఆహారమును – ప్రజలు బిచ్చము వేయునట్టి ఆహారమును – తినుటకు ఏవగించుచున్నావు. అది నీకు తగినదేనా?"

బిచ్చకునకుండ కూడని ఆహారవిషయంలో యీ నా జూకునకుతన్ను తానే నిందించుకొని,తీవ్రప్రయత్నముచేసి చిట్ట చివరకు ఆ ఆహారముపందుగలిగిన అసహ్యాన్ని చంపుకొన్నాడు. తన భిక్షాపాత్రలోనుండిన పదార్థములను తిని, ఆనాటినుండి బిచ్చమెత్తిన ఓదనమును ఎట్టి అసహ్యములేక తినుచుండెను.

ఇంతలో నుదయమున వీధుల బిచ్చమెత్తుకొను చుండిన కొత్తసన్న్యాసి, సామాన్య సన్న్యాసులకంటె అతివిలక్షణము గను, గొప్పింటివానిగను కనిపించుచుండెనని రాజగృహపుర వాసులు అనుకొనుచుండిరి. ఈ యుదంతము బింబిసారుని చెవులసోకెను. ఈ నూతన సన్న్యాసి యెవ్వడో కనుగొనుమని పరిచారకులను రాజు పంపెను. ఆ బిచ్చగాడు, శాక్యరాజైన సుద్ధోదనుని కుమారుడనియు, ఆ రాజ్యమునకు యువరాజయ్యు జరా రోగమరణములను జయించుటకు తగిన మార్గాన్ని కని పెట్టుటకు సన్న్యాసియైనాడనియు, సేవకులు రాజునకుదెల్పిరి. రాజదివిని విభ్రాంతుడయ్యెను. ఇంతవరకు అతను ఏ సన్న్యాసియు, అతఃపూర్వము ఇంత వింతయైన దానికై ప్రయత్నించు చుండినటుల వినలేదు. కాని యీ యన్వేషణ వస్తుమహాత్వాన్ని గ్రహించి అట్టిమహత్తరమైన దాన్ని సాధించుట రాజునకు తగినదేమో అని యూహించి, అది సాధ్యమైనదే అని అనుకొనెను. ఈ రాజ సన్న్యాసిని తనయూరనేయుండ మనిన్ని అతనికి తగిన ప్రాసాదాదులను సర్వభోగాలనూ సమకూర్చెదననియు, ఇక్కడనే స్థిరవాసమేర్పరుచుకొని తన ధ్యానాదులను గావించుకొనుమ, తరుణోపాయాన్ని కనిపెట్టు కోవచ్చునని తెల్పుచు, సిద్ధార్థునకు సేవకులద్వారా రాజు

కబురంపెను. తాను అర్థించుచున్నదానిని కనుగొనేవరకు ఒక్కచోట స్థిరంగా ఉండలేనన్నీ, రాజు తనపు చేయదలచు కొన్న దానికై కృతజ్ఞతను సూచించుచు, వానికోరికను నెరవేర్చలేనని సిద్ధార్థుడు జవాబుపంపెను. ప్రయత్నములో సిద్ధి బొందిన తరువాత ఒక్కచో నుండిపోవుటకు వీలగునేమో అని అనుమానముగపల్కెను. సంకల్పితార్థమును పొందిన తరువాత, తన రాజధానిలో నివాసమేర్పరుచుకొని, మొదట తనకునూ, తన ప్రజలకును ఆ విషయాన్ని తెలియజేయమని రాజు అతనిని కోరాడు.

ఆ రాజ సన్న్యాసి రాజగృహమును విడిచి, జనపదములో నుండిన ఒక కొండవైపు దారి పట్టెను. ఆ కొండమీద అనేకమంది యతులు వాసముండిరి. వారి వద్దనుంచి, జనన మరణముల గూర్చియు, తత్సంబంధములైన దుఃఖపాపములను జయించే విధాల గూర్చియు తెలుసుకొనుటకు వీలౌతుందని అతను అనుకొనెను. ఆ మార్గం మీదుగా పోవుచుండ, కొండ మీదనుంచి కిందకు వచ్చే ఒక పెద్ద ధూళిపరాగాన్ని చూచుచు కాళ్ళ చప్పుళ్ళను వినెను. ఇంతలో ఆధూళిలోనుంచి, కింద సమతలం మీదికి దిగుచున్న ఒక పెద్దమేకలమందనుగాంచెను. వాని వెనుక అతి కష్టంతో కుంటుచు ఒక మేక పిల్ల మెల్లగ వచ్చుచుండెను. దాని కాలు దెబ్బతగిలి రక్తముకారుచుండెను. అంత బాధతోనూ ఆ మేకపిల్ల మందతో నడవడానికి ప్రయత్నించుచుండెను. ఆ పిల్ల తల్లి అత్యంతాదోళనతో పిల్లవంక చూచుచుండెను. అది కని సిద్ధార్థుడత్యంతమూ జాలిపడెను. జాలిపడి ఆ మేక పిల్లను ఎత్తుకొని చేతులనిడుకొని మందతో

నడచుచూ సిద్ధార్థుడు "ఓ చిన్ని మేకపిల్లా! నీ బాధను చూస్తే నా గుండె నీరైపోతోంది. నీబాధను మరినేను చూడలేను. నేను ఆ కొండమీద వున్న తాపసులను కలుసుకునేందుకు వెడుతున్నాను. అయితే నీ బాధను ఏమాత్రం తగ్గించగలిగినా, నా కది మంచిదే. కొండమీద వున్న తాపసులతో కలసి ప్రార్థనలు సలపడం ఎంతమంచిదో, నీ బాధను తగ్గించ ప్రయత్నము చేయడమూ అంతేమంచిది." అని అనుచుండెను.

ఇంతలో ఆమందల కాపరులను చూసి సిద్ధార్థుడు "చల్లని సాయంకాలపు పొద్దునగాక, ఆ మిట్టమధ్యాహ్నపు వేళ తమమందలను పచ్చికబయళ్ళనుండి ఎచటకు తోలుకొని పోవుచుండిరని' ప్రశ్నించెను. ఆ రాత్రి యజ్ఞ మొకటి జరుగుతున్నదనీ బలి యిచ్చుటకు వంద మేకలను వంద గొర్రెలను తోలుకురమ్మని రాజు తమకు ఆజ్ఞాపించినాడనీ ఆ మందల కాపరులు అతనికి జవాబిచ్చిరి. అది విని "అయితే నేను మీతో వచ్చెద"నని ఆ రాజసన్యాసి మేకపిల్లను చేతుల నిడుకొని మందను అనుసరించిచనెను.

సిద్ధార్థుడు నదీతీరము సమీపించేసరికి, ఒక యువతి అతని చెంతకు వచ్చి అతిగౌరవముతో నమస్కరించి, "ఓ పరమపావనా! నా మీద కరుణ చూపుము. చావులేకుండా వుంచే ఆ బీజము ఎక్కడ దొరకునో చెప్పుము." అని ప్రార్థించెను. ఆమెవచనములు సిద్ధార్థునకు బోధపడలేదు. అంతట ఆమె "ఓ దేవా! నీకు జ్ఞాపకంలేదా? నిన్నటిరోజున జబ్బుతో మరణించడానికి సిద్ధంగావున్న నా చిన్ని కుమారుని నీ వద్దకు

తెచ్చి నా ఏక పుత్రుని బ్రతికించే మందులేదా అని అడిగితిని. సంపాదించగలిగిన నా బిడ్డ ప్రాణములను కాపాడే మందున్నదని తాము సెలవివ్వలేదా? ఎవ్వరూ ఎన్నడూ మరణించని కుటుంబంనుండి ఒక్క తులం నల్ల ఆవాలు తేగలిగితే అదే మందని తాము చెప్పలేదా!" అని అతనికి జ్ఞప్తికి తెచ్చెను.

"చెల్లీ, ఆ విత్తులను తెచ్చితివా?" అని కరుణారస పూరితమగు చిరు నవ్వులతో ఆమెను సిద్ధార్థు డడిగెను.

"ప్రభూ, నాకవి దొరకలేదు, నాయూర ప్రతియింటికీ వెళ్ళితిని. ప్రతివారును నా కిన్ని నల్ల ఆవగింజలనివ్వడానికి ఉద్యుక్తులై యుండెను. కాని ఎన్నడు మరణము సంభవించని కుటుంబమునుండి అవి కావలెనని నేను చెప్పగా, అట్టి వింత నెన్నడూ తాము వినియుండలేదనియు తమ ఇండ్లలో ఒక్క చావేకాక, పెక్కుచావులు సంభవించెనని బదులు చెప్పిరి. తమ ఇంట్లో ఒక బానిస చచ్చెనని కొందరనిరి. కొన్ని ఇండ్లలో కాలగతిని జెందినది తండ్రి. మరికొన్నింట కుమారుడు; ఇంకొన్నింట తల్లి; కొన్నింట కూతురు అని ఎవకిరివారు తెలియజెప్పిరి. ప్రతి ఇంటనూ ఎవరో ఒకరు మరణించిరి. అందుకై ఆ గింజలు దొరకలేదు. నా చిన్ని పాప చావక మునుపు, ఆ మందు ఎక్కడ దొరుకుతుందో చెప్పాము; ఓ పూజ్యా! చావులేని ఇల్లే లేదా!" అని అడిగెను.

ఏడుస్తున్న ఆ యువతితో "అసలైన విషయాన్ని చెప్పావు. ఈ విశాల ప్రపంచంలో చావుదూరని గృహమే లేదు. ఈ నిజాన్ని నీ అంతట నీవే కనుగొంటివి. ఈ ప్రపం

చంలో నీ ఒక్క దుఃఖమే లేదు. నీ వలెనే కాలగతి జెందిన ఏ ప్రియతము బంధువునకయో ప్రపంచంలో దుఃఖించని గృహస్థుడు లేడని నీ యంతట నీవే గ్రహించితివి. ఇంటికిపోయి, పిల్ల శవమును పూడ్చి వేయుము. చెల్లీ! నేను సాధ్యమైతే, నీ యొక్క, ఇతర మానవులయొక్క దుఃఖాన్ని నశింపజేసే తరుణోపాయాన్ని కనుక్కోడానికి పయనమై పోతున్నాను. నేనది కనుక్కుంటే, తిరిగివచ్చి నీకు జెప్పెదను" అని అనుచు ఆ యువతిని ఓదార్చి సిద్ధార్థుడు, మంద వెంట మేకపిల్ల నెత్తుకొని నడిచిపోయి, యాగస్థలమును జేరెను; చేరి వేదఘోష చేస్తూన్న బ్రాహ్మణ బృందము మధ్యను నిలువబడియుండెను. వేదికపై అగ్నిహోత్రము ప్రజ్వలించుచుండెను. వచ్చిన మేకలను బలి వెయ్యడానికి అంతా సంసిద్ధం చేయబడెను. బలికై ఎంచబడిన మొదటి మేక మెడపై వేటు వేయుటకు, ఆ యాజకులలో ముఖ్య బ్రాహ్మణుడు కత్తినెత్తగా సిద్ధార్థుడు ముందుకు వెళ్ళి, వాని నాపుచు "ఓ మహారాజా, అట్లు చేయడకూడదు. ఆ దీన జీవిని యాజకునిచే వధియింపబడనీయకుము" అనుచు ఎవ్వరూ ఆతను చేయుచున్న పనిని తెలిసికోకమునుపే, దర్భ త్రాళ్ళతో కట్టబడిన ఆ మేకను విడిపింప, మందలో కురికెను. మహారాజుగాని, యాజకముఖ్యుడుగాని, మరి యెవ్వడుగాని, సిద్ధార్థుని ముఖవర్చస్సును, సౌమ్యతను, ప్రసన్నతను చూచి ఆయనను అడ్డుటకు ప్రయత్నింపరైరి.

అపుడు అచటనున్న మహారాజునకును, బ్రాహ్మణ బృందమునకును, రక్తస్రావముజరిగే యజ్ఞాన్ని చూడడానికి వచ్చిన వారలకును, జీవన ప్రభావమును గూర్చి సిద్ధార్థుడు

ప్రబోధించెను. "ప్రాణిని చంపుట సులభము; చంపిన ప్రాణిని బ్రతికించుట దుర్ఘటము. చనిపోయిన వెనుక ఒక జీవిని పునరు జ్జీవింపచేయడానికి ఎవరికీ శక్తి లేదు. మనుష్యులవలెనే ప్రతి జంతువునకు ప్రాణమందు ఆశవుండును. మరణమన్న ఏజీవికైనను భీతియే. తనవలెనే ప్రాణములమీద ఆశవున్న జంతువుల ప్రాణములను మానవుడెందులకు తీయవలెను? జంతువులు మానవుల కరుణను వాంఛిస్తున్నవి. తమ సానుభూతిని వేడుకొనే వాటి ప్రాణములనుతీసి మానవులు అధర్మమును ఆచరించరాదు. వారుకూడా కరుణను చూపవలెను. ధర్మచ్యుతి కలిగినచో మానవులకును హాని. రక్తస్రావమును చూసి ఆనందించే దేవతలు ఎలాంటి దేవతలు? సజీవముల బాధలను దుఃఖాన్ని మరణాన్ని చూచి సంతోషపడేవారు దేవతలుకారు; వారు భూతపిశాచాలు. పరమున ఆనందమును అనుభవించాలంటే ఇహమున ఏ అల్పజంతువునకు సైతం దుఃఖం కలిగించరాదు. బాధ, దుఃఖము అనే బీజములను చల్లువాడు, బాగుగా పండిన అట్టిదుఃఖమనే చేనునుకోసి మూర్చి అనుభవింపవలసి వుంటుంది."

అతిదయతో, బహు మృదువచనములతో ఎక్కువ గాంభీర్యముతో సిద్ధార్థుడు అక్కడవున్న బింబిసార మహారాజునకు యాజనబ్రాహ్మణులకూ యిలా ప్రబోధముచేయగా, వారి మనసులు పశువధనుండి మరలెను. ఆ వెంటనే మహారాజు తన రాజ్యములో యజ్ఞములు జరుగునపుడు పశువధలు కూడదని పుష్ప ఫలాపూపములు మాత్రమే యజ్ఞములలో దేవతలకు బలిగానీయవలెనని సాటింపించెను.

సిద్ధార్థుని తన రాజధానియందుండిపోయి తనకును తనప్రజలకును ప్రతిజీవజంతువుయందు కరుణ కలుగునట్లు దయా కృపాళుత్వమూ కలిగివుండే సన్మార్గమును అనుసరించేటట్లు బోధింపవలసినదిగా బింబిసారుడు ప్రార్థించెను. మహారాజు అటులు సద్భావములను వెలిబుచ్చినందులకు సంతసించి సిద్ధార్థుడు కృతజ్ఞతను తెలిపి తానన్వేషిస్తున్న మార్గమింకనూ తాను కనుగొనలేదనీ దేశములోవున్న వివేకవంతులకెవ్వరికైన యీ మార్గము తెలిసివున్నచో, వారివద్ద తాను దానిని తెలుసుకొనేవరకూ ఎక్కడా తాను స్థిరనివాసమేర్పరుచుకొని వుండజాలననీ అంతవరకూ అన్వేషిస్తూనే వుందుననీ పలికెను.

## 6

ఆ పురాతన కాలంలో, ఈ నాడున్నట్లే, మన దేశంలో ఆధ్యాత్మికాది విషయాలగురించి బోధచేసే ఆచార్యులనేకులుండేవారు. వారు తమ సిద్ధాంతాలను శిష్యులకు బోధించుచుండేవారు. జ్ఞానానికి, యోగ్యతకూ వారిలో పేరు పొందినవాడు "అలర కలముడ"నే ఆచార్యుడు. ఆతడు చెప్పగలిగిన దాన్ని తెలుసుకొనుటకు, సిద్ధార్థుడు ఆతనికి శిష్యుడయ్యెను. గురువు చెప్పినదంతయు నేర్చుకొని, ఆతడు చెప్పిన విధాన అతి శ్రద్ధతో ఆచరించుచు, కొంతకాలానికి జ్ఞానాన్ని, కర్మాచరణ విధానాన్ని బాగా తెలుసుకొనెను. కలముడును శిష్యుని విశిష్టత్వమును యోగ్యతలను చూచి సంతృప్తుడై, ఒకనాడు

"నాకు తెలిసినదంతయు నీకును తెలియును. నా సిద్ధాంతాన్ని నీవు బోధించినా, నేను బోధించినా ఒక్కటే నీకూ నాకూ భేద మేమీ లేదు. నీవూ నేనూ ఒక్కటే. నాతో వుండిపోయి, నా శిష్యులకు నాతో నీవుకూడ అధ్యాపనంచేయుము" అని అనెను. సిద్ధార్థుడు "నాకుబోధించగలిగిన విషయం మరేదీ లేదా? జనన మరణములను దాటే మార్గాన్ని బోధించలేరా? అలరకలముడు: "ఆ విషయమే నాకు తెలియదు. నీకేమి బోధించగలను? ప్రపంచం అంతటిలోను అది తెలిసిన వాడు డున్నాడని నేను నమ్మను".

సమాధిలోకి పోవడం అలరుడు సిద్ధార్థునకుబోధించెను. చిచ్ఛక్తి వుండియు వుండనట్లుండే అవస్థ ఒకటివుంది. అది అలరుడు శిష్యునకు బోధించాడు. కాని ఈ అసామాన్య శక్తిని సంపాదించినా, జన్మపరంపరలు పొందక తప్పదు. జన్మ రాహిత్యానికి అది దారి తీయదు కావున జన్మ, ముదుసలి తనము, రోగము, చావును మాత్రము తిరిగితిరిగి అనుభవించక తప్పదు. అలరకలమ ఆచార్యునివద్దనుండి తెలుసుకొన్నదాని కంటె తానుకోరిన విశిష్టమైనదాన్ని తెలుసుకోడానికి సిద్ధార్థుడు ఆ గురువును విడిచి దేశాటనమును తిరిగి ప్రారంభించెను.

అతిజ్ఞానియు. బహుశక్తులుగలవని వన్నెకెక్కిన ఉద్దకుడు అను గురువున్నాడని విని, సిద్ధార్థుడు వాని కడకుజని వాని శిష్యుడాయెను. అలరుని వద్ద ఆచరించిన విధాన కడుశ్రద్ధతో ఉద్దకునివద్ద జ్ఞానోపార్జనమును జేయుచుండెను. శిష్యుని తెలివి తేటలను, చురుకు తనమును జూచి, ఉద్దకుడు సంప్రీతుడై,

తనవద్దనేయుండిపోయి, తన శిష్యులకు అధ్యాపకుడు కమ్మని అతనిని కోరెను. సిద్ధార్థుడు, తాను కోరిన విషయం గురించి ఉద్దకుడు కూడా చెప్పగలిగిందేమీ లేదని తెలుసుకొని, ఇక గురువులవద్దకుపోక తనంతట తాను సంకల్పసిద్ధిని పొందుటకు నిశ్చయించుకొని, గురువువద్ద శెలవు గైకొని దేశాటనమునకై పోయెను.

ఆ నాడు ఈనాడువలె దేశంలో అన్నము తినకనూ, ఇతర విధముల శుష్కించుచునూ, ఇంద్రియాదులను నిగ్రహించి, ఘోర తపస్సు చేస్తే, ఆముష్మికంలో పరమానందంతో దేవతల వలె దైవానందాన్ని బడయవచ్చునని ఒక నమ్మకం ఉండేది. ఇహమున ఎంతదుఃఖపడితే పరమున అంత సుఖపడవచ్చునన్న నమ్మకమే ఇది. ఆ ఉద్దేశంతోనే, కొంతమంది ఆహారమును క్రమంగా తగ్గించుకొని, చివరకు శూన్యాహారులై దేహములను కేవలము ఎముకల పంజరాలకింద చేసుకొనేవారు. కొంతమంది ఒంటి కాలుపై నిలబడివుండి, దాన్ని వంగని కర్రవలె నిర్జీవముగా చేసుకొను చుండేవారు. మరికొందరు ఒక చేతిని మీదకు చాపి ఎప్పుడూ దించకుండా అలాగ వుంచేవారు. అందువల్ల రక్త ప్రవాహంలేక ఆచేయి దారువువలె శుష్కించి ఎత్తిన విధముననే ఉండిపోయేది. ఇంకా కొంతమంది తమ చేతులను గట్టిగా పిడికిలిపట్టి మరి విప్పకుండా వుంచడంచేత, గోళ్ళు మొలిచి, పెరిగి చేతులను దూసుకొని అవతలకు పోయేటట్టు తయారయేవి. ముళ్ళకంప శయనాలమీదనో, మేకులు తాచి పైకి సూదిగా వుండే శయనాలమీదనో కొందరు పడుకొనేవారు.

ఈ సన్యాసులవలెనే, సిద్ధార్థుడుకూడా తన సంకల్ప సిద్ధికై ఘోరతపస్సును చేయ ప్రారంభించెను. వేరేమి చేయుటకు తోచక ఆతడును వారివలెనే ఆచరించుచుండెను. దేహాన్ని అష్టకష్టాలు పెట్టి, ఇంద్రియ నిగ్రహించే ఘోరతపమునుచేసిన యెడల తాను వెదకుచున్నదాన్ని కనుగొనగలనన్న నమ్మకము అతనిలో నుండెను.

ఈ మహానుభావుని శిష్యులలో విఖ్యాతిగాంచినవారిలో థేరిసారి పుత్తుడనునాత డొకడు. ఆయనతో చాలకాలమైన వెనక, తానీదశలో చేసిన తపస్సునుగురించి, ఈ క్రిందివిధాన చెప్పెను.

"చెవులు హోరెత్తి, వాడైన కత్తితో ఎవరో, నా తలను దొలుస్తున్నట్లో ఒకతోలు కొరడాతో నా తలపై ఎవరో మోదుచున్నట్లో అయేవరకు నేను ఊపిరి బిగపట్టేవాడను. దీనికితోడు, కసాయివాడు నన్ను కోస్తున్నట్లో, లేకనన్ను కణకణలాడుచున్న బొగ్గులమీద విసిరినట్లో దేహములో బాధ కలుగుచుండేది.

"అటు తరువాత ఏకాంతతను అభ్యసించేవాడను. పర్వ దినములలో నిర్మానుష్య స్మశానవాటికలలోని చెట్లక్రింద కూర్చొనియుండగా గాలివీవ ఆకులుకదలుతూ కింకపడుతూ ఉండే చప్పుళ్లకు భయముతో వెంట్రుకలు నిక్కపెట్టుకొనేవి. ఒకపక్షి చెట్టుకొమ్మమీదవాలినా, లేక ఏదైనా రివ్వునపక్క నుండి పారిపోయినా, దాన్ని చీకటిలో గానక, ఏమిటో తెలియక, భయముతో వణకేవాడను. కాని పారిపోయేవాడను

కాను. కలిగిన భయాన్ని జయించేవరకూ అక్కడనేయుండే వాడను.

"నిరాహారుడనై యుండేవాడను. రోజుకొకమాటు కొన్నాళ్లును, అటుతర్వాత రెండురోజుల కొకమాటును, పిమ్మట మూడురోజులకొక పర్యాయమును క్రమశః తినడం ప్రారంభించి, చివరకు పక్షానికి ఒక్కపర్యాయం తినడం అభ్యసించాను. గడ్డి, నాచు, కుక్కగొడుగులు, వెదురుబియ్యం, దుంపలు అడవుల్లో దొరికే ఫలాలు, వ్రేళ్ళు, తుడిచిన కళ్లం లోని బుగ్గినీ నేను తినడం అభ్యసించాను. పెంటకుప్పలమీద నుంచి శ్మశానవాటికలలోనూ దొరికిన గుడ్డపీలికలతో ముసిలివై చచ్చిపడియుండిన పశువులచర్మాలతో అల్లినగడ్డితో, ఇచట నచట దొరికే చచ్చిన పక్షుల రెక్కలతోను, తోకల తోను, దేహాన్ని కప్పుకొనేవాడను.

"మాసాలకొలది పరమనుష్యుని చూడకుండా నిర్మానుష్యపుటడవులలో కాలం గడిపేవాడను. వేడిమికై నెగడేమీ చేసుకోకుండా, కొరడుగట్టే చలికాలంలో బట్టబయలును రాత్రులగడిపేవాడను. పగలు సూర్యుడు ప్రకాశించుచున్నపుడు చెట్ల చలివిరిలో దాక్కొనేవాడను. మండు వేసవిలో దినమునంతయూ బయట నెండలోగడిపి, రాత్రి కుతకుతమని ఉడక పెట్టే తుప్పల్లో మునిగి కూర్చునియుండే వాడను.

"ఆహారమును సైతం శుద్ధిచేసుకోవడం ఎలాగునో అభ్యసించేవాడను. కొంతకాలము చిక్కుళ్ళను మాత్రం తింటూ, మరికొంతకాలం ఒక్కనువ్వుల నేతింటూ, మరికొంత

కాలం బియ్యాన్నే తింటూ జీవించేవాడిని. క్రమంగా రోజున కొక చిక్కుడుగింజో, నువ్వుగింజో, బియ్యపుగింజో తినేవరకూ ఆహారాన్ని తగ్గించుకొనేవాడను.

"అంతస్వల్పాహారం తినడంవల్ల, నా దేహం కర్రలాగ ఎండిపోయింది. నా కాళ్ళు రెల్లుగడ్డి పోచల్లాగనూ, నా కటులు లొట్టియడెక్కల్లాగనూ తయారైనాయి. వెన్నుపూస ఒక తాడులాగనూ, ముందరి యెముకలు పాడైన యింటికప్పుమీద వాసాలులాగనూ కాన్పించుచుండెను. నాకళ్ళు లోతైన నూతిలో అడుగునకు పోయిన నీటిలాగ లోతుకుపోయి, చిట్ట చివరకవి కనిపించకుండా లోనికిపోయెను. తరిగి ఎండపెట్టిన గుమ్మడికాయముక్కల్లాగ, నా తలపై చర్మము ముడుత ముడుతలువడింది. స్పర్శజ్ఞానం కొంచెం ఎక్కువచేసుకోడానికి నా చేతులను కాళ్ళనూ స్వల్పంగా రాయుగా, అందుపై వెంట్రుకలు కూకటివేళ్ళవద్ద పుచ్చిపోయి రాలిపోవుచుండెను.

"ఓసారీ పుత్రా, ఇట్టి శ్రమతమాదులువడి ఘోర తపస్సును ఆచరించినా, నేను కోరిన జ్ఞాన, పరిజ్ఞానాలు సిద్ధించినవికావు. ఆ విధాన్న లట్టివి సిద్ధించవు. ఒక్క సంపూర్ణ అధ్యాహారమువల్ల, పరిపూర్ణ ధ్యానమువల్ల సంసార పరిత్యాగం వల్లనే అది కలుగుతుంది.

ఈ విధంగా సిద్ధార్థుడు ఆరేడేండ్లు ఘోరతపస్సును ఆచరించెను. తగినంతకాలం ఇట్టి ఘోరతపస్సు చేసినట్లయితే తన సంకల్పం సిద్ధిస్తుందని అతని విశ్వాసం. ఈ విశ్వాసముతోనే ఉత్తర హిందూస్థానములో తాను పర్యటిస్తున్నంత కాలం

సిద్ధార్థుడు తపోనిరతుడయ్యాడు. దేశములో యీలాగున తిరుగుతూ అతను చివరకు మగధకు చేరుకొని ఒక విశాలమైన నదీతీరమున వున్న ఒక ప్రశాంత వేణుని కుంజములో బస చేసెను. అక్కడకు దగ్గరలోనే ఒక గ్రామమున్నది. తిరిపె మెత్తుకొనుటకు అది అనువగు గ్రామము. "జ్ఞాన సంపాదనకై పాటు పడే నావంటి సన్యాసికి యిది మంచిచోటు. ఇక్కడ నేను వుండెదను!" అని అతడు నిశ్చయించుకొనెను.

ఆ స్థలము పేరు 'ఉరువేల'. ఆ వనంలో చెట్ల కింద అతడు ధ్యాన నిమగ్నుడై సాధనం చేసుకొంటూ ఉపవాస ముంటూ ఇతర విధముల ఘోర తపమును ఆచరిస్తూ దేహాన్ని శుష్కింపచేస్తూ ఈ మార్గాన్న తాను వెదుకుతున్న సత్య మును కనుగొనగలననే పేరాశతో కాలమునుగడుపుచుండెను. ఇట్టి ఘోరతపస్సును కావిస్తున్న తాపసి మహామహుడై వుండ వలెనను నమ్మకముతో ఆయనను గౌరవింపుచు ఒక శిష్య బృందము తయారయింది. వారు అయిదుగురు. ఆ అయిదు గురు శిష్యులునూ అతనికి శుశ్రూషచేస్తూ ఓర్మితో దృఢ సంకల్పంతో తపస్సు చేస్తున్న ఆ మహామహుడు తప్పక సత్య మును శోధించగలడనీ, దానిని తమకు చెప్పగలడనీ ఆశించుచూ సిద్ధార్థుని వదలక అక్కడనే వుండిరి.

ఒకనాడు ఆ రాజతాపసి ఉపవాసములతోను దీర్ఘ ధ్యానము వలననూ జర్జరీ భూతుడై మూర్ఛపడి మృతునివలె క్రిందపడెను. అపుడు దైవవశాత్తు ఆ మార్గమున ఒక గొర్రెల కాపరి పోవుచూ మూర్ఛితుడైవున్న సిద్ధార్థుని చూసెను. ఆ

పవిత్ర సన్యాసి సముచితమైన ఆహారము లేక మరణింపనున్నాడని గ్రహించి సిద్ధార్థుడు పడివున్న చెట్టుపక్కనుండిపోవుచున్న ఆ గొర్రెల కాపరి ఆగిపోయెను. వెంటనే తనమందలోనుండి ఒక మేకను తెచ్చి సగము తెరచివున్న సిద్ధార్థుని నోటిలో పడునట్లు ఆ మేకపాలను పితికెను. తాను తక్కువ జాతివాడగుటచే, ఆ మహానిని తనచేతులతో తాకుటకు ఆ బాలుడు భయపడెను.

ఏమైనను బాలుడుచేసిన పని ఊరకనేపోలేదు. పాలు నోటపడినంతనే సిద్ధార్థునకు ప్రాణము తేప్పరిల్లినది. కొంతసేపటికి సత్తువకలిగి నిస్త్రాణపోయి అతను కూర్చొనగలిగెను. చాలాకాలమునుండి ఆతడింతటి స్వస్థతను గనలేదు. తాను మూర్ఛపోవుటకు కారణమును పాలుతాగిన తరువాత స్వస్థత కలుగుటయూ తెలుసుకొని ఆ రాజర్షి యిట్లుతలపోయసాగెను.

"ఎంతబుద్ధిహీనుడనైతిని! సదర్థమునకై ఏ విధమున జీవించవలయునో నిర్ణయించుటకును, భార్యాపుత్రాదులను, కుటుంబమును, సర్వరాగభోగములను, రాజ్యాధికారమును విడనాడి పరివ్రాజకుడనైతిని. ఇట్టి దుస్సాధ్యమైన ఆశయసిద్ధిని పొందుటకు ఉండగలిగినంతశక్తిసామర్థ్యములతో మనోబుద్ధులు వుండవలెను. అటుగాకపోతే గాఢముగానూ దీర్ఘముగానూ నేనెట్లు ధ్యానము కొనసాగించగలను? ఇట్టి సంకల్పమున్నను నేను ఉపవాసాలతో ఇతర కఠిన అభ్యాసాలతో శరీరాన్ని కృశింపచేసుకొని బహు దుర్బలుడనైతిని. దుర్బలమైన దేహంలో బలము ఆరోగ్యము వుండునా? నేను సంకల్పించు

కొన్ని మహత్కార్యమును సాధించడానికి వీలైనంత బలముండవలసిన సమయంలో దేహాన్ని శుష్కింపచేసుకోవడంలో ఎంతబుద్ధిహీనుడనైతిని. శరీరాన్ని మంచితాఖత్తులో వుంచడానికి అవసరమైన ఆహారాన్ని నేనికస్వీకరిస్తాను. భోజనప్రియుడనుమాత్రం అవను. తిండిపోతువలె తినను. అట్లైన నేను బుద్ధి మాంద్యముతో నిద్రాసక్తుడనై ధ్యానముచేయలేక మొద్దువలె తయారగుదును. సంకల్పసిద్ధి పొందడానికై మనస్సును నిశ్చలముగానూ నిర్మలముగానూ తీక్ష్ణముగానూ వుంచుతాను. ఆలాగున మనస్సును వుంచేలాగు శరీరమును అదుపులో పెట్టుకొందును. బలముగానూ శక్తివంతముగానూ దేహమును వుంచునట్లు తగినవిధంగా మితముగా భోజనముచేయుదును."

ఈ విధంగా నిశ్చయించుకొని సిద్ధార్థుడు తన ఎదుట కడు పూజాభావంతో మోకరిల్లి వున్న ఆ గొర్రెల కాపరిని చూసి తనకు మంచిచేసిన ఆ మేకపాలను ఒకగిన్నెలో పితికి యీయమని అడిగెను. అడిగినంతనే ఆ బాలుడు "ఓ మునివరేణ్యా! నేనలా గిన్నెతో పాలను యీయజాలను. నాచేతితో గిన్నెను తాకి మీకందివ్వలేను. ఏమంటిరా, నేను నీచజాతికి చెందిన గొర్రెలకాపరిని. మీరన్ననో బ్రాహ్మణజాతియందు పుట్టినపూజ్యులు. నేను తాకిన పాత్రతో మిమ్ములను ముట్టుట నేరము చేయడమే అగును" అని జవాబిచ్చెను. అందులకు సిద్ధార్థుడు "ఓ బాలకుడా! నిన్ను జాతిగురించి అడగలేదు. పాలనుయిమ్మని అడుగుతున్నాను. నీవు గొర్రెలకాపరివైనను, నేను తాపసుడనైనను, నీకును నాకును నిజముగా భేదములేదు. మనయిద్దరి నాళములలోను ప్రవహించుచున్నది రక్తమే. కొంత

మంది ఆతతాయిలువచ్చి కత్తులతో నిన్నును నన్నును నరికిన మనయిద్దరి దేహములనుండి ప్రవహించునది ఎర్రని రక్తమే. ఆ రక్తము ఆగక స్రవించినట్లయిన ఎట్టిభేదమును లేని చావునే మనమిద్దరమూ పొందుదుము. ఘనమైన ఉత్తమములైన కార్యాలను చేయువాడు ఉత్తముడు. నీచములైన పాపకార్యాలను చేయువాడు, అధముడు, నీచజాతుడు. నిజమైన భేదమింతే. ఆహారం లేక చావసిద్ధంగావున్న నాకు 'మేకపాలిచ్చి' మంచి ఉపకారమేచేసితివి. అందువల్ల నువ్వునాకు మంచి జాతివాడివే. ఒకపాత్రలో కొంచెము పాలుపోసి యిటుయిమ్ము" అనెను.

నీచ జాతివాడైన తనను ఆ ముని దూరముగా పొమ్మని కసరక ఆప్యాయముగా పిలిచి యిట్టివింతమాటలను పలికినందుకు ఆ గొర్రెలకాపరి ఎంతో ఆనందించెను. కాని అతను చెప్పిన పని ఏ విధముగా చేయవలెనో తోచక సందిగ్ధ మనస్కుడై వేసరించుచుండెను. ఆ మహామహుడు కోరినట్లు పాలతో పాత్రను నింపి ఎటుల తేగలనని ఆ బాలకుని సంశయము. తానొక అధమకులస్థుడు. ముని ఉత్తమజాతి యందు పుట్టిన మహానుభావుడు. తన స్పర్శచే కలుషితమైన పాత్రను అట్టియోగి పుంగవునకెటుల యీయగలనని ఆ బాలుడు వితర్కించుకొనుచుండెను. తానును యోగివంటి మంచి జాతివాడనని విని సంతోషించి తొందరగా పోయి ఒక పాత్ర నిండుగ పాలను తెచ్చి సిద్ధార్థున కిచ్చెను. సిద్ధార్థుడు పాలను త్రాగి పాత్రను తిరిగి అతనికి యిచ్చివేసెను. బాలుడు సవినయముగ ఆ పూజ్యునకు నమస్కరించి తన దారిని తానుపోయెను.

సిద్ధార్థుడు ప్రాణదాయకములగు పాలను త్రాగి తెప్పరిల్లి, చాలాకాలంనుండి కొనసాగించనేరని శక్తితో ధ్యానము చేయుచు, ఆ చెట్టుకిందనే వుండెను. సూర్యాస్తమై చీకటి దిశలక్రమ్మిన తరవాత ఆతడు ఆలాగుననే కూర్చొని వుండగా ఒకపాట అతని చెవుల బడెను. కొంతమంది ఆడ పిల్లలు మధురముగ పాటను పాడుచు ఆ దారిని పోవుచుండిరి. ఆ ఆడ పిల్లలు నాట్యకత్తెలు. ప్రక్కనున్న పట్టణములో మేళము చేయడానికై వీణాది వాద్యములను పట్టుకొని ఆ నాట్యకత్తెలు అటే పోవుచూ ఆలాపించు గీతము మధురముగా వుండెను. వారు పాడుచుండిన గీతము వీణను గురించియే కూర్పబడినది. "వీణ తీగెలను చక్కగా బిగించివుంచిన మధుర నాదము వెలువడును. బిగించిక వుంచిన అమధుర నాదము కలుగును. గట్టిగా బిగించినచో తీగెలు తెగి అసలే ధ్వని నియ్యవు. కావున వీణా తంతువులను విరళంగా ఉంచిననూ, గట్టిగా బిగించి వుంచిననూ, నాదము పుట్టదు. శృతి చెడకుండ జాగ్రత్తగా బిగించినపుడే, సమమైన నాదము తంతువులనుండి జనించును."

ఈ భావమును కలుగజేయు గేయమును ఆ ఆడపిల్లలు పాడుకొనుచుండిరి. ఆగేయార్థమును తెలిసికొని సిద్ధార్థుడు యిట్లు తలపోయసాగెను. "ఈ యువతులు పాడుచున్నపాట నిజం. వీరునాకు బోధ చేశారు. నా దీన దేహ తంతువులను గట్టిగా బిగించి వుంచడంవల్ల పూర్ణముగా శరీరమును శిథిలావస్థకు తెచ్చుకుంటిని. ఆ బాలుడు పాలు తెచ్చి నా కివ్వకపోయినట్లయితే, నేను చనిపోయే వాడినే. అపుడు సత్యాన్వేషణ

యేమయ్యేది? దానితోనే అది సమాప్తి అయేది. దేహానికి ఏపాటి ఆహారమూ యివ్వకపోవడం చేత, మానవకోటి తెలుసుకోవలసిన సత్యాన్ని నేను కనుగొనలేకపోయేవాడిని. నా సత్యాన్వేషణాతత్పరత అంతటితో ఆఖరు. సత్యాన్ని కనుగొనుటకు యీ ఘోరమార్గం అయుక్తం. నేటినుంచి యీ అసన్మార్గాన్ని విడిచిపెట్టి, అన్ని విధాలా జాగ్రత్త వహించి దేహాన్ని కాపాడుకొందును."

మరునాడు సుజాత అనే రమణీమణి ఆ తరుమధ్యమున నుండిన ఆశ్రమమునకువచ్చి గోళ్ళనిముడు సన్ననిబియ్యముతో చిక్కని పాలలో పాయసమును తీసుకువచ్చి "ఓ మునివర్యా! నా కోర్కెలు తీరినట్లే నీ కోర్కెలు సైతం నెరవేరుగాక!" అని అనుచు ఆ పాయసమును అతనికి అర్పించెను. సిద్ధార్థుడు సంతోషముతో పాయసమును స్వీకరించి, సుముఖతనుపొందెను. అప్పటినుండి, అతను ప్రతి ఉదయమున గ్రామమునకుపోయి, తిరిపమెత్తుకొని భుజించుచు, బలమును సంపాదించి ఎప్పటివలె సువర్ణ దేహచ్ఛాయతో నుండెను.

సంకల్పసిద్ధిని పొందుటకు ఇట్టి ఘోరతపశ్చర్యను ఉపకరించదని, గాలితో ముడివేయుటకు ఇసుకతో త్రాడును పేనుటకు ప్రయత్నించుట ఎట్టిదో అది అట్టిదని సిద్ధార్థుడు గ్రహించుకొనెను. కాని అతని అయిదుగురు శిష్యులుమాత్రం యిందుకు అసంతృప్తులైరి. ఆ తాపసి ఘోరతప మాచరించునంత కాలము అతనిని విడువక అంటిపెట్టుకొని వుండి, అతడు తపస్సు మానినంతనే వారు నమ్మకమును పోగొట్టుకొని వెళ్ళి

పోయిరి. దేహాన్ని శుష్కింపజేసి అతి ఘోర కష్టాలకు లోను చేసికొని, ఆధ్యాత్మిక తత్వాన్ని ఎవ్వడును కనుగొనలేడని ఆ శిష్యుల నమ్మకం. "గోతమ వంశజుడైన సన్యాసి ఈ నాడు భోగి అయినాడు. ప్రయాసపడుట అతనికి యిష్టము లేదు. తీవ్రప్రయత్నమును విరమించినాడు. సుఖంగా జీవించు చున్నాడు!" అనుకొనుచు, గురువును నిరాకరించి, భాగ్య భోగముల ననుసరించు అతనిని నమ్ముకొన్నచో లాభములేదని, నిశ్చయించుకొని శిష్యులు తమ దారిని తాము పోయిరి. ఆధ్యాత్మికతత్వాన్ని అట్టి భోగప్రియుడు కనుగొనలేడని వారి విశ్వాసం!

అయితే రాజసన్యాసి మునుపటికంటె ఎక్కువ దీక్షతో తన సత్యాన్వేషణమును కొనసాగించుచుండెను.

## 7

రెండువేల అయిదు సంవత్సరముల క్రితం, అసామాన్య దీక్షతో తపమునాచరించి, సత్యాన్వేషణమును గావింపుచు, సిద్ధార్థ రాజకుమారుడు ఏ తావున సత్యమును కనుగొనెనో ఆ స్థలమును చూడవలెనన్న మనము బీహారులోని 'బుద్ధ గయ'కు పోవలెను. ఆనాడు 'నేరంజిరమని'యు, ఈనాడు 'ఫల్గు' అనియు వ్యవహరింపబడుతున్న నది ఒకటి కలదు. నదిని అంటి పోవుచు రమారమి ఆరేడుమైళ్ళ దూరము వెళ్ళినచో, అచట సమతల కేదారములలో కొంచెము ఎత్తుగావున్న ఒక

దిబ్బకలదు. ఆ దిబ్బమీద నల్లని రాతితో నిర్మితమైయున్న చతురస్రాకారపు ఒక కట్టడమున్నది. అది ఆకసములోనికి చొచ్చుకుపోతున్నట్లు కనిపించుచుండును. ఆ నల్లరాతికట్టడము చుట్టును కొన్ని డాబాలు, అమరియున్నవి. అది మీదకు పోను పోను సన్నమగుతూ చివరనొక కప్పబడని వేదికతో అలరారుతూ వుండును. అందుమధ్యనుండి ఒకస్థూలమైన శిఖరము కాన్పించును. నానావిధములైన రమ్యమూర్తులచే చెక్కబడి బహు సుందరముగా గోచరించే కట్టడము అది; ఇదియే పేరుపొందిన బుద్ధగయ స్మారక చిహ్నము.

బుద్ధగయ స్మారకచిహ్నముగా వెలసిన ఈ కట్టడపు నీడ పడుచుండు ప్రక్కజాగాలో పిట్టగోడ ఆవరణలో యీనాటికినీ ఒక చెట్టు కనబడును. ఆ తరుఛ్ఛాయలక్రిందనే, సిద్ధార్థుడు ఆసీనుడై, తానింతవరకు అన్వేషించుచుండిన సత్యమును కనుగొనెను. జీవనరహస్యమును తెలుసుకొనుటకు తుది ప్రయత్నముచేయవలెననే పట్టుదలతో సిద్ధార్థుడు ఒక నాటి సాయంకాలం ఈ చెట్టుక్రిందకుపోయి, కూర్చుని ధ్యాననిమగ్నుడయ్యెను.

సిద్ధార్థుడు ప్రబోధముపొందిననాటినుండియు, ఈ తరువునకు 'బోధితరువ'ను పేరుకలిగెను. ఆ తరు మూలమునకు పోవుచుండగా "నావలె నీవుకూడ సంకల్పసిద్ధిని పొందుదువు గాక!" అను సుజాతవచనములు అతని చెవులలో ధ్వనించుచుండెను. ఆ వృక్షమూలమున కూర్చొని, నాళములలోని రక్తమంతయు ఇగిరిపోయినను, మాంసమంతయు నశించినను,

బొమికెలు, తోలు, నజ్జీతంతువులు తప్ప వేరేమీశరీరమున మిగలక పోయినను, మానవకోటికి పరమానందము కలుగచేసే సత్యమును కనుగొనుటకు అతడు ధ్యాననిరతుడయ్యెను. జన్మ పరంపరనుండి జననమరణములనుండి, జరారోగములనుండి, మానవుని విముక్తి చేయు తత్త్వమును పరిశోధించెదనని అతని పట్టుదల. చర్వితచర్వణములైన సుఖదుఃఖముల బారినుండి తప్పించే ఏ తత్త్వమును కనుగొనుటకు సంసారమును త్యజించెనో, రాజ్యభోగములను వదలుకొని పరివ్రజించెనో, అట్టి తత్త్వమును కనుగొనువరకు తాను కూర్చుండిన చోటునుండి మరి కదలనని సిద్ధార్థుడు దృఢప్రమాణమును జేసికొని, ఆ బోధివృక్షముక్రింద అటులనే వుండెను. జననమరణ వికారముల నుండి పరిత్రాణమును ప్రసాదించి, నిబ్బనమునకు గొంపోవు మార్గమును కనుగొనువరకూ తాను కూర్చున్న చోటునుండి లేవనని అతను ప్రమాణము చేసికొనెను.

ఇదిగొప్ప ప్రమాణము; మహోగ్రముకలది. నేటివరకు జగత్తులో మానవుడట్టి ప్రమాణమును ఎన్నడును చేయలేదు. పరమార్థాన్ని తెలుసుకొనుటకు ఘోర తపస్సులనుచేసిన అనేకమంది తాపసులు, ఋషులు, మునులు, యోగులు, మన దేశంలో వుండియుండక పోలేదు. అనేక సంవత్సరములు చెప్పరాని ప్రయాసపడి, వారు పరమానందాన్ని పొందిరికాని అది నిత్యనిరవధికానందంకాదు; శాశ్వతమైనదికాదు. మార్పు చెందకుండా అవి కాపాడునదికాదు. బహుప్రయాసమున స్వర్గ లోకములో పరమానందమును అనుభవించి ఆర్జించిన పుణ్యము క్షీణింప, తిరిగి అట్టివారు, భూలోకమున అల్ప

జన్మలుపొంది, జరారోగమరణములకులోనై, బాధపడుచుం దురు. ఇట్టి మహదానంద సముపార్జనము, 'నిబ్బాన ఆనందము లతో సరిపోల్చిచూస్తే అల్పార్థమైనదియే!

ఒకడు ధనసంచయాలను కూడబెట్టి, పెట్టెలో పెట్టి, విచ్చలవిడిగా ఖర్చుచేయుచుండిన, ఆ నిధులుకొంతకాలములో తరగిపోవును. పెట్టె శూన్యమగును. తిరిగి ఆతడు ధనమును ఆర్జింపవలసి వుంటుంది. అట్టిదే యిట్టి తాపసులు మునులు చేయు తపఃఫలము. ఆర్జించిన పుణ్యము క్షీణించినపిదప తిరిగి భూలోకమున జన్మమును బొందవలెను. తిరిగి స్వర్గసుఖానం దాలను అనుభవింపవలెనన్నా, పూర్వజన్మములో చేసిన కఠిన తపస్సును మళ్లా చేయవలసి వుండును. అలాంటి పరమానం దము కావలసినంతవరకు, జన్మపరంపరలలో తిరిగి తిరిగి యిదే విధమున ఆచరించవలసివుంటుంది. జన్మ ఎత్తడము, ఎత్తి కఠిన తపస్సును చేయడము, చేసి పుణ్యమును ఆర్జించడము, ఆర్జించి స్వర్గసుఖానందాలను కొంతకాలము అనుభవించడము, అను భవించిన తరువాత పుణ్యము క్షయముకాగా, పునః భూలోక మున జన్మించడమూ నరులకు మామూలు.

ఒక రాతి బండను అతికష్టంతో ఎత్తైన ఒక కొండశిఖరం వరకూ దొర్లించుకుపోగా, అది దొర్లి కిందపడి తిరిగి కొండ మొదటకు చేరడము దానిని మళ్ళీ క్లేశంతో కొండచివరకు దొర్లించుకుపోగా అది తిరిగి కిందకు దొర్లడము, ఎటువంటిదో జన్మపరంపరయున్నూ అటువంటిది. జీవనమనే రాతిగుండును సుఖమనే పర్వత శిఖరమును చేర్చుచు అది తిరిగి దుఃఖమనే

అద్రిద్రోణి, లోనికి దొర్లిపోవడమూ, మళ్ళీదానిని ఆనందముచే పర్వతశిఖరమును చేర్చడమూ, అదితిరిగి క్రిందకు జారిపడడమూ అనే ప్రక్రియ అనంతంగా సాగుతూనేఉంది. ఇలాగ అవసరము లేకుండా వికారరహిత శాశ్వత పరమానందమును కనుగొన వలెనని సిద్ధార్థుని దృఢ సంకల్పం. ఒక పర్యాయము చేరిన, మరి క్షితి లేని పరమసుఖస్థితిని కనగొనే దీక్షను పూని సిద్ధార్థుడు ఆ తరుమూలమున ధ్యాన నిమగ్నుడా యెను. ఉరువేల వనములో, ఆ నాటిరాత్రి ఈ నిబ్బరమును కన గొనుటయో. తదన్వేషణములో ప్రాణములను గోల్పోవుటో నీదో ఒకటి తేలవలయునని ఆతడు నిశ్చయించుకొనెను.

ఈ సిద్ధికై సిద్ధార్థుడు తన యావన్మనశ్శక్తిని వినియోగించి, తదేక దీక్షతో వుండగా అశాశ్వతము అశ్వరమూ అల్పార్థమును అయిన భోగానుభవములపై అతని మనస్సు మరలింది. సంసారభోగములనుండి మనమును త్రిప్పి, జన్మ కారణములను అన్వేషింప ఎంతప్రయత్నించినను తిరిగి తిరిగి ఇదివరలో రాజప్రసాదమున తాననుభవించుచుండిన సంసార సుఖములమీదకే బుద్ధి మళ్లుచు, పూర్వపు సంతోషదాయక సుఖానుభవములే కళ్ళకు కట్టినట్లు తాండవమాడుచుండెను. రమ్యమైన ప్రాసాదములు ఆనందదాయక కేళీవనములు, అచటి పద్మపూరిత సరోవరములు, ఆనందనిలయములగు నికుంజములు, తన సేవ తప్ప వేరొక పని లేని దాసదాసీజనములు, పూర్వము తాను అనుభవించు చుండిన భాగ్య భోగము లన్నియూ ఒక్కమాటు జ్ఞప్తికి వచ్చినవి. తరుణవయస్కు

రాలగు భార్య అతి ప్రియమైన ఆమె చేష్టితములు, మనమును ఆకర్షించు ఆమె నేత్రములు, చూపుల అందము, మధురాతి మధురమైన ఆమె కంఠధ్వని, చిదానందమూర్తి అగు తన ఏకైక పుత్రుడు, వలిత కేశములతో వార్ధక్యము మెల్లమెల్లగ ముందంజ వేయుచుండ తనకు రాజ్యపాలనములో జ్యేష్ఠ పుత్రుడు సాయము చేయ నిరాకరించినందులకు లోలోన వ్యథచెందుచుండిన జనకుడు ఒక్కుమ్మడి అతని స్మృతిపథమున మెరసెను.

ఇతరుల వలె నీవు సంసారములో నుండిన రాజాధిరాజువై గొప్పకీర్తి సంపదలను సంపాదించియే యుందువు. వివేకులందరూ విలువైన వానిగ పరిగణించు వాని నన్నిటినీ, నీవు తప్ప మరియెవ్వరును వూహించనైన వూహించనిదియు, బహుశః ఎన్నడును కనుగొనబడలేనట్టిదియు నగు తత్త్వాన్వేషణముకొరకు పరిత్యజించి పరివ్రజించితివి. అట్టి తత్త్వముఉన్నదో లేదో కూడ తెలియదు. దృఢములైన యిట్టి సంసారసుఖములను, భోగానందములను విడిచిపెట్టి, కలదో లేదో తెలియని తత్త్వాన్ని కనుగొనుటకు ప్రయాసపడుటలో నీవు బుద్ధిహీనుడవైతివా?

“సరే సంసార సుఖమును విడనాడి, వానికంటె ఉన్నతమైనదాన్ని కనుగొనుటకు ప్రయత్నింపవచ్చును; కాని తిండిమాని, దేహాన్ని శుష్కింపజేసుకొనుచు, కఠిన తపమును చేయు పూర్వ సాంప్రదాయముల ననుసరించు సన్యాసుల వలె, మునులవలె నీవెందుకు ఆచరించకూడదు? ఆధ్యా

త్మిక తత్త్వాన్వేషణములో వారందరూ తప్పుతోవనే తొక్కి-యుండుట సంభవమా? అనశ్వరముకాకపోయినను, వారు కోరు మహదానంద సంపాదనతో నీవెందుకు సంతృప్తి జెంద కూడదు.

“జీవితకాల మతి స్వల్పం. మనుష్యు లతివేగిరము మృతి జెందుదురు. నీవుకూడ కొద్దికాలంలోనే కాలగతి చెంద గలవు. మృత్యువనే చీకటి నిన్నావహించకమునుపే, అనుభవించగలిగిన సౌఖ్యాల నెందుల కనుభవించ కూడదు? చావు వచ్చిన పిదప మరి సౌఖ్యాల ననుభవించలేవే? ప్రేమయున్నది; కీర్తియున్నది; ప్రతిభయున్నది; నరులపొగడ్తయున్నది; వానికై ప్రయత్నించిన వానిని బడయగలవు. అవన్నీ దృఢమైనవి; నిబ్బరములైనవి. అవి నీవు కాంచుచున్న కలలవంటివి కావు. అవన్నీ ననుభవింపగలిగినవే, ఈ నిర్మానుష్యపు అడవిలో, ఎవరూ ఎన్నడు గాంచనిదానికై నీ వెందుకు వృథాప్రయాస పడి బాధపడెదవు.

బోధివృక్షముక్రింద కూర్చునియుండి సిద్ధార్థుడు జన్మ లేకుండ జేసుకొనే తరుణోపాయము గురించి ఆలోచించుచుండ, త్యజించిన సుఖజీవన జ్ఞప్తి మనస్సునకు బాధకలిగించెను; అన్వేషించుచున్న దానిలో సిద్ధి కలుగదేమో అనే అనుమానము పీడించుచుండెను; తాను సంకల్పసిద్ధికై అవలంబించిన మార్గము యుక్తమైనదేనా అనేకంత మనోవైకల్యమును కలుగజేయుచుండెను. కాని సంకల్పమునుండి మాత్రము వెను దీయలేదు. కనుగొనదలచిన దానిని కనుగొనుటకై మరింత తీవ్రముగ పాటుబడుచుండెను.

"ఓ మారుడా, దుష్టుడా, పొమ్ము. నీవెవ్వడవో నాకు తెలుసును. మంచిదానినుండియు, గొప్పదైనట్టియు, పుణ్యామైనదైనట్టియు ప్రతికార్యమునుండి నరులను త్రిప్పివేయు దుష్టుడవు. నేను కనుగొనదలచుకొన్న దానినుండి నన్ను విరమించునట్లు చేయకుము. దృఢనిశ్చయమును చేసుకొనియున్నాను. నాళములలోనుండే రక్తమంతయు ఇగిరిపోయినాసరే, మాంసమంతా నశించినాసరే, కేవలము ఎముకలు చర్మము మిగిలినాసరే, నేనుమాత్రం సంకల్పసిద్ధి కలుగువరకును ఇక్కడనుంచి కదలను" అని అతడు అనుకొని యుండెను.

ధ్యాననిమగ్నుడై, జననమరణ చక్ర పరిభ్రమణమును అడ్డి, పాపాన్ని అంతరింపజేసి, నాశనము వికారములేని నిత్యానందాన్ని ఇచ్చే మార్గాన్ని గురించి యోచించు సిద్ధార్థుడు అచట కూర్చునియుండెను. మనోవైకల్యమును గలుగజేసిన దుష్టాలోచనలను మనమునుండి పారదోలి, మనస్సును నిశ్చలంగా ఉంచుకొనియుండ, తరంగచలనములేని సరోవరమువలె ప్రశాంత మనస్కుడయ్యెను. పూర్వానుభవములు జ్ఞప్తికి రాలేదు. శంకలు, అనుమానములు మాయమయ్యెను.

అతిశాంతంగా ధ్యానించుచు బోధితరుమూలమున కూర్చునియుండ, శాక్యవంశజుడైన గోతమ సిద్ధార్థ రాజకుమారుడు, బుద్ధుడయ్యెను. చీకటిలోనుండిన మానవకోటికి వెల్తురు నిచ్చిన యోగివరేణ్యుడయ్యెను. దీర్ఘసుషుప్తినుంచి మేల్కాంచినవానివలె ఉత్తేజితుడైయుండెను. ఇప్పటికి సమూలంగా జన్మరహస్యాన్ని తెలుసుకొన్నాడు: నరులెందుకు జన్మ-

పరంపరల లంపటమునందు తగుల్కొని, పుట్టుచు, చచ్చుచుం దురో తెలుసుకొన్నాడు; బోధితరుమూలమున కూర్చుని వుండి నిర్వాణమును ఆయన తెలుసుకొన్నాడు.

ఈ నూతన మనశ్శక్తితో, నరులెందుకు పుట్టుచు, గిట్టుచు తమ కర్మననుసరించి వివిధజన్మములను ఎత్తుదురో గ్రహించాడు. సత్కార్యములను జేయుటవలన మంచి జన్మలను కొందరు కాంచుదురు. పాపకార్యములను జేయుటవలన కొందరు అధమాధమ జన్మలను ఎత్తుదురు. ఇహమున పరమున కూడ, మనకర్మయే మనకు సుఖాన్నిగాని, దుఃఖాన్నిగాని కలుగజేయునన్నది, తిరుగులేని విధియని ఆయన కనుగొన్నాడు.

ప్రపంచము నిరంతరము మార్పుచెందు చుండుననియు, సముద్రతరంగములపై అల్లల్లాడు నావవలె నరుడు ఒక మాటు సౌఖ్యమునకు యింకొకమాటు దుఃఖమునకు అనువగుననియు, ఇట్లు మునుగుతూ తేలుతూ మానవుడుండుట సవ్యమైనది కాదనియు అతడు తెలుసుకొన్నాడు. అప్పుడప్పుడు ప్రపంచం కలుగచేసే సౌఖ్యానికై, దేవులాడడమే, నరుడీవిధముగ నిరంతరము మార్పు చెందే సంసార తరంగములపై అల్లల్లాడుటకు కారణమని, గ్రహించాడు. లేళ్ళవలె కంటబడు ఏ అల్ప సౌఖ్యాలకోసమో అనురక్తుడై అనుభవాలలో మునిగి తేలుతూండడమే నరుడు జన్మకాలములో చిక్కుకొని పట్టుబడుటకు హేతువని అతనికి స్పష్టమయింది. అందుకని జన్మకాలములో పడిపోకుండా, తప్పించుకోవాలంటే, నరుడు ప్రతి సౌఖ్యానుభవమును నిరాకరించవలెనని తెలుసుకొన్నాడు.

సుఖానుభవములో పడిపోకుండా ప్రమత్తతో నిగ్రహించి నట్లయితే అంతకంటె మంచిదేవుందనే జ్ఞానం కలుగుతుంది. అట్టిమంచిది ప్రియమైన దగుటవలన నిరంతరము మారుచుండే సంసారమును, క్షణికములగు సౌఖ్యములను అనుభవించుటకు మరి అవసరం వుండదు. అందుపై నిశ్చయమైన నిచ్చానానంత ఆనందమును చెందును. ఇది నిబ్బనమార్గమని ఆ మహాపురుషుడు నిర్వచించి అది అష్టమయ మార్గమని విశదీకరించెను.

అతడు నిర్వచించిన ఈ ఉత్తమ అష్టమయ మార్గము; మోక్షమునకు గొంపోవును. ఉదారావయవములు, సత్కీర్తి కలుగల ప్రతివాడును ఈ మార్గమునే అనుసరించును. నిబ్బన మార్గమున వుండు అష్టాంగములు విశిష్టమైనవి. వాటిని యీ దిగువ పొందు పరుచుచున్నాను.

(1) ఇందు ప్రథమాంగము సమ్యగ్దృష్టి; ప్రపంచములో స్వంత జీవితము మొదలుకొని, ప్రతివస్తువూ ప్రతిక్షణమూ మార్పు చెందుతూ వుంటుంది. ఏదీనశించకుండా వుండదు. అందువల్ల సంసారములో అత్యంతము లగ్నమై వుండి పోయిన జీవి, నైరాశ్యమును దుఃఖమును పొందును. ఇహమున, పరమున సత్కార్యములు సదా ఆనందమునకును, పాపకార్యములు దుఃఖమునకు దారితీయును. ఈ సత్యమే సమ్యక్ దృష్టియందు యిమిడి వుంది.

(2) ద్వితీయాంగము సమ్యగ్జ్ఞానము: ఇది సంసార యథార్థ స్వభావం తెలుసుకొని, దానినుండి విముఖతను చెంది

వుండే మనః ప్రవృత్తి. సంసారబంధములలో చిక్కుకొని దుఃఖమునకు లోనై బాధపడే ప్రతిజీవజంతువునందు కృపగలిగి వుండడం, అట్టిదాని బాధను తొలగించే ఉద్దేశ్యమును కలిగి వుంటూ యావచ్ఛక్తినీ వినియోగించిసాయపడడం యిందులో గర్భితమై వుంది.

(3) మూడవది యథార్థవాదము: నిజమైనదియు, చేతనోపపన్నమైనదియు, మృదువైనదియు అగు దానిని చెప్పుట యథార్థవాదం. అబద్ధాలను అమర్యాదకరమైన మాటలను, నిందావాక్యములను, నిరర్థక సంభాషణను విడిచిపుచ్చవలెనని దీని ఆదేశము.

(4) నాల్గవ అంగము ధర్మాచరణము: వధియించుట, దొంగిలించుట, చేయరాని పనులు చేయించే త్రాగుడు ఇత్యాది దుష్టకార్యములను పరిత్యజించుట.

(5) ధర్మజీవనము అనునది అయిదవఅంగము; మరియే జీవజంతువునకును హానికలుగజేయకుండా వుండేవిధాన జీవనోపాధిని సంపాదించుకొని జీవించుట.

(6) ధర్మయత్నము లేక శీలము అనునది ఆరవ అంగము: ప్రమాదకరములైన ఆలోచనలు, దుష్టభావాలు కలుగకుండా వుండేట్టున్నూ, ఒకవేళ అట్టివి గలిగినచో వానిని అంతరింపజేసేటట్టులనూ, మనస్సును భావములను నిగ్రహించుకొనవలెను. మనస్సులో సద్భావాలు, సదాశయాలు ఉద్భవించేటట్టు చేసుకొనుచు,ఉద్భవించిన వానిని పెంపొందించు కొంటూ వుండడమే ధర్మయత్నము లేక శీలము.

(7) ధర్మావధారణము లేక సమాధి అనునది ఏడవ అంగము : మన దేహముల నిజస్వరూప స్వభావములను లెస్సగ గుర్తెరిగి, అసలు ఉన్నదానికంటె వానికెక్కువ శోభవున్నట్లు చింతింపక, నిజమైన వాని స్వభావమును మరువకయుండడమే యిది. మన దేహములు చేసే కార్యములు, నడిచేనడతలు, వాని చేష్టలు దేహస్వభావము ననుసరించే వుంటున్నవనియు, అవి మరివేమీగా కావనియు జ్ఞప్తియందుంచుకొనుట అనునది కూడా ఇందులోవుంది. మరియు మన మనస్సులు, నిరంతరము ఒకదాని వెనుక నొకటి ఆలోచనా భావ పరంపరలకు స్థానములనీ అవి క్షణ క్షణమూ మారుచునే వుంటుననీ జ్ఞప్తియందుంచుకోవడము ఇందిమిడియున్నది. భవబంధములను తెగకొట్టి, ముక్తినిచ్చే నిర్వాణమునకు దారిచూపే బుద్ధ బోధిత మార్గక్రమమును మరువక మనమునవిడుకొన వలెను.

(8) ఈ మార్గములోని ఎనిమిదవ అంగము ప్రజ్ఞ : మనస్సును ఇచ్చ వచ్చినటుల నిటునటు చలింపనీయక, ధ్యానించుచున్న విషయము మీదనే స్థిరంగా వుండేటట్టుచేసుకొని, గ్రహింప ప్రయత్నించుచున్న విషయమును లెస్సగ బోధపరుచుకోవడము.

రెండు వేల అయిదువందల సంవత్సరముల క్రింద ఉరువేల వనములో, బోధితరు మూలను, కూర్చొనియుండి శాక్యకులోద్భవుడు, సిద్ధార్థ రాజకుమారుడీ అష్టాంగమార్గమును కనుగొని బుద్ధ గౌతముడయ్యెను. ధర్మయత్నము, ధర్మావధారణము, ధర్మసమాధి అను తుది మూడు అంగములు బుద్ధుని

బోధలను అతిభక్తితో ఆచరింపుచు, అట్టి ఆచరణను సుఖముగా చేయుటకై సంసారము త్యజించి భిక్షులైనవారలే ఎక్కువుగ ఆచరించుట కేర్పాటుచేయబడ్డవి. సంసారములో ఉండినా, భిక్షులైనా మిగతా అయిదు అంగములను ప్రతివాడును కొంతవరకైనా అనుసరింపవలయును. మొదటి రెండుఅంగములు సమ్యగ్దృష్టి, సమ్యగ్జ్ఞానము అనేవి అనేక సంవత్సరములు తదేకదృష్టితో వానిని సాధించిన వారలకుగాని కుదురవు. అట్టుల చేసినవారికి, బుద్ధునికి గోచరమైన విధాన, సంసారముయొక్క యథార్థ స్వభావము బోధపడును. కాని బుద్ధుననుసరించదలచు కొన్నవారలకు కొంతవరకైనా ఈ రెండు అంగముల జ్ఞానముండవలెను. వారేదో యొకనాడు, క్షణభంగురములైన సంసారసుఖములను విడనాడి, వానికంటె ఎక్కువ స్థిరమైన వానిని పొందవలెనన్న జ్ఞానముకలిగియుండవలెను.

మధ్యనున్న మూడు అంగములను ప్రతివాడును యావచ్ఛక్తిని వినియోగించి అభ్యసింపవలెను. మనోవాక్కాయ కర్మల ఏ జీవజంతువునకును హాని చేయక ప్రతిమానవుడును జీవించవలెను. దుష్టభాషణమును పాపాచరణమును ప్రతిమానవుడును పరిత్యజించవలెను. ఈ విధమున భక్తితో అనుసరించిన, బుద్ధప్రబోధిత వివేకప్రాప్తికి దారిచూపే మనోనిగ్రహము కుదురును.

ఇట్టి యథార్థ వివేకము కుదిరిన తరువాత, సంసారము నుండి మనస్సు విముక్తమగును. ఇట్టి విమోచనము జరిగిన పిదప, ఏ లోకములోనూ, ఏ రూపముతోనూ మరి జన్మ

వుండదు. మరి జన్మముండదుగాన, జన్మగాంచే ప్రతిమానవునీ ఆశ్రయించివుండే కష్టదుఃఖములు అంతరించును; కాబట్టి దుఃఖ సంచయమంతా శాశ్వతముగా నశించును. శీల, సమాధి, ప్రజ్ఞ లను "తమోగుణమార్గమ"ని బౌద్ధులు వ్యవహరింతురు.

# 8

అతి ప్రయాసపడి సిద్ధార్థుడు సంకల్పసిద్ధి పొందాడు. తానన్వేషించుచున్న తత్త్వమార్గాన్ని కనుగొన్నాడు. తుఫా నుచే అల్లకల్లోలితమైన నదిలో ఈదియీది, ప్రాణములతో ఒడ్డున చేరినవాడు దాటిన ప్రమాదాన్ని తలచుకొంటూ పీకిన కాలు చేతులను కూడ దీసుకుని అలసట తీర్చుకుంటాడు. ఎత్తైన కొండను అధిరోహిస్తూ ఆపశోపాలూ పడి కొండ మొదటవున్న వేడిగాలిని విడిచి ఎట్టకేలకు పర్వత శిఖరమును చేరినవాడు అక్కడవుండే నిర్మలమైన చల్లనిగాలి పీలుస్తూ సేద దీర్చుకుంటాడు. అదే విధముగ అనేక కష్టములుపడి భవ బంధములను తెగగొట్టుకొని నిరంతరం ధ్యాన నిమగ్నుడై సంకల్పసిద్ధిని పొందిన బుద్ధుడు అమృతానశ్వర జ్ఞానాన్ని అను భవిస్తూ ఆ ఉరువేల వనములో ప్రశాంతంగా కొంత గడవు గడిపెను. అక్కడకు కొంచెము దూరములో ఒక వృక్షము కలదు. గొర్రెల కాపరులు, మిట్టమధ్యాహ్నము ఆ చెట్టు నీడలో సేదతీర్చుకుంటూ వుండేవారు. బుద్ధుడా వృక్షము కిందకు జనెను.

ఆ చెట్టు నీడను బుద్ధుడు కూర్చొని వుండగా ఒక బ్రాహ్మణుడా దారిని పోవుచు, "గోతముడా! నిజమైన బ్రాహ్మణుడెవడు?" అని ఆయనను ప్రశ్నించెను. ఆ గర్వపోతు బ్రాహ్మణుడు "భంతే" మొదలైన ఏ గౌరవ వాచకములను ప్రయోగింపక, కుటుంబ నామముతో పిలిచినను దానిని సరకుగొనక బుద్ధుడు "పాపమును పరిత్యజించి, నిగర్వియై, ఇంద్రియ నిగ్రహము కలిగి, పుణ్యాత్ముడై పండితుడై, సంసార సంబంధములులేక, పవిత్ర జీవితమును గడుపువాడే బ్రాహ్మణ శబ్ద వాచ్యుడు" అని ప్రత్యుత్తర మిచ్చెను. అది విని ఆ బ్రాహ్మణుడు "ఈ సన్యాసి గోతముడు నన్ను తెలుసుకొన్నాడు" అని మరీ, సణుగుకొనుచు, అచటినుండి వెడలి పోయెను. ఇదియైన రెండు రోజులకు వస్తువులను గ్రామగ్రామములను అమ్ముకొంటూ, తపుస్స, భల్లికలను ఇద్దరువర్తకులు ప్రక్కనుండి పోవుచు, ఆ గొర్రెలకాపరుల చెట్టుకింద గోతముడు శాంతంగా, పరితుష్టుడై కూర్చునియుండుటగని, గొప్ప జయముగాంచి అద్దాని ఫలము ననుభవించుచున్న వానిగా ఆతడు కాన్పింప, వాని దరికిపోయి, సవినయంగా తమ ఆహారములో శ్రేష్ఠమైన భాగమును వానికి సమర్పించిరి. బుద్ధుని విశిష్టరూపమును గంభీర దృష్టిచిచూచి, తమను శిష్యులుగ పరిగ్రహించమని వేడుకొనిరి. బుద్ధుని తొలిశిష్యులు వీరిరువురే.

తగినంతకాల మీవిధమున విశ్రమించి ఇక చేయవలసిన దానినిగూర్చి బుద్ధుడు యాలోచింప ప్రారంభించెను. తా నన్వేషించిన సత్యమును తెలుసుకొన్నాడు. అట్టి అమూల్య

తత్త్వాన్ని తనలోనే దాచుకోవడం భావ్యం కాదనియు, తత్సత్య ప్రకాశనము చేసినయెడల ఇతరులుకూడ తాననుభవించిన ఆనందాన్ని అనుభవించగలరనియు,అటులఈ తత్త్వాన్ని ప్రకటించుట మంచిదనియు అనుకొని "ఈ నా సిద్ధాంతాన్ని బోధపరుచుకోవడం సులభమైనపనికాదు. అతి సూక్ష్మమైనది నిగూఢార్ధమైనది. ఇది నిశ్చయము. విమర్శకారులు, చింతా పరాయణులే దాన్ని గ్రహించగలిగి, దానివలన ఉపకారము పొందగలరు. కాని వివేకశీలురు అతి కొంచెమందే ఉంటారు. చింతన సల్పుచు, విమర్శ చేయడమన్న నరులలోచాలామందికి ఇష్టముండదు; అలాంటిశ్రమ, వారుపడరు. సులభమైనదాన్నే వారు కోరుకుంటారు. వారికి కులాసా యిచ్చేదాన్నే అభిలషిస్తారు. సంతోషదాయకములగు వానిపైనే వారి మనస్సులు పరుగులిడుతుండును. విలాసములందే బద్ధమనస్కులైవుందురు. వారికీ సిద్ధాంతాన్ని బోధింపయత్నించిన వారికది బోధపడదు. నా మాటలను వారు వినరు. నిరర్థకమైన శ్రమపడుట తప్ప వేరేమీ లాభముండదు" అని లోలోన తలపోయుచు కనుగొనిన సత్యమును ప్రకటింపక ఊరుకొనుటయే మంచిదని అనుకొనెను. ఈ ఆలోచనతో ఊరుకొనక తిరిగితిరిగి యోచింపుచు "ఔను; ప్రపంచంలో ఎక్కువమంది నరులు నేను కనుగొనిన ఈ సత్యాన్ని వినడానికైనా ఇచ్ఛగింపరు. దానిని విన్నప్పటికీ బోధపరుచుకొననేరరు. సుఖంగా ఎట్టి శ్రమపడుటకైనా ఇష్టపడక, కులాసాగా విలాసాలతో కాలక్షేపం చెయ్యడానికే కుతూహల పడుతుంటారు. కాని ప్రపంచంలో అందరూ ఒక్క

మోస్తరు నైజంలో ఉండరు. కొందరైననూ, అతికొంచెం మందే కావచ్చును; సామాన్యంగా జీవిస్తున్న విధానంతో తృప్తిపడక, తెలిసినదానికంటె ఎక్కువగా తెలుసుకోవడానికి ప్రయత్నిస్తూ భోగానుభవంలోనే తగుల్కొని వుండిపోవుటకు సహించరు. నేను కనిపెట్టిన ఈ ధర్మాన్ని విని నిజమైన ఆనందాన్ని సుఖాన్ని పొందగలిగిన ఏ కొద్దిమందికైనను పిసేభాగ్యం కలుగజేయకుండా, మూత ముప్పిరిగా ఆ సత్యాన్ని దాచి వుంచడం తగునా? అది ఉచితం కాదు. దుఃఖము; దానికి కారణం, దానినివారణం, అది లేకుండా చేసుకొనేమార్గం అనే ఈ చతుర్గుణ ఘనసత్యాన్ని, ప్రపంచానికి ప్రకటిస్తాను. నా బోధలు వినే అనేకుల్లో నా బోధను అవగాహన చేసుకొనే వాళ్ళు కొద్దిమందైనా వుంటారు. అంబుజాలు పుట్టే సరోవరంలో, తెల్ల, నీలి, ఎరుపు కలువలు, మొలుస్తుంటాయి. వానిలో ఎన్నో అడుగున బురదలోంచి కొద్దిగా పెరిగి అక్కడ ఆగిపోతాయి; కొన్ని మరికొంతదూరం పెరిగి ఆగిపోతాయి. ఇంకొన్ని నీటి మట్టంవరకూ వచ్చి ఆగిపోతాయి; మరికొన్ని కొంచెం మట్టుకే నీటిమట్టందాటి, ప్రకాశవంతమైన సూర్యకాంతిలో, చల్లనిగాలిలో తలూచుతూ. చూపరులదృష్టి నాకర్షిస్తాయి. ఆలాగుననే కామరాగపంకిలంలో కూరుకొనిపోయిన మనస్సులుగలవారు కొందరు; అంతగా కూరుకొనిపోనివాళ్లు కొందరు; అతి కొద్దిమందిమాత్రమే కామపంకంచే అంతగా కలుషితముకానివారు. వీరే నా ప్రబోధాన్ని విని బోధపరచుకొనగలరు. అందుకై వారికి నా

తత్త్వాన్ని ఎరుకపరుస్తాను. నే నిపుడు బయలుదేరి ప్రపం చానికంతా నా సత్యాన్ని ప్రకటిస్తాను." అని దృఢంగా సంక ల్పించుకొని, ఎవరు తన బోధను సులభంగా గ్రహించగలరా అని ఆలోచిస్తుండెను. ఇంతలో తన పూర్వాచార్యుడు 'అలారకలాముడు' జ్ఞాపకమునకు వచ్చెను. ఆతడు పండితుడు; చింతన పరుడు; అతి మేధావి; పవిత్రచరిత్రుడు, అందుకై అలారునకు తన సత్యాన్నెరింగింప నిశ్చయించుకొనెను.

ఇంతలో ఒకడు బుద్ధునివద్దకువచ్చి, అలారుడు కాల గతి చెందెనని తెలియపరిచెను. ఆ వృత్తాంతాన్ని విని బుద్ధుడు విచారించెను. చెప్పినంత మాత్రాన గ్రహించగలిగిన ధీమం తుడు కలాముడు మరణించినందులకు విచారపడి, ఇంకెవ్వనికి తన సిద్ధాంతాన్ని ఎరింగింపనా అని యోచించుకొనుచుండగా, రామ శిష్యుడైన ఉద్దకుడు జ్ఞాపకమునకు వచ్చెను. ఆతనివద్ద ఇదివరలో తాను శిష్యరికము చేయుచున్నపుడు, ఆతని కుశా గ్రబుద్ధిని, బుద్ధుడు తెలుసుకొనియుండెను. ఉద్దకుని గూర్చి భోగట్టాచేయగా, గతరాత్రియే ఆతడు దివంగతుడైనాడని విని విచారించెను.

అలారకలాముడు. ఉద్దకుడు మరణించారు; ఇంక ఎవరికి తన మతాన్ని బోధించనా అని దీర్ఘంగా బుద్ధుడు ఆలోచిం చాడు. ఇదివరలో ఉరువేలవనంలో తపస్సుచేస్తుండినపుడు తనకు శుశ్రూషచేసిన అయిదుగురు శిష్యులు జ్ఞప్తికొచ్చారు. మూర్ఛచెంది కిందపడి, ఘోరతపస్సును మానిన వెనుక వారు గురువునందు నమ్మకములేక వానిని విడిచిపోయిరి. వారెక్క-

డున్నారని భోగట్టాచేయగా, వారణాసికి దగ్గిరగాఉన్న 'మిగ దయవనం' (వేళ్ళవనం) లో ఉంటున్నట్టు తెలిసికొని నూట ఏభైమైళ్ళు దూరములో నున్న వారాణాసికి ప్రయాణమై, ఉరు వేల వనమును విడిచెను.

కొన్నాళ్లైన తరువాత ఒకనాటి సాయం సమయమున, మిగదయవనమున ఒక నికుంజములో బస ఏర్పచ్చుకొన్న పూర్వశిష్యులనైదుగురు బుద్ధునిచూచి "అదుగడుగో! ఆ సన్యాసి గోతముడు! తపస్సుమాని భోగలాలసుడై సుఖజీవ నానికి లొంగిపోయాడు. అతనితో మాట్లాడవద్దు. అతన్ని గౌరవించవద్దు. అతని భిక్షాపాత్రనుగాని, పై బట్టనుగాని అందు కోవద్దు అక్కడొక చాపవేద్దాం, ఇష్టముంటే దానిమీద కూర్చోనీ! లేకపోతే నిలుచుంటాడు. ఇట్టి పనికిరాని సన్యాసిని ఎవడు గౌరవిస్తాడు!" అనుకొన్నారు. కాని ఆతడు సమీపిం చిన కొలదీ, ఆతని శుశ్రూషచేసి శిష్యరికం చేస్తున్న సమ యంలోకంటె ఈనాడు ఆతడు మార్పుచెందినవాడుగా కాన్పిం చాడు. ఇదివరలోలేని నూతన గాంభీర్యం, ఘనత ఆతనిలో తాండవిస్తున్నాయి. ఆతనివైపైనా చూడకుండావుండి పోవా లన్న సంకల్పం వారిలో మటుమాయమయింది. వారిలో ఒకడు ముందుగా వెళ్ళి ఆహ్వానిస్తూ, ఆతని భిక్షాపాత్రనూ, పైబట్టనూ అందుకొన్నాడు. ఇంకొకడు ఆసనాన్ని తయారు చేశాడు- మూడవవాడుపాద్యమిచ్చాడు. బుద్ధుడు ఆసనా విష్టుడై, "సాధువులారా! వినండి. అమృతత్వానికి మార్గాన్ని కనుగొంటిని. నేను చెప్తాను, వినండి. నేనుబోధించినదాన్ని విని

తదనుసారంగా ఆచరిస్తూ, అభ్యసిస్తే, ఇంకేదో జన్మలో కాక, ఈ జన్మలోనే నేను చెప్పేదాని యథార్థ్యాన్ని కనుగొంటారు. జన్మమరణాల ఆవలనుండే స్థితిని మీరు తెలుసుకోగలరు" అని వారితో చెప్పెను.

తన పూర్వగురువు వచనాలను విని, వారాశ్చర్యపోయారు. ఘోరతపస్సుచేసి, సత్యాన్వేషణం ఆతడు చెయ్యడం వారు చూచారు. ఈ కఠిన తపస్సును ఆతడు విడిచిపెట్టడం చూచి, ఆతడు సత్యమార్గమును వదలిపెట్టాడని అభిప్రాయపడ్డారు. ఈనాడు ఆతడు సత్యాన్ని కనుక్కొన్నానని చెప్పడం విని ఆశ్చర్యపడ్డారు. ఆతడు చెప్పినది నమ్మక వారు "ఓయీ గౌతముడా, మేమునీకు సపర్యలు చేయుచుండిన సమయంలో, మన దేశంలో ఎన్నడూ ఇదివరలో చెయ్యని ఘోరతపస్సు ఆచరించావు. అదిచూచి మేము నీ శిష్యులమైనాము. నీవు కనుక్కొనలసిన సత్యాన్ని ఆ కఠినతపస్సుచేసిన కాలంలోనే కనుక్కోలేకపోతివి. ఈనాడు, తపస్సుమాని, సుఖజీవనం సర్వభోగాలతో చేస్తూ, నీవు సత్యాన్ని కనుక్కోవడం ఏలాగు సాధ్యమవుతుందని" అడిగారు.

బుద్ధుడు "ఓ సన్యాసులారా! మీరు పొరపాటు పడుచున్నారు. నే నేప్రయత్నాన్నీ విడిచిపెట్టలేదు. నేను భోగలాలసుడనై, సుఖజీవనాన్ని గడపడంలేదు. నేనుచెప్పేదివినండి. పరమార్థాన్ని తెలుసుకొన్నాను; దివ్యజ్ఞానాన్ని పొందాను. మీకది బోధిస్తాను; అది తెలుసుకొని మీరుసైతము ఆ స్థితికి చేరవచ్చును" అని సమాధానము చెప్పెను.

బుద్ధుడెంత చెప్పినను వారు నమ్మరైరి. అట్టి జ్ఞాన ప్రాప్తి అసంభవమనే వారినమ్మకము. వారి అపనమ్మకాన్ని చూచి, బుద్ధుడు, "ఓయీ సన్యాసులారా! మీరు నాతో ఉండినప్పుడెప్పుడైనా, మీతో పై జెప్పిన విధాన నేను ముచ్చటించితినా? పరమార్థాన్ని తెలుసుకొన్నాననిగాని, జన్మ మరణములను అధిగమింపజేసే మార్గాన్ని కనుగొన్నాననిగాని, నేనిదివరలో మీతో ఎప్పుడైనా అంటినా?" అని వారిని ప్రశ్నించెను.

సన్యాసులు: "మీ రిదివరలో ఎన్నడునూ ఆలాగున అనలేదు."

బుద్ధుడు: "ఐతే, నేను అమృతత్వానికి మార్గాన్ని కనుగొన్నానని చెప్పినదాన్ని శ్రద్ధతో వినండి. నేను కనుకొన్నదాన్ని మీకు బోధిస్తాను; తెలుసుకోండి!"

చిత్తాకర్షణ చేసేటట్టుచూస్తూ, హృదయంగమంగా బుద్ధుడు ఆడిన వచనాలను వినినంతనే ఆతడు చేయబోయిన ప్రబోధాన్ని శ్రద్ధగా వారు వినక తప్పిందికాదు. పూర్వ గురువును తమతో వుండిపోయి తమకు బోధచేయమని వారాతనిని వేడిరి. అక్కడవుండి కొన్నిమాసాలపాటు, బుద్ధుడు ప్రతి దినమూ వారికి, తానన్వేషించి కనుగొన్న తత్త్వాన్ని బోధించాడు. అయిదుగురులో ముగ్గురు భిక్షనెత్తడానికి పోయిన వెనుక, మిగతా ఇద్దరికీ బోధచేస్తూండేవాడు. వారొచ్చిన పిదప ఈ ఇద్దరూ బిచ్చమెత్తడానికిపోగా, మొదటి ముగ్గురికీ బోధచేస్తుండేవాడు. వీరు అయిదుగురు తెచ్చిన తిరిపాన్ని,

ఆకుగుకూరావంచుకొని తింటుండేవారు. ఈలాగు అతి నిర్మలంగా, ప్రశాంతంగా బుద్ధుడు బోధచేస్తూఉండగా, వాని బోధనువిని ఆ అయిదుగురు శిష్యులు దానిని ఆచరిస్తూ, బుద్ధప్రబోధిత సత్యాన్ని తెలుసుకొని, ఈ జన్మలోనే నిర్వాణమును పొంద వచ్చునని గ్రహించారు.

ఈ అయిదుగురులోను మొట్టమొదట ఈ సత్యాన్ని గ్రహించగలిగినవాడు కౌండన్న. మిగతా నలుగురు భద్దకుడు, అస్సజి, వప్ప, మహానాముడు. ఈ అయిదుగురు మొదటి అర్హనులు. 'అర్హనుడు' అంటే ఈ జన్మలోనే, పుట్టుక చావులు లేని నిర్వాణ స్థితిని జెందినవాడు; జీవన్ముక్తుడు. ఈ అయిదుగురు అర్హనులూ బుద్ధుని తమ పరమాచార్యునిగ ననుసరించి, బౌద్ధ సంఘముతో మొదటివారైనారు.

ఇసి పట్టణంవద్ద వున్న లేళ్ళవనంలో వసియించుచుండి నపుడు, ఆ దరి నివసించుచుండిన ఒక ధనికుని కుమారుడు బుద్ధుని దర్శించాడు, ఆ యువకుని పేరు యశుడు. బుద్ధుడు తన మతాన్ని ప్రబోధం చేస్తుండగావిని, ఆ మతంలోని అమూల్య విషయాలను గ్రహించి, సంపూర్ణంగా ఆకర్షింపబడి, అక్కడనే భిక్కువు అయి ఉండిపోయెను.

ఆ నాటిసాయంకాలం కాలం గడిపిన ఒక వ్యక్తి బుద్ధుని సందర్శించి, తన కుమారుడు బుద్ధుని దర్శనముచేసి వస్తానని చెప్పి ఉదయము బయలుదేరి తిరిగి యింటికి రాలేదనియు, పుత్రుడు యింటికి రానందువల్ల అతను దొంగలపాలైనాడేమో అని తల్లి దుఃఖించుచున్నదనియూ, చెప్పుకొన్నాడు, అది విని

బుద్ధుడు "ఆ యువకుడు భిక్షువైనాడ"ని తెలిపి, ఆ వయసు మళ్ళిన వ్యక్తికి తన సిద్ధాంతాన్ని బోధపరిచాడు. ఆ ధనికుడు బుద్ధుని నూత్న తత్త్వాన్ని విని తననుకూడ భిక్షువుగ అంగీక రింపమని వేడుకొన్నాడు. అందుకు బుద్ధుడు అంగీకరించగా, కొడుకువలె తానుకూడ భిక్షువై ఆ ధనికుడు తన యింటికి మరి పోక, అక్కడనే వుండిపోయినాడు.

మరునాడు బుద్ధుడు తన కొత్త శిష్యునితో ఆ ధనికుని యింటికి తిరిపెమునకు పోగా, ఆ ధనికుని భార్యజరిగినదంతయు తెలిసికొనెను. తన కుమారుడును తన భర్తయును భిక్షులుగ మారినారనివిని, బుద్ధుని వలన ధర్మమార్గమును అవగతము చేసి కొని తానును ఆయనకు శిష్యురాలయ్యెను. అటు తరువాత యువక భిక్షుని మిత్రులు నలుగురు, జరిగిన ఉదంతాన్ని తెలిసికొని, భిక్షువులై, బుద్ధ సంఘాన్ని చేరిరి. ఈలాగు దిన దినము యువకులు భిక్షువులై బుద్ధసంఘాన్ని చేరుచుండిరి. కొద్దికాలంలోనే ఆఇషిపట్టణంలోని మంచి ధనిక కుటుంబాలలో పుట్టినవారు, తరుణ వయస్కులు, బౌద్ధ సంఘాన్ని చేరిరి. బౌద్ధ సంఘంలో చేరినవారిసంఖ్య అరువది అయ్యెను. వారందరునూ కడు శ్రద్ధాభక్తులతో బౌద్ధ ధర్మాన్ని తెలుసుకొని, అత్యు త్సాహంతో ఆ ధర్మమును ఆచరిస్తూ అచిరకాలంలోనే అర్హన స్థానం చేరిరి.

"ఓ భిక్షువులారా! నా సిద్ధాంతాన్ని తెలుసు కొన్నారు. అది ఆది మధ్యాంతములందు బహుప్రశస్తమైనది అతి పవిత్రమైన జీవితాన్ని ఏలాగున గడపడమో తెలుసు

కొన్నారు. ప్రపంచంలో కామధూళిచే అంధులు కానివారున్నారు. వారికి నా సిద్ధాంతాలు తెలియకపోతే, నశిస్తారు. కాబట్టి మీరు ప్రపంచంలో నా సిద్ధాంతాన్ని ప్రచారం చేసినట్లయితే వారు అది విని, బోధపరుచుకొని తరిస్తారు" అని బుద్ధుడు వారితో చెప్పి దేశంలోనికి ప్రచారానికై పంపివేసెను. వారలను జంటలుగాగాని, ముగ్గురునలుగురు గుంపులలో ఒక్కవైపునకేగాక, ఒక్కొక్కని అన్ని దిక్కులకు, ఆ అరువదిమందిశిష్యులను పంపెను. నలుదిక్కులకు, బుద్ధశాసనమును శిరసావహించి, వారు ఒంటరిగపోయి, బౌద్ధధర్మాన్ని, బుద్ధాను శాసనాన్ని ప్రచారంచేసి, వ్యాపింపచేసిరి. వారు దేశదేశాలకు పోయి బౌద్ధ మతధర్మాన్ని ప్రబోధించిరి. భువిలో మత ప్రచారకులలో మొదటివారు వీరే. ఈ బౌద్ధమత ప్రాథమిక ప్రచారకులు బహు ధైర్యశాలురని వేరే చెప్పనవసరంలేదు.

ఆ భిక్కులలో నొకడు, బుద్ధుని చేరి తనను, అతి క్రోధంగల ఉగ్ర స్వభావంగల ప్రజలుండిన ఒక దేశానికి పంపమని ప్రార్థించాడు.

బుద్ధుడు : ఓ భిక్కూ! ఆ దేశపు ప్రజలు నిన్ను తిట్టి నీగురించి దుష్ట సంభాషణను చేస్తే, నీవేమి చేయుదువు?

భిక్కు : ఈ ప్రజలు మహామంచివాళ్లు. వాళ్లు నన్ను తిట్టడం తప్ప, చేతులతో గుద్దడంలేదని తలంచి సంతోషిస్తాను.

బు : ఓ భిక్కూ నిన్ను వారు కొడితే నీవేమిచేస్తావు?

భి : ఈ ప్రజలు మహా మంచివాళ్ళు. నన్ను వారు కర్రతో మోదలేదని సంతోషిస్తాను.

బు : నిన్ను కర్రతో కొడితే అప్పుడో ?

భి : ఈ ప్రజలు మంచివాళ్లు, నన్ను కత్తులతో నరకలేదని సంతోషిస్తాను.

బు : నిన్ను కత్తులతో నరుకుతేనో ?

భి : నన్ను చంపలేదు, ఈ ప్రజలు మహామంచివాళ్ళని సంతోషిస్తాను.

బు : నిన్ను వాళ్ళు చంపితేనో ?

భి : ఓ దేవా ! ఈ ప్రజలు నాకు మహోపకారం చేస్తున్నారని సంతోషిస్తాను. ఈ నా దేహం పాపభూయిష్ఠమైనది. దాన్ని పోగొట్టుకోడానికి నేను సంతోషిస్తాను. ఈ మంచి ప్రజలు నాకా ఉపకారం చేస్తుంటారు.

బు : "ఓ భిక్షూ, నీవా ప్రజలలోకి పోయి నా మతాన్ని వారిలో ప్రచారం చెయ్యి. ప్రపంచంలో అన్ని దేశాల్లోను, అందరి ప్రజల్లోను నా మతాన్ని ప్రచారం చెయ్యడానికి నీ వంటి భిక్షువులు తగినవాళ్లు !

# 9

ఇదివరలో చెప్పిన తపుస్స, భల్లికులనే వర్తకులు బుద్ధుని శిష్యులమని చెప్పుకొన్నవారిలో ప్రథములు. వారు పోయి పోయి, కపిలవస్తు చేరి, అచట ప్రజలతో ఆ నగర పరిపాలకుని కుమారుడైన సిద్ధార్థుని దర్శించితిమనియు, ఆతడు

ప్రబుద్ధుడై, జ్యోతిషం చెప్పినట్లు గొప్పమత ప్రవర్తకుడైనా
డనియు, కొద్దికాలంలోనే కపిలవస్తును అతడు చేరునని యు
చెప్పిరి.

అరువదిమంది శిష్యులను దేశదేశాలకు పంపినతరువాత,
ఇసిపట్టణం వద్దనున్న లేళ్ళవనమును విడిచి, దక్షిణముఖుడై
బుద్ధుడు ఉరువేలవనమును చేరెను. అక్కడ కస్సపుడనే
ముఖ్యునికింద సాధనం చేస్తున్న కొంతమంది మునులను కలిసి
కొని వారితో సంభాషణలను, చర్చలను గావించుచుండెను.
బుద్ధుని వలన బౌద్ధధర్మాన్ని తెలిసికొని కస్సపుడు తనను బౌద్ధ
సంఘంలో భిక్కువునిగా చేపటకు అనుజ్ఞనివ్వమని వేడు
కొన్నాడు. తరువాత బుద్ధుని బోధలను అవగాహన చేసుకొని,
కస్సపుడు వాటిని ధ్యానం చేసుకుంటూ, ఆచరిస్తూ అర్హను
డయ్యెను. బుద్ధుడు నిర్యాణం చెందినపిదప, ఈ మహాను
భావుడు అర్హనులలో ముఖ్యుడై, బుద్ధధర్మాన్ని తొలి పవి
త్రతతో, నిష్కళంకముగా వుంచెను.

దేశంలో మెల్లగా సంచారంచేస్తూ బుద్ధుడు ఇదివరలో
బింబిసార మహారాజునకిచ్చిన మాట ప్రకారం, మగధరాజ్యా
నికి రాజధానియైన రాజగృహమును చేరుకొనెను. బింబిసారు
డును, వాని ప్రజలుకూడా, గౌతముడు బుద్ధుడైనాడని
తెలిసికొని అతనిని అతిగౌరవంతో, అత్యంతానందంతో
సమ్మానించారు. ఊరునకు కొంచెందూరంలో ఉండిన ఒక
వేణువనంలో బుద్ధుడు కొంతకాలం గడిపాడు. అతికృపాళుడై,
సానునయంతో తన మతాన్ని ప్రబోధంచేయగా, రాజూ,
ప్రజలూ వాని సిద్ధాంతాన్ని అంగీకరించి, వాని శిష్యులైనారు.

బుద్ధునియందు, ధర్మమునందు, సంఘమునందు తనకుండిన గౌరవాన్ని భక్తిని సూచిస్తూ, ఆ వేణువనంలో వర్షఋతువులో బుద్ధుడును, బుద్ధసంఘమున్నూ సుఖంగా గడపడానికై ఒక ప్రశస్తమైన విహారాన్ని నిర్మించి, ఆయనకు దానిని వనముతో కూడ దానముచేసెను.

ఒకనాటి ఉదయం బుద్ధుడు వేణువనం విడిచి రాజగృహమునకు, భిక్షకై పోవుచుండగా, త్రోవలో అప్పుడే స్నానం చేసి తుడుచుకోకుండా ఉన్నట్లుండిన ఒకయువకుడు నాల్గు దిక్కులకును ఆకాశమునకును భూమికినీ నమస్కరిస్తూ అన్నమును దిక్కులకు విసరడం ఆయన చూచాడు. చూచి రాజబాటలో అట్లు వింతను ఆచరించుచున్న ఆ యువకునిచేరి అతడటులచేయుటకు కారణమేమిటని ప్రశ్నించెను.

బుద్ధుని ప్రశ్నవిని అతను తన ముసలితండ్రి ఆలాగున చేయమన్నాడనీ, చచ్చిపోతూ తన తండ్రి కోరిన కోరికను తప్పక ప్రతిఉదయము తాను చెల్లిస్తున్నానని జవాబిచ్చెను. నాలుగుదిక్కులనుండిగాని, ఆకాశంలోని దేవతల వల్లగాని పాతాళ లోకపు పిశాచాలవల్లగాని ఎట్టి హానీ కలగకుండా తనను ఆ విధముగా తన తండ్రి ప్రతి ఉదయము ఆచరించమని కోరినాడని తెలియచేశాడు, ఆ యువకుని సమాధానమును విని బుద్ధుడు యిలాగున పలికాడు. "నీ తండ్రి మరణించుచున్నపుడు నీవు ఆయనకిచ్చిన వాగ్దానమును తప్పక పాటించడం బహు ఉచితం. కాని నీ తండ్రి కోరినది వేరు; నీవు చేస్తున్నది వేరు; అది ఇది కాదు. తూర్పు దిక్కునకు అన్నబలి యివ్వ

మనడంలో నీ జన్మకారకులైన తల్లి దండ్రుల పట్ల గౌరవ భక్తులు కలిగివుండమని నీ తండ్రి భావం. నీ జ్ఞానమునకు కారకులైన గురువులకు గౌరవభక్తులు చూపించమని, దక్షిణ దిశకు అన్న బలి యివ్వమనెను. పశ్చిమమునకు అన్నబలి యివ్వడమంటే భార్యను, పిల్లలను పోషించమని. ఉత్తరమునకు బలి యివ్వమనడంలో బంధుమిత్రులను గౌరవిస్తూ అవసరమైన సాయం చేస్తూ వుండమని నీ తండ్రి నిర్దేశం. ఆకాశాన్ని పూజించమనడంలో పరమపవిత్రమైన పరమోత్కృష్టమైన దాన్ని భక్తితో కొలవమని అతని మాటలకు అర్థం. భూమిని పూజించమనడంలో, భూమిపై జీవించే ప్రతిదానిని అది ఎంత అల్పమైనదే అయినా, కాపాడమని నీ నాయన తాత్పర్యం. ఏ దిక్కునుండైనా నీకు హాని ఎన్నడూ కలుగకుండా వుండేటట్టు నిన్ను ఆచరించమనడంలో నీ జనకుని భావమిది."

ఆ యువకుని పేరు సిగలుడు. బుద్ధుడు అతనికి ధర్మోపదేశము చేసి దొంగతనము వ్యభిచారము కూడదని చెప్పాడు. అనృతమాడకుండా మత్తుపదార్థములను సేవించకుండా, ఎవరినీ చంపకుండా, ఉండమన్నాడు. దుష్ట సహవాసం మానుకొని మెలగవలెనని అన్నాడు. సత్పురుషుల స్నేహం చేస్తూ, కష్టపడి ధనమార్జిస్తూ, ఆర్జించిన విత్తాన్ని కాపాడుకుంటూ, పిసినిగొట్టువలె డబ్బునుపట్టుకొని దేవులించక, నిరర్థకమైన తుచ్ఛమైన వాటికై డబ్బుదుబారా చేయక, ఆర్జించిన దానిలో నాల్గవవంతు తన కుటుంబ పోషణమునకై వెచ్చించుచు, ఇంకో నాల్గవ భాగమును తన వ్యాపారాన్ని అభివృద్ధి చెయ్యడానికై వినియోగించుచు, సాయం పొందదగినవాళ్ళకై ఇంకో నాల్గవ

వంతును ఖర్చు పెట్టుచు, మిగతా నాల్గవ భాగాన్ని తనకు దురదృష్టము సంభవించినపుడు ఆత్మరక్షణకై వినియోగించ డానికి నిలువజేసుకొని యుండమన్నాడు. ఈ విధాన ఆచరిస్తే ఇహాముననే సుఖంగా జీవనము గడపడమేకాక, పరంలోకూడా అంత సుఖంగాను అదృష్టవంతంగాను ఉండ వచ్చునని బోధించాడు.

అతి భక్తితో సిగలుడు బుద్ధుని ఉపదేశాన్నివిని, తన జనకుడు జీవించియుండినపుడు తనతో బుద్ధుని మాహాత్మ్యము గూర్చి చెప్పి "పోయి వానిని దర్శించి అతని ఉపదేశాన్ని తెలిసి కోమ" ని అనేక పర్యాయములు చెప్పెననియు, కాని అట్టిది బహువ్యయ ప్రయాసలతో కూడుకొని యున్నదనియు, దేశద్రిమ్మరులైన గోతమునివంటి బైరాగులకై వెచ్చించడానికి ధనంకాని, అవకాశంగాని లేదని తాను భావించి జనకుని ఉప దేశాన్ని నిరాకరించితిననియు, అందుకు తనను క్షమింపవలసిన దనియు ప్రార్థించాడు. క్షమిస్తూ తనను శిష్యునిగ గైకొనమని వేడెను. బుద్ధుని ఉపదేశానుసారం, నాల్గుదిక్కులను భూమ్యా కాశములను పూజించెదనని ప్రమాణంచేశాడు.

ఆనాడు రాజగహామునకు సమీపంలో సంజయుడనే విఖ్యాతిగాంచిన ఆచార్యుడుండేవాడు. రెండువందలమంది యువకులాతని శిష్యులై శుశ్రూష చేయుచుండెను. వీరిలో ఇద్దరు మిత్రులు, గురువు ఉపదేశంతో తృప్తిజెందక ఉండెను. వారు ఉపతిస్స. కోవితులు. గురువు చెప్పినదానితో వారు తృప్తిచెందక, అమృతత్వ స్థితినిగురించి తెలిసికొన దలచి

యుండిరి. వారిరువురిలో ఎవరు తెచ్చిన దానినైనను ఇరువు రునూ పంచుకొని అనుభవించేటట్టి దిట్టమైన స్నేహం వారిది. "అమృతత్వాం" గురించి అతి శ్రద్ధతో, దీక్షతో, యావద్బుద్ధి బలాన్ని మనోబలాన్ని వినియోగించి యోచించి ధ్యానించ డానికిన్నీ, అట్టి జ్ఞానాన్ని తొలుత సంపాదించినవాడా రెండవ వానికి యెరుక పరచడానికిన్నీ ప్రతిజ్ఞ ఇద్దరూ బూనియుండిరి.

ఒకనాడు ఉపతిస్సుడు, రాజగహం రాజకోటలో వుండగా, కొంతదూరంలో ఒక సన్యాసి అతనికి కనుపించాడు. ఆ సన్యాసి ఇంటింటికి పోయి బిచ్చము ఎత్తుకుంటున్నాడు. ఆ అజ్ఞాత సన్యాసి అతనికి అద్భుతవ్యక్తివలె స్ఫురించాడు. అతని వినయ సంపద ఉపతిస్సునకు ఆశ్చర్యాన్ని కలిగించింది. గృహ స్థులు, తమ యిండ్లలోనుండి తెచ్చివేయుచున్న భిక్షను స్వీక రించి, వాకిట అతి ప్రశాంతముగా నిలుచుండి, భిక్షానంతరము అతి ధీమాగా ఆ సన్యాసి నడిచివస్తున్నాడు. ఆ సన్యాసి దగ్గర వడేసరికి ఉపతిస్సునకు ఆశ్చర్యముతోపాటు పూజాభావం కలిగి భక్తి భావం పెరిగిపోయింది. ఇదివరకు ఏ సన్యాసిలోనూ కాన్పించని సంపూర్ణ ప్రశాంతత ఆ అజ్ఞాత సన్న్యాసి వదన ములో నిండారిఉన్నది. గాలి లేనప్పుడు నిశ్చలముగా వుండే సరోవరంవలె అతని మోము నిర్మలముగా భాసిస్తున్నది. అతని వదనమును గంభీరతాముద్రను చూసి ఉపతిస్సుడు అచ్చెరు వొంది "ఈయుని ఎవ్వడు? నేను యిన్నాళ్ళూ దేన్ని తెలియ గోరి తపస్సు చేస్తున్నానో దానిని యితను తెలుసుకొనైనా వుండాలి. లేదా అట్టి జ్ఞానంగల అచార్యుని శిష్యుడయేనా, వుండాలి. లేకపోతే, ఈతని మోములో యిట్టితేజస్సు ఎక్క—

డిది? అయితే అతని ఆచార్యుడెవరోకదా? సరే, అడిగి తెలుసు కుంటాను?" అని నిశ్చయించుకొనెను.

కాని అపరిచితుడగు భిక్షుకుని, బిచ్చమెత్తుతుండగా ప్రశ్నల నడుగుట అనుచితమని నెరింగి, అతను గృహములలో తిరుగుచు తిరిపెమెత్తుకొనుచుండినంతసేపును వాని వెనుక కొంత దూరములో నడచుచు, పట్టణద్వారముదాటిపోవుచుండగా వానినిచేరి, సవినయంగా నమస్కరించి, "తమ రాశ పోకలు, ఓ మునివర్యా బహుప్రశాంతంగావున్నవి. తమ ముఖవర్చస్సు, తమ తేజస్సు, తమ ముఖవికాసము ప్రశస్తంగా వున్నవి. ఏ సద్గురువును అనుసరించుటకై, సంసారమును, బంధుమిత్రాదులను విడిచిరో, అతనిని నామధేయమును తెలుపుడు, అతని సిద్ధాంతాన్ని తెలియజెప్పుడు" అని అతనిని వేడెను. ఆ సన్యాసి అది విని, చల్లగనవ్వుచు, "ఓ సోదరా, అది కొద్ది మాటల్లో చెప్పగలను. శాక్యవంశస్థుడైన ఒకగొప్ప పరివ్రాజకుడు, సన్యాసిగా జీవించడానికి, సంసారాన్ని, దేశాన్నికూడా విడిచాడు. అతని ననుసరించడానికి, నేను సంసారాన్ని విడిచిపుచ్చాను. ఆ పూజ్యుడే నా గురువు. ఆతని బోధనే, నే ననుసరించి ఆచరించుదును" అని పల్కెను.

ఉపతిస్సుడు: "ఓ పూజ్యుడా, ఆ సిద్ధాంతమేమిటి? మీ గురువు బోధించునదేద్ది? అది తెలుసుకోడానికి నాకూ కుతూహలంగాఉంది" అనుచు తాను తనమిత్రుడు కోవితుడు "అమృతత్వం" గుర్చించి తెలుసుకోడానికి ఆతృతపడుచున్న విషయాన్ని ఈతని నోటంట ఎప్పుడు వినబడునో అని ఆశపడుచుండెను.

సన్న్యాసి : బుద్ధ భగవానుని సంఘంలో నేను కొత్తగ చేరితిని. ఆ భగవానుని పాదములను ఆశ్రయించి, నేను జ్ఞానాన్ని సంపాదించడం మొన్ననే ప్రారంభించితిని. ఆతని ప్రబోధాన్ననుసరించి ఆచరించడం మొన్నటినుంచే కాబట్టి ఆతని సిద్ధాంతం నాకు లెస్సగా తెలీదు. అందుచేత ప్రతి విషయాన్ని నేను విప్పిచెప్పలేను. కాని ఆతని సిద్ధాంతంయొక్క సారాంశంమాత్రం నీవు తెలుసుకోదలచినావు కనుక దానిని కొద్దిమాటలలో నీకు తెలియజెప్పగలను !

ఉపతిస్సుడు : నేను కోరునదిఅంతే, సోదరా ! ఆ సారాంశాన్ని చెప్పుము. నాకు కావలసినది సారాంశము మాత్రమే. పెక్కుమాటలతో దాన్ని చెప్పడమెందుకు ?

"అయితే, విను ! ప్రపంచములోనుండునదంతయు ఏ కారణమువల్ల గల్గునో బుద్ధభగవానుడు తెలియపర్చాడు. అవి తిరిగి ఏలాగు అంతరించునో ఆ పరమసన్న్యాసి బోధించుచున్నాడు" అని చెప్పి ఆ సన్న్యాసి ఊరుకొనెను. అదివిన్నంత మాత్రాన, పురద్వారముకడ నిలుచునియుండిన ఉపతిస్సుని హృదయంలో ఒకవిధమగు చైతన్యం మెరుపుతీగవలె మెరిసెను; ఎన్నడైనను జన్మముకాంచినదీ ఇకముందు ఎప్పుడైనను జన్మము కాంచునదీ, ప్రతిదినీ అడ్డులేక, అంతరంలేక నశించవలసినదే అన్న బుద్ధప్రబోధితతత్త్వం, ఒక్కమాటు అతనిలో ప్రజ్వరిల్లింది. ఈ మహాజ్ఞానం ఉత్పన్నముకాగానే, "ఓతపస్వీ ! ఈ సిద్ధాంతాన్ని నీ గురువువల్ల తెలుసుకొన్నచో, దుఃఖం, నాశనంలేనిస్థితులను, దుఃఖవిరామస్థితిని, అమృతత్వాన్ని తెలిసి

కొంటివన్నమాట. ఈ సత్యం యుగయుగాల్లో నరునికి తెలియు లేదు" అని ఆనందమయుడై తనకు జ్ఞానోదయం కావించినం దులకు ఆ సన్యాసికి కృతజ్ఞతను తెలియపరిచి, మిత్రుడైన కోవి తునకు "అమృతత్వాన్ని" కనుగొంటినని చెప్పటకు, చప్పా చప్పునపోయెను.

కోవితుడు దూరంగానుండగానే ఉపతిస్సుని ముఖ వికా సాన్ని కని, అంతమార్పు ఎందుకాతనిలోవచ్చిందా అని ఆశ్చర్యపడుచూ "ఓ సోదరా, నీముఖమెంత నిర్మలముగాను, ప్రకాశమానంగాను ఉన్నది. మన మిరువురము చాలాకాలం నుండి అన్వేషించుచుండిన 'అమృతత్వా'ని కనుగొనినావా యేమిటి ?" అని ప్రశ్నించెను.

ఉపతిస్సుడు : ఔను, ఓ సోదరా, ఔను అమృత తత్వాన్ని కనుగొంటిని."

కోవితుడు : "ఏలాగు, ఓ సోదరా. ఏలాగు?

ఉపతిస్సుడు తాను రాజగృహావీథులలో తిరుపమెత్తు కొనుచుండ ఒక సన్యాసిని కాంచుటయు వాని ననుసరించి పుర ద్వారముకడకుపోయి వాని అసామాన్య ప్రశాంతతకు కారణ మును తెలియజెప్పుమని కోరుటయు మొదలుగాగల వృత్తాం తము తెలియచేసి అప్పుడు ఆ సన్యాసి పలికిన అన్ని వచనము లనూ కోవితునకు చెప్పెను. ఆ వచనములనువినగానే కోవితు నకు వివేకోదయమయ్యెను. రూపశబ్దత్వగ్ఘ్రాణ జిహ్వాభావ ప్రపంచములో పుట్టినదే నాశరహితమైనదనియు, అది జన్మ కాంచలేదుకావున, మరణములేనిదనియు బోధించు ఒకవిధముగు

జ్ఞానము అతని మనస్సులో విద్యుల్లతవలె తళుక్కుమని ప్రకాశించినది.

ఈ ఇద్దరు మిత్రులూ, సంజయుని విడిచిపెట్టి బుద్ధుని వద్ద కరిగి, శిష్యులుగ గ్రహించి తమకు జ్ఞానాన్ని అనుగ్రహించమని ప్రార్థించారు. భిక్షు సంఘంలోకి బుద్ధుడు వారిని చేర్చుకొనెను. వీరిరువురును అచిరకాలములోనే పాండిత్యానికి, అనుచరణకు బుద్ధ శిష్యులలో అగ్రస్థానాన్ని అలంకరించిరి. వీరిరువురును ధీరులై తరువాత ప్రపంచంలో సారీపుత్త, మొగ్గాలన అనునామములతో విఖ్యాతిగాంచిరి. ఉపతిస్సునకు మొదట ఈ సిద్ధాంతాన్ని నాల్గు మాటలలో చెప్పిన భిక్షువు, అస్సజి అనువాడు. అందుకై ఈ వచనానికి "అస్సజివచనం" అని పేరు వచ్చింది.

బుద్ధుడు రాజగహమందున్నపుడు, ఒక్క ఉపతిస్స, కోవితులేకాక, మగధలో గొప్పకుటుంబాలలోని అనేకమంది యువకులు, తల్లిదండ్రులను, బంధుగణాలను, సంసారాలను పరిత్యజించి, శాక్యపుంగవుని శిష్యులై భిక్షువులై బౌద్ధ సంఘాల్లో చేరిరి. ఇటుల భిక్షువులగుచుండిన యువకుల సంఖ్య రోజురోజుకీ పెరిగిపోవుచుండగా, అనేకమంది భయపడి, కొంత మంది కోపం తెచ్చుకొని, బుద్ధునికడకు పోయి, అప్పటివలె మరికొంతకాలం యువకులు భిక్షువులగుచుండిన సంసారాలు చెయ్యడానికి మరియువకులే వుండరని మొరపెట్టుకొనిరి. ఇక సంసారాలే నశించిపోయి భార్యలుగాని పిల్లలుగాని ఉండర

నియు, దేశమంతా మహాటవిలాగ సర్వశూన్యమగుననియ ఘోష పెట్టిరి.

బుద్ధుడు వారి మొరఆలకించి, అప్పటినుండి తల్లి తండ్రుల అనుమతికాని, తల్లిదండ్రులు లేకపోయినచో, దగ్గిర జ్ఞాతుల అనుమతిగాని లేనిదే యే యువకుడును బౌద్ధ సంఘములో చేరడానికి వీలులేదని శాసించెను. ఈ కొత్త హుకుమును మగధదేశవాసులు తెలుసుకొని. సంతోషించి, బుద్ధుని వాని భిక్కువులను గౌరవించుచు తమకున్నదానిలో అతి శ్రేష్ఠమైన దానిని వారికిచ్చి సత్కరించుచుండిరి. ఈ నూతన నియమమే సంఘం కట్టుబాట్లు తెలియపరిచే "వినయ గ్రంథం"లో మొదటి సూత్రం.

# 10

సుద్ధోదనరాజు, వృద్ధుడయ్యాడు. ఏనాడో ఇల్లు విడిచి, భావిరాజ్య పరిపాలనాధికారాలను త్యజించి, భాగ్య భోగాలను విడనాడి సన్యసించి, దేశంమీాద వెళ్ళిపోయిన తన కుమారుని తాను మరణించేముందొక్కపర్యాయము కనులార చూడాలని ఆ రాజు అత్యంతకుతూహల పడుచుండెను. కాని కుమారుని ఉనికి తెలియక ఊరుకొనెను. ఇంతలో అతడు రాజ గృహమువద్ద ఉన్నాడని సుద్ధోదనుడు తెలిసికొని, తన కంటికగుపించుట కొక్క పర్యాయము రావలసినదని కొడుకుకు కబురుపెట్టెను. బుద్ధుడు ప్రజలకు ధర్మోపదేశము చేయుచున్న

సమయములలో రాజుపంపిన వార్తాహరుడచటకు చేరెను. ఆతడును అచటి ప్రజలలో కలిసి బుద్ధుడు ఉపదేశించుచుండగా వినుచు కూర్చొని యుండెను. బుద్ధుని ఉపన్యాసమును వినుచు, తన్మయత్వమును జెంది, తెచ్చిన సందేశాన్ని బుద్ధున కెరింగింప మరచిపోయి, తిరిగి తిరిగి బుద్ధుని ఉపన్యాసములను వినుచు, ఇంటికి పోవమరచిపోయి, అచటనేఉండిపోయెను.

వార్తాహరుని రాక కెదురుచూచుచు కొంతకాలము సుద్ధోదనుడు పుత్రుని జవాబునకై ఆతురతపడుచుండెను. వార్తాహరుడు కాని, పుత్రుని జవాబుగాని ఎప్పటికీ రానందున మొదట పంపిన వార్తాహరుడేమైనాడో, పుత్రుని జబాబేమిటో తెలిసికొనుటకింకొక వార్తాహరుని పంపెను. ఈ రెండవవాడు కూడ, రాజగృహమువద్ద బుద్ధునిచూచి వాని ధర్మోపదేశము లనువిని, ఇంటిని సంసారమును, రాజును, వాని సందేశాన్ని మరిచి, బుద్ధుని సిద్ధాంతాన్ని అంగీకరించి అక్కడనే వుండి పోయెను. ఈ లాగుననే మొదటిఇద్దరు వార్తాహరులు ఏమ యిరో, బుద్ధుని జబాబు ఏమయియుండునో తెలిసికొనుటకు ఆరుగురు వార్తాహరులను ఒకనివెనుక ఇంకొకనిని పంపెను; గాని వారందరు బుద్ధుని శిష్యులై తిరిగిరాక అచటనే వుండి పోయిరి.

సుద్ధోదనుడీ వార్తాహరుల విపరీతచర్యను బోధపరుచుకో లేక, కోడలు యశోధరను, భర్తకు సందేశమంపి రప్పింపగలు గునేమో చూడమని కోరెను. ఏడేండ్లువచ్చి చకచకలాడు చున్న తన పుత్రుడు రాహులుని చూచుటకు ఒక్కపర్యా

యము కపిలవస్తు నగరమునకు దయచేయుమని ప్రార్థించుచు ఆమెయు ఒక సందేశమును బుద్ధునకు పంపెను. కాని సుద్ధోదనుని వార్తాహారులవలెనే ఆతడును బుద్ధోపదేశలగ్నమనస్కుడై, బుద్ధుని శిష్యుడై అతనితోనే వుండిపోయెను. ఈ విధాన, యశోధర పంపిన ఇతరవార్తాహరులుకూడ, బుద్ధధర్మోపదేశాన్ని విని వానితోనే వుండిపోయి, తిరిగి ఇండ్లకు రారైరి. మరిచేయునదేమీలేక యశోధర ఊరుకొనెను.

ఇంతలో 'ఉదయి' అనునాతడు సిద్ధార్థునకు బాల్యస్నేహితుడనియు, ఇద్దరునూ ప్రాణమిత్రులనియు సుద్ధోదనునకు జ్ఞాపకమునకువచ్చెను. ఇట్టి ప్రియమైన బాల్యస్నేహితుడు బహుశః ముదుసలితండ్రి దీన సందేశాన్ని బుద్ధునకందించి, ఒక్కపర్యాయము తన రాజధానికి వచ్చేటట్లు చేయగలడని రాజు యోచించెను. ఇదివరలో పంపిన వార్తాహారులకేమయ్యెనోమాత్రము, సుద్ధోదనుడుకాని యశోధరగాని తెలిసికొనలేకపోయిరి. ఉదయి, రాజగృహముచేరి, సుద్ధోదన యశోధరుల వార్తాహారులకేమయ్యెనో తెలిసికొనెను. అందుకై బుద్ధుడు ధర్మోపదేశముకావించుచున్నంత కాలము ఉదయి, అతని ఉపదేశము చెవులపడకుండ వానిని గట్టిగమూసుకొని వుండి, ఉపన్యాసము ముగియగానే, బుద్ధుని యెదుటపడి, అతి భక్తితో వానికి నమస్కరించి, తండ్రియు, భార్యయు, ప్రజలునూ, బుద్ధుని దర్శింప కుతూహలపడుచున్నారని తెలియపరిచి, కరుణచూపి ఒక్కపర్యాయము కపిలవస్తునకు విచ్చేయుమని ప్రార్థించెను. బుద్ధుడు తనవారి కోరికను అచిరకాలములో

తీవ్ర ఉన్మత్తుడై వున్నాడని 'ఉదయి' తెలిసికొని, తొందరగా ఇంటికిపోయి ఇదివరలో రాజకుమారుడైయుండిన సిద్ధార్థుడే జగద్విఖ్యాత ధర్మప్రవర్తకుడైన బుద్ధుడైనాడనియు, కొద్ది కాలములోనే అతను కపిలవస్తు నగరానికి తిరిగి రానున్నాడనియు, సుద్ధోదన రాజునకు శుభవార్త నెరింగించెను.

ఏడేండ్లకు పూర్వము పరివ్రాజకుడై సంసారమును విడిచి దేశములోనికి బయలుదేరిన యువరాజు తిరిగి వచ్చుచున్నాడన్న కబురువిని రాజు, యశోధర, ప్రజలు అందరూ కడు సంతసించిరి. రాజకుమారుడు సన్యసించి, తాను కనుగొన ప్రయత్నించిన సత్యమును తుదకు తెలుసుకొన్నాడన్న వార్త అందరినీ ఆనంద భరితులుగ నొనర్చెను. తన కుమారుడు బుద్ధుడై దివ్యజ్ఞానాన్ని సంపాదించి, ఆ సత్యాన్ని తనకు తెలియ చేయ నున్నాడని సుద్ధోదనరాజు ఆనందభరితుడయ్యాడు.

ఈ శుభోదంతాన్ని విని, ప్రజలు, సంతోషముతో పురవీధులన్నిటినీ పరిశుభ్రపరచి, ఇళ్ళను పూలమాలలతో అలంకరించి, వీధులలో పతాకములను వివిధవర్ణముల గుడ్డలను వ్రేలాడకట్టి, తమ యువరాజున్నూ, లోక ప్రసిద్ధ బుద్ధుడునూ ఐన సిద్ధార్థునకు, ఉచితమైన విధంగా ఆహ్వానము నొసంగుటకు సంసిద్ధులయ్యారు. పురవీధులలో కోలాహలము మిన్ను ముట్టింది. స్త్రీలు పురుషులు బాలురు బుద్ధుని ఆగమమునకై ని చూస్తూ వున్నారు.

బుద్ధాగమన దినమున్న, రాజు తనకున్న ఏనుగులను సర్వాభరణములతో అలంకరింపచేసి, అతనిని అతి శోభతో

నగరములోనికి తీసుకురమ్మని ఎదురుగపంపెను. పురద్వారముకడ, భర్తను కలుసుకొనుటకై యశోధర పల్లకినెక్కి వెళ్లుచుండెను. త్రోవలో ఆమెకు కాషాయవస్త్రములను ధరించి ఇంటింట తిరిగి తిరిపెమెత్తుకొనుచుండిన ఒక సన్యాసి కనిపించెను. "ఈ సన్యాసి ఎవరో కదా! ఇదివరకు నే నెన్నడునూ యిట్టి గంభీరమూర్తిని ప్రసన్న వదనుని చూసిఎరగను. ఈయన పవిత్రుడునూ విశిష్టుడునూ అగు యోగి పుంగవుడై వుండవలెను!" అని యశోధర యోచించుకొనుచుండెను. ఇంతలో అతడు సమీపింప, ఆ యోగిపుంగవుడు తనభర్తయే అనియూ, పూర్వాశ్రమములో సిద్ధార్థుడేగాని వేరొకడు కాడనియూ పోల్చుకొని ఆమె అచ్చెరువు పొందెను. పూర్వమువలె ఆతడు నవసుందరుడు కాడు. ఈ నాడు ఆతని యందు పవిత్రత, ప్రసన్నత, ప్రశాంతత, గాంభీర్యము, మహోన్నత్యము తాండవించుచుండెను. అదిచూచి ఆమె పల్లకిదిగి, క్రిందికి భూమినిచూచుచు తన్నెత్తి తనవైపు చూడక, నిశ్శబ్దముతో వీధులలో తిరుగుచుండిన ఆ తిరిపెమెత్తువాని కాళ్ళకు మ్రొక్కెను.

ఆమె తిరిగి ప్రాసాదమును చేరుకొని, రాజుతో అతని కుమారుడు బిచ్చగాడై రాజధానిని చేరుకొనెనని చెప్పెను. అది విని సుద్ధోదనుడు సిగ్గుతో క్రుంగి, అతి కుపితుడయ్యెను. తన కోడలు తన కొడుకును చూచిన స్థలమునకు అతిరయమున రథముపై పోయి, చూడ, అతి ప్రసన్నుడై, పూజించుచున్న ప్రజా సమూహము తన వెంటరాగా, రాజ ప్రాసాదమునకు బయలుదేరిన బుద్ధుడు కనిపించెను. సుద్ధోదనుడు కోపముతో మండిపడుచు. పుత్రుని నిందించుచు, "ఓ పుత్రకా, ఏమిటీపనికి

రాజకుమారుడవును, యువరాజువునై యీ విధమున సామాన్య బికారివలె యీ పురమున బిచ్చమెత్తుకొనుటకా, సంసారమును విడిచి పరిత్యజించితివి? ఈ నాడు, ఓ పుత్రకా, నన్ను, రాజకుటుంబములను అవమానపరచితివి. నీ వంశము వారేనాడిట్టి నీచమైన పనిని చేసియుండిరి? నీచబికారివలె యేనాడు మనకుటుంబమువారు, బిచ్చ మెత్తుకొనిరి?" అని కఠినముగ పల్కెను.

దుఃఖపడి, కోపముతోనుండి ఏడ్చుచున్న తండ్రికి, అతి ప్రశాంతంగా బుద్ధుడు "ఓ జనకా, ఈ విధముననే, నాజాతి వారు మొదటియుండియు ఆచరించుచుండిరి" అని జబాబిడెను. శుద్ధోదనుడు గర్వముతో "నీవంశస్థులు అనాదినుండియు రాజులైయుండిరి. ఏనాడునూ వారిట్టిపనిచేయలేదు" అనిఉరిమెను.

ప్రసన్నతతో బుద్ధుడు "ఓ జనకా, అదినిజము. కాని ఈనాడా నేను నా ఐహికజన్మనుగురించి చెప్పడములేదు. అన్ని కులములకు చెందిన బుద్ధులజాతి గురించి నేను చెప్పుచున్నాను. నేను నాజాతి వారివలె ఆచరించుచున్నాననడములో అర్థమదే. బుద్ధులుతొలినుండియూ యీవిధముననేఆచరించుచుండిరి. కావున వారికుచితమైన విధముననే, నేనును ఆచరించుచున్నాను" అని మారుపల్కెను.

బుద్ధుడు తన తండ్రిప్రక్కను నడుచుచు, తనవారికడకు తాను రిక్తహస్తములతో రాలేదనియు, అమృతమయమైన నిచ్చనమునకు తీసికొనిపోయే అమూల్య సత్యరత్నాన్ని తెచ్చుచున్నాననియు, చెప్పెను. మోక్షమునిచ్చే నిచ్చనము,

నాశనరహితమైన తత్స్వభావము, అదిచేరుమార్గమును, ప్రబోధించుచు అతను రాజప్రాసాదమును చేరుకొనెను. అచట తానుకనిపెట్టిన సత్యమును విప్పిచెప్పి అతి హృదయంగమముగ ఉపదేశించెను. సుద్ధోదనుడు, యశోధర, ప్రజలు, రాహులుడును బుద్ధుని ధర్మోపదేశమునువిని తన్మయులై, వాని శిష్యులైరి. కొంతకాలమైన పిదప రాహులుడు భిక్కువై బౌద్ధ సంఘమునుచేరెను.

# 11

ఈనాటి సంయుక్త రాష్ట్రాలు, బీహారు, ఉత్తరవంగ దేశమువున్న ఉత్తర హిందూస్థానములో అప్పటినుండియు నలువది నాల్గేండ్లు, ఎడతెగకుండా బుద్ధుడు పర్యటించుచు నిరంతర ధర్మోపదేశమును, మత ప్రచారమును గావింపుచుండెను. ఒక్క వర్షాకాలములోతప్ప, మరియేకాలములోనూ ఒక్కచోట ఒకటి రెండు రోజులకు మించి బుద్ధుడు బసచేసియుండుటలేదు. వర్ష ఋతువు మాత్రము బింబిసార మహారాజ దత్త రాజగృహ సమీపస్థ వేలువన విహారములోనో, బుద్ధుని, బౌద్ధసంఘాన్ని అతి భక్తితో గొలుచుచుండిన అనాథపిండికుడు సమర్పించిన కోసలదేశ రాజధాని సావట్టీపురమున కనతిదూరమున నుండిన జేతవన విహారములోనో అతను గడుపుచుండెను.

ప్రతిదినమునను ఉషఃకాలముననే మేల్కాంచి,కాలోపచారములదీర్చుకొని, ఒకచోట కూర్చొని కొంతసేపు ధ్యాననిమగ్నుడై బుద్ధుడు గడుపుచుండెను. ఇంతలో భళ్ళున తెల్ల

వాగినపిడప, కాషాయవస్త్రమును రెండు భుజములను కప్పునట్లు ధరియించి, భిక్షాపాత్రను చేతబూని, నోట మాటాడక, దృష్టిని భూమిపై నిగిడించి యుంచి తల యెత్తక, తన బసకు దగ్గరనున్న పల్లెలోనో, పట్టణములోనో, ధర్మాత్ము లిచ్చు బిచ్చమును పాత్రలో నందుకొనుచు, ఇంటింటికిపోవుచుండును. ఒకప్పుడు ఒంటరిగను, ఒకప్పుడు శిష్యబృందము ఒకరి వెనుక నొకరు నడచుచు వెంటరాగా. బుద్ధుడు తిరిపము నెత్తుకొనుచుండెను. ఒకప్పుడు బుద్ధుడొంటరిగా బిచ్చమెత్తుచుండినప్పుడు, ఒక గృహస్థుడు ఆతని ఇంటిలోనికివచ్చి భుజింపమని వేడుచుండును. ఆతడపుడింటిలోనికి జని, గృహ యజమాని తయారు చేసిన ఆసనముపై కూర్చొనును. ఇంటివారు తన పాత్రను గొనిపోయి తమ వంటకములలో నతి ప్రశస్తమైన వానితో నింపి, అతని యెదుట నుంచగా, ఆ భక్ష్యములను కుడిచి, చేతులు కడుక్కొని, అచటవారికి ధర్మోపదేశమును గావించును. ఐహికాముష్మికములలో సత్కార్యములవలన గలుగు సత్ఫలితములను దుష్టకార్యములవలన గలుగుదుఃఖమునుగురించి బోధించి, తన బసకు పోవుచుండును. అచట ఒకసత్రములోనో, చెట్టుకిందనో, తన శిష్యులందరూ భుజించువరకును కూర్చుని, యుండి అటుపిమ్మట తనగదిలోనికిపోయి, పాద ప్రక్షాళణము చేసికొని, బయటకు వచ్చును. వచ్చి ధర్మోపదేశమునువినుటకు వచ్చి కూర్చునియుండు భిక్కువులకు ప్రబోధముగావించి, అతి శ్రద్ధతో ధర్మమును తెలిసికొని దాని నాచరింపమని వారికి చెప్పుచు, అటులచేసిన ఈ జన్మములోనే నిర్వానమును పొంద గలరని ఉపదేశించుచుండును.

ఈ ధర్మోపదేశము, ముగిసినపిదప, సభలోనిభిక్షువులూ, తమ తమ శీలములకును తమతమ మనోశక్తికిని తగిన ఆధ్యాత్మిక విషయమును తెలుపవలసినదిగా బుద్ధుని ప్రార్థింతురు. అధ్యయనాభ్యాసములలో ఎవరి స్థితికి తగిన విషయమునువారికి బోధించి, "ధ్యానతత్పరులు కావలసినదని" వారిని హెచ్చరించి బుద్ధుడు అంతటితో ఆనాటి సమావేశమును బర్తరఫ్ చేయును. భిక్కులును బుద్ధ ప్రబోధితవిషయములను మననము చేసుకొనుచు, ఏకాంత ధ్యానార్థమై ఎవరితావులకువారు ఏ చెట్టు క్రిందకో, ఏ గోపురము చాటునకో పోవుచుందురు. మధ్యాహ్నమంతయు అట్టి ధ్యానములోనే ఉందురు.

అపుడు బుద్ధుడు తన ప్రత్యేక కోష్టము లోనికి పోయి, వేసవికాలమైనచో వేడిమి మిక్కుటముగా వుండుటవల్ల, తనకాషాయవస్త్రమును నాలుగుమడతలు మడిచి,దానిని భూమిపై పరుచుకొని, అవ్యాకుల చిత్తుడై, కొంతసేపు విశ్రమించును. విశ్రవిశ్రమించునపుడుసైతం అతడు ప్రపంచమున నరుల దుఃఖమును ఎట్లు పోగొట్టుదునా అని యోచించుచుండును. జీవులను దుఃఖ విముక్తులను చేయు విధానమునుగూర్చి తలపోయుచుండును. బుద్ధుడిటులు విశ్రమించినపుడు, చుట్టు ప్రక్కల పల్లెలనుండియు, పట్టణములనుండియు అనేకమంది ప్రజలు ఆయన దర్శనార్థము వచ్చి, ఇవతల గుమిగూడివుందురు; పుష్పఫలాది ఉపాహారములను సమర్పించి, బుద్ధుని ధర్మోపదేశమును ఎపుడు విందుమా అని వారు ఆతురతపడుచుందురు. ప్రజలు సమర్పించుచు ఉపాయనములను ప్రీతితో స్వీకరించి, బుద్ధుడు వారందరికీ బోధపడు విధమున ధర్మబోధ చేయును. పండితులు,

పామరులు, రాజులు, రైతులు, వర్తకులు, కూలివాళ్ళు అందరూ బోధపడుచుకొను విధమున బుద్ధుడు ధర్మాన్ని ఉపదేశింప, వారందరూ సంప్రీతమనస్కులై యెవరి మార్గాన వారు వెడలి పోదురు.

చూడవచ్చిన వారందరూ వారి మార్గాన వారుపోయిన పిదప బుద్ధుడు విహారములోనో, లేక దగ్గరగావున్న కోనేరులోనో, సరస్సులోనో, స్నానముచేసి తిరిగి గదిలోనికిపోయి, ఏకాంతముగ ధ్యాన నిమగ్నుడై కొంతతడవుండును.

తనతోనుండిన భిక్కువులుగాక, మరియే ప్రాంతము నుండియైనను తమ శంకలను అనుమానములను తీర్చుకోడానికి వచ్చిన భిక్కువుల ప్రశ్నలకు బుద్ధుడు కడు ప్రసన్నతతో సమాధానములనిచ్చి, వారి శంకలనుబాపి, వారిని ధర్మాచరణలో సరిదిద్దుచు సక్రమమార్గమున నడుచుటలో సాయపడు చుండును. ఒక్కనాడైనను వారికి సలహాల నిచ్చినపుడుగాని, ఉపదేశించునపుడుగాని, ఎట్టి కోపమును చూపక అతిప్రసన్నుడై వారి శంకలను పోగొట్టి, ఉత్సాహము కలుగజేసియే వారిని పంపుచుండును. ఎవరైననుసరే, నిజమును తెలుసుకొనే సదుద్దేశముతోవచ్చినచో, వారికి అతి దయతో ఉపదేశమునిచ్చి, ఉత్సాహవంతులుగజేసి పంపుచుండును. అట్టి సన్మానమును పొంది, వాని దయకు పాత్రులగుటచే అనేకమంది దర్శనమునకై వచ్చినవారు బుద్ధుని శిష్యులై బౌద్ధ సంఘమును చేరుచుండిరి. చూడవచ్చిన వారితో సాయంకాలమును, రాత్రితొలిభాగమును బుద్ధుడు గడుపుచుండును. ఒక్కచోట కొన్ని గంటల సేపు

కూర్చునియుండుటవలన కాళ్లు "గుది" ఎక్కగా దానిని పోగొట్టుకొనుటకై కొంతతడవు పచారుచేసి, తన గదిలోనికి పోయి, నిదురించుచుండును.

ఈ విధమున నలుబది నాల్గేండ్లు గడిచి పోయినవి. బుద్ధుడు ఒక చోటనుండి ఇంకొక చోటుకు ప్రయాణము చేయు సమయము మినహాయించి, మిగిలినప్పుడంతా పై జెప్పిన విధముననే కాలము గడుపుచుండెను. ఆధ్యాత్మిక ధర్మాది విషయాల్లోనేగాక, తన అపార వివేకమువలన సంసారవిషయాల్లో తన సలహా కోరిన వారలకు సలహా నిచ్చుచుండెను.

జేతవన విహారంలో బుద్ధుడు వసించుచుండినపుడు, తమ తమ వరిచేలకు నీరుపెట్టడం విషయములో కపిలదేశ ప్రజలునూ కొలియదేశపు ప్రజలునూ తీవ్రముగా వివాదపడిరి. అది వర్షము లెగగొట్టిన సమయము. చాలా కాలము వర్షము పడకపోవుటచే కపిల, కొలియ రాష్ట్రములమధ్య ప్రవహించు యేరు, రమారమి యెండిపోయెను. ఇరు రాష్ట్రపు ప్రజలు, ఏటిలో నుండిన నీటినంతను ఎవరికివారే రెండవవారికి ఒక బొట్టైనను చెందకుండు విధాన వినియోగింప యత్నించుచుండిరి. వారందుకై దొమ్మియుద్ధము చేయడానికి తయారుగానుండిరి.

కపిలదేశపు ప్రజలు బుద్ధుడుపుట్టిన రాష్ట్రమునకు చెందిన ప్రజలు, వారును కొలియనులు దొమ్మియుద్ధముచేసిన ఇరుపక్షములలోను కొంతమంది చనిపోదురని బుద్ధుడు విచారించెను. వారిని అట్టి బాధనుండి తప్పించుటకై నిశ్చయించుకొనెను. రెండుపక్షములవారును ఆయుధపాణులై అతి కోపముతో

యుద్ధానికి సన్నద్ధులై యుండ, బుద్ధుడు, అతిశాంతంగా అచటు కుపోయి, "రాజన్యులారా, యోధులారా! నేను చెప్పునది బాగావిని, యదార్థముగ నేనడుగు ప్రశ్నలకు జవాబులనీయుడు. ఒకరినొకరు చంపుకోడానికి యెందుకై ప్రయత్నిస్తున్నారు? అని ప్రశ్నించెను.

ఉభయపక్షములవారు: మాడిపోతున్న చేలకై యీ నీటిని అపేక్షించి, లడాయికి తయారైనాము.

బుద్ధుడు: సరేగాని, నిజంగా ఈ నా ప్రశ్నకు జవాబియ్యండి. ఈ వటిలోని ఈ కొంచపునీరా? లేక అనేకమంది ప్రజల రక్తనాళములోని, అందులో ముఖ్యముగా రాజుల రాజకుమారుల రక్తనాళములలోని రక్తమా, ఏది ఎక్కువ విలువైనది?

ప్రజలు; ప్రజలరక్తనాళములోనున్న అందులో ముఖ్యముగా రాజుల రాజకుమారుల రక్తనాళములలోనున్న రక్తమే ఈనది, ఉదకముకంటె, ఎక్కువ విలువైనది."

బుద్ధుడు: అలాగైతే, తక్కువ విలువైనదానికై, ఎక్కువ విలువైనదానిని పోగొట్టుకొనుట ఉచితమా?

ప్రజలు: ఆర్యా! అల్పార్థమైనదానికొరకు, విశిష్టార్థముగలదానిని పోగొట్టుకొనుట ఉచితముగాదు?

బుద్ధుడు: అటులైనచో. మీ కోపమును దిగమ్రింగి, మీ ఆయుధములను విడనాడి, మీలో మీరు రాజీపడండి!

అదివిని ప్రజలు తమ బుద్ధిహీనతను తెలుసుకొని, బుద్ధుడు చెప్పినట్లు రాజీకొచ్చుకొని, ఆ యేరులోనుండి ఉదకాన్ని సమంగా పంచుకొని, స్నేహంతో జీవించుచుండిరి.

# 12

ఇంతలో సుద్ధోదనుడు జబ్బుపడి మంచము పట్టెను. సుపుత్రునివలె బుద్ధుడు, తన బౌద్ధసంఘములో భిక్కులైన సవితితమ్ముడు నందునితోను, ఆనంద, సారీపుత్ర, ముగ్గలాన థేరులతోను, జనకునికి మనశ్శాంతి నిచ్చుటకై కపిలవస్తును చేరెను. ప్రియపుత్రుని చూచే ఆనందం వలన మొదట సుద్ధోదనుడు కొంచెము తేరుకొన ప్రారంభించెను. అక్కడివారందరూ ఆతడు ఆరోగ్యవంతుడగునని సంతసించిరి. కాని రోగము తగ్గేసూచనలు కొంచముకాలమే కన్పించి, తుదకు రోగము తిరుగబెట్టెను. అప్పటికప్పుడే బహువృద్ధుడగుటచే, రోగమునడ్డుకొను శక్తియుడిగియుండుటచే రోగము దినదినముఎక్కువై రాజు కాలగతిని జెందెను. ప్రజలందరూ కడుదుఃఖితులైరి.

సుద్ధోదన మహారాజు దివంగతుడుకాగా, బుద్ధుని స్వంత కుమారునివలె పెంచి పెద్దవానిగజేసిన మహాపజాపతి మహారాజ్ఞి సంసారములో నుండుటకు విముఖురాలై, తన పెంపకపుకొడుకు ఉపదేశమునుపొంది సన్యసించి భిక్కునివలె జీవించ నిశ్చయించుకొనెను. తనను విడనాడుట కిచ్ఛగించక, ఆమెతోటి కాలము గడుపనిశ్చయించుకొనిన దాసీజన చేటికె

లతో ఆమె బుద్ధునికడకుపోయి, వారుకూడ సంసార పరిత్యాగము జేసి సన్యాసినులై భిక్షువులవలె జీవించుటకు కృపాళుడై అనుజ్ఞ నివ్వమని అతనిని ప్రార్థించెను. ఆమె భిక్షునులవలె జీవించుటకు అనుజ్ఞ నీయమని మూడు మార్లు వేడినను, బుద్ధుడందుల కియ్యకొనలేదు. మహాప్రజాపతి అందులకు కడు దుఃఖితురాలై, ఏడ్చుచు బుద్ధ సమక్షమునుండి జనెను.

జనకునికి అంత్యక్రియలగువరకును కపిలవస్తులో వేచియుండి, బుద్ధుడచటనుండి కదలి దేశపర్యటనమును చేయుచు, వేసాలిచేరి అచట నతి దూరమున వున్న మహానగరములోని విహారములో బస చేసియుండెను.

మహాప్రజాపతి కేశఖండనముచేసికొని, దాసీజనముతో కాషాయవస్త్రములధరించి, పాదచారిణియై, గ్రామ గ్రామమునకు నడుచుచుపోయి, చిట్టచివరకు మహావనములో నుండిన విహారమునుచేరెను.

కాలు కింద పెట్ట నెరుగని రాణివాసపు మహారాణి, ఇంతదూరము నడచుటచే కాళ్లు వాచిపోయి యుండెను. ధూళిత్రోకప్పబడి, దీనురాలై, ఏడ్చుచు ఆమె విహారము బయట నిలువబడి యుండెను. ఆనందుడామె దైన్యమును, రోదనమును చూచి, ఆమె ఏడ్చుటకు కారణమును తెలియ గోరెను.

మహాప్రజాపతి: "ఓ ఆనందా, బుద్ధభగవానుడు సంసారమును త్యజించి, బౌద్ధ ధర్మమును తెలిసికొని ఆ సంఘ నియమములో భిక్షునివలె జీవించుటకు స్త్రీలకనుజ్ఞనీయక పోవడమే నా ఏడ్పునకు కారణము.

ఆనందుడు : "గౌతమువంశ సుజాతా! అటులైనచో నేనుపోయి, బుద్ధ భగవానుని స్త్రీలుకూడ బౌద్ధభిక్షునివలె జీవించుటకు అనుమతించమని ప్రార్థించివచ్చెదను."

మహాప్రజావతికి చేసిన వాగ్దానం ప్రకారం ఆనందుడు బుద్ధుడున్న గదిలోనికి పోయి స్త్రీలయందు కృపజూపి, పురుషులవలెనె వారినీ భిక్కునులు అయిబౌద్ధ సంఘకట్టుబాట్లతో సంసార పరిత్యాగము చేసి సన్యాసిగడుంగుట కనుజ్ఞ నీయమని సవినయముగా ప్రార్థించెను.

బుద్ధు : ఓ ఆనందా! చాలు, చాలు, అట్టిదాన్ని కోరకుము." కాని ఆనందుడు ఇట్టి బుద్ధుని కఠిన జవాబునకునిరాశ జెందక, మూడవ పర్యాయముకూడ ప్రార్థించెను. బుద్ధుడు తొలి జవాబే చెప్పెను.

ఆనందుడు : ఈ విధమున బుద్ధభగవానుని అడిగిన లాభములేదు. స్త్రీలు సన్యసించి బౌద్ధసంఘమున చేరుటకు అనుజ్ఞ యిమ్మని వ్యక్తముగా అడిగిన అందుకాయన ఒప్పుకొనడు. ఇంకోవిధమున అడిగిన అంగీకరించునేమోచూతము' అని ఆలోచించుకొని "పూజ్యా, తథాగతుని ధర్మబోధను అనుసరించి, బౌద్ధధర్మాచరణకై సంసారపరిత్యాగముచేసి, స్త్రీలు సన్యసించకపోయిన, వారు నిర్వాణమార్గమునగల నాలుగు స్థితులను పొందగలరా?" అని బుద్ధుని ప్రశ్నించెను.

బుద్ధుడు : ఔను! ఆనందా, ఔను! నా సిద్ధాంతాన్ని అవలంబించి, బౌద్ధసంఘపు కట్టుబాట్లకు లోబడి, సంసారమును

విడనాడి సన్యసించిన స్త్రీలు, ఈ జీవితములోనే అర్హనులై, నిర్వాణమును పొందగలరు.

ఆనందుడు : అలాగయితే, ఓ పరమపూజ్యా ! గోతమ వంశజురాలైన మహాప్రజాపతి ఎట్టి ఉపకారమును చేసినదో ఆలోచింపుము. ఆమె తథాగతునికి పినతల్లి; సిద్ధార్థుని జనని మరణించిన పిదప, ఆవిడ అతనికి పాలిచ్చి పెంచి పెద్దవానిగ జేసినది. పరమపూజ్యా ! సంసారమును విడనాడి ఆమె బుద్ధ భగవానుని ఉపదేశానుసారం ధర్మాచరణ చేస్తూ సన్యాసిని అగుటకు అనుజ్ఞను ఇమ్ము !

బుద్ధుడు : ఓ ఆనందా ! గోతమవంశజాత అగు మహా ప్రజాపతి, ఈ అష్టగుణధర్మ నియమములను తప్పక అనుసరించుటకు ఒప్పుకొనిన ఇదియే దీక్ష అని గ్రహింపుము !

ఆనందుని కోరికను మన్నించి ఆ అష్టగుణధర్మనియమములను బుద్ధుడు విశదీకరించెను.

బౌద్ధ సంఘములో ఎంత వెనుకను చేరిన భిక్షునికి, చిరకాలముక్రింద చేరిన భిక్షునియయ్యు గౌరవమును చూపవలయును; భిక్షులులేని ప్రదేశములో, భిక్షునిలు, వసింపకూడదు; ప్రతిపక్షాము దినమునను; నిర్ణీత భిక్షువువలన ఉపదేశమును పొందవలెను; ప్రతివర్షానంతరమందును భిక్షులను భిక్షునిలను, తన చర్యనుగురించి విమర్శింపుమని కోరవలెను; గొప్పదోషమును చేసినయెడల భిక్షువులగురించియు, భిక్షునిలగురించియు ప్రాయశ్చిత్తమును చేసుకోవలెను. భిక్షులు, భిక్షునిలుగల సంఘముచే భిక్షునిదీక్ష పొందక పూర్వము

రెండేళ్లు నూతన శిష్యునివలె తర్ఫీదు పొందుచు పరీక్షకులోనై యుండవలెను; ఏ భిక్షుని గురించియు చెడ్డ చెప్ప కూడదు; భిక్షునకు అధికారరీత్యా ఎట్టి ఉపదేశమును చేయక, భిక్షువుననే అట్టి ఉపదేశాన్ని పొందవలెను. “ఓ ఆనందా, మహాప్రజాపతి ఈ అష్టగుణనియమాలకు లోబడివుండి, ఆమె జీవించివున్నంత కాలము ఆ విధముగా ఆచరించిన యెడల భిక్షునికింద దీక్షితురాలైనదని గ్రహించుకొనవలెను” అని బుద్ధుడు చెప్పెను.

బుద్ధునివద్ద సెలవుతీసుకొని ఆనందుడు, భగవానుని వచనములన్నియు మహాప్రజాపతికి తెలియపరచెను. ఆమె మాటలను విని మహదానందముతో “ఓ ఆనందా! పూజ్యా! అలంకార ప్రియులగు ఒక యువతికో, ఒక యువకునికో సువాసన గల ఒక పూలమాలను యిచ్చినపుడు వారేమిచేయుదురు? తలంటుకొని రెండు చేతులతోనూ ఆ పూలమాలను తలపై ధరియింతురు! అదే విధముగా నేను యీ అష్టగుణ ధర్మ సూత్రాలను నా కంఠంలో ప్రాణమున్నంతవరకు శిరసా వహించి ఆచరింతును” అని జవాబిచ్చెను.

అది విని, ఆనందుడు బుద్ధుని చెంతకుపోయి వినయపూర్వకముగ నమస్కరించి, గోతమవంశ జాతఅగు మహాప్రజాపతి, తథాగతుని అనుశాసనము ప్రకారం, అష్టగుణ ధర్మసూత్రాలను అనుసరించుటకు అంగీకరించినది కావున ఆమె భిక్షుణి దీక్షను పొందినదని విన్నవించెను. అప్పుడు బుద్ధుడు “ఓయీ, ఆనందా! సంసారమును పరిత్యజించి సన్యసించిన ఆడవారిలో యీ ధర్మమును, యీ శిక్షణమును ఎంతో కాలం

వుండవు. ఒక్క అయిదువందల సంవత్సరముల కాలము మాత్రం, అది నశించకుండా వుండును. పురుషులు తక్కువగను, స్త్రీలుఎక్కువగను వుండుటవలన కుటుంబములు,దొంగల బందిపోటులబారినుండి, ఎట్లు చిరకాలము కాపాడబడక వుండునో అట్లే నా యీ ధర్మమును శిక్షణమును, చిరకాలముండవు. తెగులు పట్టిన వరిచేనుగాని, చెరుకుతోటగాని, తొందరగా పాడగువిధాన అతి త్వరలో నశించును!" అని చెప్పెను.

# 13

భిక్కువులతో బుద్ధుడు దేశమంతా తిరుగుతూ, ధర్మప్రబోధం చేయుచుండెను. ఆయన ధర్మోపదేశాన్ని వినడానికి తండోపతండాలుగా ప్రజలు వచ్చి, వారిలో అనేకులు బౌద్ధ ధర్మాన్ని అంగీకరిస్తూ భక్తి గలిగి వుండిరి. ఇతర మత ప్రచారకులునూ దేశంలో తిరుగుతూ, అద్భుతమైన పనులను చేసి, ప్రజాసమూహములను ఆకర్షించుచుండెను; ప్రజలు, వారి ఉపన్యాసములను విని, మోహితులై వారి అనుయాయులగుచుండిరి. బౌద్ధ భిక్కులది చూసి అమాయకులగు మనుష్యులకు తమ మహిమను కనబరుస్తూ కొన్ని అద్భుత చర్యలనుచేసి, వారిని ఆకర్షించుకొనుచున్న ఇతర మతప్రచారకులవలె, తాము సైతం అటులనే ఆచరించు ప్రజలను తమ మతావలంబకులుగ, ఏల చేసుకోరాదని, బుద్ధుని తెలియగోరిరి.

శిష్యులుచేసిన శంకను బుద్ధుడు విని, తాను లోకోత్తర కర్మలను చేసి ప్రజలను ఆకర్షించి, తనలో నమ్మకముపుట్టించు

కొని, తన ధర్మమును, వారివలంబించునటుల చేయుటకు, బిడియపడుతున్నానని జనులు చెప్పెను. "ఓయీ, భిక్షులారా! తథాగతులకు లోకోత్తరకర్మ ఒక్కటే కలదు. కామ రాగములకు లోనై తహతహలాడు నరుని తథాగతులు కామ రాగ రహితునిగ చేయుదురు. క్రోధ విద్వేష సహితుడగు మానవుని, క్రోధ విద్వేష రహితునిగ చేయుదురు. అజ్ఞాన మాయలకులోనై నరుడెవడైనను అంధునివలె వుండిన, అతని అంధత్వమును పోగొట్టి చూపువచ్చునట్లుచేసి, వాని అజ్ఞానమును పోగొట్టి, విజ్ఞానవంతునిగ చేసి, మాయనుండి తప్పింతురు. ఈ లోకోత్తరకర్మ నొక్కదానినే, తథాగతులు చేయుదురు. ఇతర లోకోత్తర కర్మలను నిరసించి, వాటిని చేయని రాకరింతురు."

ఇంతలో కొందరు భిక్షులు, అక్కడకువచ్చి బుద్ధుని కొక వింతను చెప్పిరి. మొగ్గల్లానుని మహిమను పరీక్షించగోరి ఒకడు ఒక చెక్కనిపాత్రను ఎక్కడో దాచి, మహిమ వున్నచో దానిని తెమ్మని మొగ్గల్లానుని కోరెననీ, మొగ్గల్లానుడు తన మహిమచే ఆ పాత్రను తెచ్చెననియూ భిక్షులు చెప్పగా అది విని బుద్ధుడు అప్రసన్నుడయ్యెను. మొగ్గల్లానుని ఆ పాత్ర తెమ్మని చెప్పి అతడు తెచ్చిన ఆ పాత్రను భిక్షువులందరు చూచుచుండగా, ముక్కలు చేయుచు, తన మహిమను ప్రదర్శించే ఎట్టిపనులను చేయవద్దని అతనిని బుద్ధుడు కఠినముగ శాసించెను.

అమాయకులైన ప్రజలు తనయందు భక్తి కలిగియుండుటకై ఎట్టిలోకోత్తరకర్మలను చేయవద్దని భిక్షువులను ఆజ్ఞాపించెను. అందుకు విరుద్ధముగా వారాచరించినయెడల భిక్షుసంఘాన్ని విడిచిపొమ్మని నిష్ఠురముగ చెప్పెను. నేటికిసైతము లోకోత్తరకర్మచేయ ప్రయత్నించిన భిక్షువును, సంఘము నుండి తరిమివేయుదురు. ఏలయన అట్టి కర్మాచరణ వినయసూత్రాలకు విరుద్ధమైనది. ఖూనీచేయుట, దొంగిలించుట, వ్యభిచరించుట కంటే, ఇట్టి లోకోత్తరకర్మ ప్రదర్శనములు బహుహీనములైన 'పరాజిక'లని బుద్ధుని ఆదేశము.

అప్పటినుండియు బుద్ధుడుగాని, మరి యే అర్హనుడుగాని, భిక్షువుగాని లోకోత్తరకర్మ ప్రదర్శనములను చేయ తలపెట్టనైనతలపెట్టలేదు. ఇటులైనను ప్రజలు బుద్ధుని మహిమను తెలిసికొని, వానియందు భక్తి కలిగి ఎచటకు బోయినను వానికిని వాని భిక్షుసంఘమునకును సర్వోపచారములను చేయుచుండిరి. ఈ కాషాయవస్త్రధారులగు క్రొత్త సన్యాసులు ప్రజల మన్ననలను పొందుటగని ఇతర మత ప్రచారకులు అసూయపడుచుండిరి.

ఒకమాటు, బుద్ధుడు శిష్యులతో కోసాంబినగరమును చేరుకొనెను. అక్కడ, అనేకమంది శిష్యులతో అన్యమతాచార్యుడొకడుండెను. అతడును అతని శిష్యబృందమును బుద్ధుని, భిక్షువులను చెప్పరాని బూతులుతిట్టిరి. ఈ అన్యమతానికి చెందిన సన్యాసులు, బౌద్ధభిక్షువులను కనపడిన చోటల్లా నోటవచింపరాని బూతులు తిడుతున్నారని ఆనం

షుడు బుద్ధునకు చెప్పెను. అట్టిబూతులువిని తిట్లు తినుటకంటె కోసాంబిని విడిచి యింకొకప్రదేశమునకు పోవుట ఉచితము కాదా అని, భిక్కువులు బుద్ధునితో విన్నవించమన్నారని ఆనందుడు వానితో చెప్పెను. అది విని "మనమింకోచోటు నకు పోయిన, అచట మనలను తిట్టి అవమానించినయెడల, మనమేమిచేయవలెను?" అని బుద్ధుడు ప్రశ్నించెను.

ఆనందుడు: అక్కడనుండి ఇంకోచోటునకు పోవుదము.

బుద్ధుడు: అక్కడను మనను బూతులుతిట్టి, అవమాన పరచిన మనమేమిచేయుదము?

ఆనందుడు: అటులైన అక్కడనుండి ఇంకోచోటునకు పోవుదము అనివిని బుద్ధుడు కొంచము సేపు ఊరకుండి, "ఓయీ ఆనందుడా, వివేకముతో కొంచము సహనము నిపుడుచూపిన, ఒకచోటునుండి ఇంకోచోటుకు తొందరగా పోయే శ్రమను తప్పించుకొందుము. మనము కోరు శాంతిని కొత్తజాగాలో కనుగొనగలుగుదుము అన్న నిశ్చయములేదు. సహనము జూపిన యిచ్చటనే, ఆ శాంతిని కనుగొనగలము. సహనము జూపి, వివేకవంతులు తమశత్రువులను లోబరుచుకొందురు. యుద్ధములో వినియోగించు ఏనుగును చూడుము. తన్నపై వేయు బాణములను, బల్లెములను సరకుగొనక ఆ యేనుగు యుద్ధమధ్యస్థలమునకు ఎదుటనున్న అడ్డను తొక్కివేయుచు చొచ్చుకొనిపోవును. ఆ ఏనుగునే నేననుకరింతును. ఓయీ ఆనందుడా! ఈ పట్టణములోనే, నేనుండి నా విశిష్ట ధర్మాన్ని నా మానవశక్తిని వినియోగించి ప్రబోధిస్తూ, కామజాలములో

తగుల్కొని కొట్టుకొనుచున్న పాపులను అందునుండి విముక్తులుగ జేయుదును. నన్ను, నా శిష్యులను ఈ పరమత సన్యాసులుతిట్టే బూతుతిట్లను లెక్కచేయను. ఆకాశమును కలుషితము చేయదలిచి, దానిపై ఉమిసిన, అది ఆకాశాన్ని కలుషితం చేయక, ఉమిసినవాని మీదనేపడి అతనిని చెరచును. అట్లే, మనము సరకుగొనక వుండిన, మనలను బూతులుతిట్టు అవివేకులు, వారిమీదనే ఆ తిట్లు పడునని గ్రహించగలరు!" అని ప్రత్యుత్తరమిచ్చి, ఆనందుడును, ఇతరభిక్కులును ఎంత కోరినను, కోసాంబినుంచి కదలక అక్కడనే వుండెను.

ఇతర సన్యాసులు ఎంత తిట్టినను, బౌద్ధ భిక్కువులు మాత్రము మారు తిట్టక ప్రసన్నులై వుండిరి. వారి గాంభీర్యమును చూసి కోసాంబీపురవాసులు మెచ్చుకొని వారిని దూషించు పరమత సన్యాసులను అసహ్యించుకొని కుపితులయిరి. బుద్ధుని ప్రసన్నతను, భిక్కువుల సహనమును మెచ్చుకొని కోసాంబీనగర యువకులనేకులు బౌద్ధ సంఘములో చేరిరి.

ఈ కోసాంబీ యువకులు, భిక్కువులయ్యు, తమకలహప్రియత్వమును పోగొట్టుకొనక, ఏదో ఒక ఆచారమును గురించి యితర భిక్కువులతో వివాదపడుచుండిరి. అట్లువివాదపడక భిక్కువులందరూ అన్యోన్యముగా సహనముతో సస్నేహముగా వుండవలెనని బుద్ధుడు ఎంత మందలించిననూ, వారు వినక, ఊరకనే కలహించుచుండిరి. ఏ ఆచార లోపమునుగురించి వారు తమలో తాము తగాయిదా పడుచుండిరో, దానికంటె విద్వేషము కలహామూ కడు నీచములని బుద్ధుడెంత చెప్పి

చూచినను, లాభము లేక పోయినది. అదిచూచి బుద్ధుడు ఒకనాడు కోసాంబిని విడిచి, తానొక్కడే వయనమై పోయెను. తథాగతుడు లేకుండుటయు, భిక్కులు మితిమీరి పోట్లాడుకొనుటయు చూచి, కోసాంబీప్రజలు అసంతుష్టులై వారికి భిక్షపెట్టుట మానుకొనిరి. అది చూచి భిక్కువులు అతి త్వరగా తమ తప్పిదాన్ని తెలిసికొని, తమలో తాము సఖ్యతపడిరి. వారిలో వారికి సఖ్యతకుదరగా, బుద్ధుడు తన చెంతకు వారిని ఎప్పటివలె రానిచ్చెను.

యువరాజై రాజదర్బారులను ఎరిగినవాడు కనక, బుద్ధుడు, రారాజులు, మహాపండితులు, మహారథులుగల సభలలో సైతము, అతి సహజంగా, అతి చతురతతో, సంభాషించుచు, విన్నవారి నందరినీ ఆనందపరచుచుండెను. సామాన్యులలో కూడ అంత సహజముగాను, అంత హృదయంగమంగాను మాటలాడు చుండెను. రైతులకు, కంచర్లను, చక్రకారులను, రథకారులను, కమ్మరులను, కుమ్మరులను, చాకళ్ళను, మంగళ్ళను కలుసుకొన్నపుడు, ఎవరికి ఏ రీతిగ చెప్పడము సులభమో ఆ రీతిని అనుసరించుచు, ఎవరికి బోధపడుభాషలో వారికి చెప్పుచు, జ్ఞానవంతులను చేయుచుండెను.

# 14

ఒకనాడు బుద్ధుడు ఒక జిల్లాలో పర్యటించు చుండగా చుట్టూ ఎటు చూచినసూ నేత్రానందమును కలిగించు పరిచేలు కనిపించెను, ఒక రైతు తనపొలములో పనిచేసుకొనుచుండగా,

అతనితో మాట్లాడవలెనని బుద్ధుడు అక్కడ ఆగెను. అతని పశువులను గూర్చియు, దున్నడం, విత్తనాలు జల్లడం మొదలైన వ్యవసాయపు పనులను గురించియు, అతనితో సంభాషించెను. అతని వరిచేనుచూసి "ఈ ఏడు ఎంతపండునని నీ అంచనా" అని ప్రశ్నించి "నేను కూడ వ్యవసాయదారుడనే. నా పొలాలను పండించుటకు తగిన విత్తనాలు, పరికరాలు నా కూడా వున్నాయి." అని బుద్ధుడు చెప్పెను.

రైతు: మీరా, రైతులు! ఏవీ మీ పశువులు మీ నాగలి. ఇతర పనిముట్లు ?

బుద్ధుడు: అవన్నీ నా వద్దనే వున్నాయి. అదంతా చెప్తాను. సావకాశంగా విను. బుద్ధుణ్ణవడానికి, నాకు గల తీక్షణమైన కోరికయూ, దయాళుత్వమూ, బోధితరువుకింద సంపాదించిన జ్ఞానమూ నా విత్తనాలు. ఆ విత్తనాలను నాటింపచేసి అతి ప్రశస్తంగా పెరిగేటట్లు చేసినవి, నేను బుద్ధుణ్ణయేవరకూ నేను చేసిన సత్కర్మలే. వివివేకము నా నాగలి కర్ర. నా జ్ఞానము పూజు. ఎడ్లను నడిపించే మొగలతాడేనా హృదయం.. నా శ్రద్ధయే, నాలోవున్న దుష్టత్వాన్ని విరుగదున్ని పారవేసే నక్కు. పాపాన్ని నాశనంచేసి, మంచిని పెంచే ధర్మమే, నా నాగలి పిడి. నీవు దున్నేటపుడు తుంగను గడ్డిమొక్కలను పెకలించి వేస్తావు. ఆలాగుననే చతుర్గుణ ధర్మాన్ని తెలుసుకొన్నవాడు, 'తనలో నున్న దుష్టోద్దేశాలను పెకలించివేస్తాడు. నీ పని ముగిసినతరువాత, రాత్రి సమయంలో పూజునువిప్పి, ఎడ్లనువాటి యిచ్చవచ్చిన చోటుకు పోనిస్తావు. ఆలాగుననే

వివేకవంతుడు అతి ప్రశస్తమైనదానిని పట్టుకొనివుండి, ప్రశస్తము కాని దానిని విడిచిపుచ్చును. భూములు దున్నడానికి నీ ఎడ్లు ఎక్కువగా పట్టుపట్టి కష్టపడాలి; అలాగుననే వివేకవంతుడు తన యావచ్ఛక్తినీ వినియోగించి అతికష్టపడి, తన నిర్వాణమును చేరుటకు నైజమనేటట్టి భూమిని దున్నవలసి వుంటుంది. విత్తనాలు జల్లడానికై, వ్యవసాయదారుడు తన పొలాన్ని అతి కష్టపడి తయారు చెయ్యాలి. అలాగుననే ప్రాజ్ఞుడు, జీవిత దుఃఖాలను పోగొట్టుగొనడానికి ఎక్కువ కష్టపడాలి. పొలాలను దున్ని పంటపండించే రైతు, కొన్ని సమయాలలో పంటలు నాసి అవడంవల్ల కించ పొందుచూ, ఒకప్పుడు అన్నంలేక మాడిపోవలసి వుంటుంది. కాని ఎవడైతే వివేకమనే కేదారంలో పాటుపడతాడో, తన కష్టాలకు తగిన సంపూర్ణ ఫలితాన్ని పొందుతాడు; నిర్వాణం కనుచూపు మేరలో కాన్పించే సరికి పరమానంద భరితుడగుతాడు. ఓ కర్షకా, ఈ విధాన నేను కూడా రైతునే. ఈ రీతినే నేను పాటుబడతాను.

ఇది విని ఆ రైతు బిడ్డ అత్యంతానందముతో, వానిని ధర్మమనే కేదారంలో పాటుబడే వ్యవసాయదారునిగ గైకొనుమని ప్రార్థించెను. బుద్ధుడందుల కొప్పుకొన్నాడు. ఆ నాటి నుండియు ఆ కర్షకుడు తథాగతుని అనుచరుడయ్యెను.

ఒక మాటు ఒక సామాన్య పౌరుడు బుద్ధుని దగ్గరకు పోయి, సామాన్యులేవిధమున నిర్వాణమును చెందగలరో ఆ మార్గాన్ని తెలియజెప్పుమని కోరెను. బుద్ధుడు అందుల కీ విధముగ జవాబిచ్చెను:

“బుద్ధి హీనుల సాంగత్యమును విడనాడుము; వివేక వంతుల సహవాసమును సంపాదింపుము. గౌరవనీయులను గౌరవించుము. నీ శక్తికి తగిన పనిని చేయుము. ఎల్లప్పుడును పుణ్యావంతములైన పనులను చేయుచుండుము. నీ ఆచరణము పరమ ప్రశస్తమైనదై యుండేటట్లు నీవు నిరంతరము ప్రయత్నించుచుండవలెను. జ్ఞానాన్ని ఇచ్చే ప్రతి విషయాన్ని వినటంలోను ప్రతివస్తువును చూడ్డంలోను సంతోషంపొందు. పాపకరము కాని ప్రతి విషయం గూర్చి తెలుసుకో, ఏ విషయము వర్జింపవగునో అది తెలుసుకో. ఏది సత్యమైనదో, ఏది ప్రియమైనదో, ఏది లాభకరమైనదో దాన్నే నోట పల్కుము. తల్లిదండ్రులయందు దయ కలిగియుండి, వారిని పోషించుకొనుము. భార్యను, పిల్లలను ప్రేమించి వారిని కాపాడుకొనుము. పాపహేతువైన లోభనాన్ని అడ్డుకో. దానం చెయ్యి. సదాచార నియమాలను పాటింపుము. బంధువులు, స్నేహితులు కష్టాలపాలయి, సాయం పొందే అవస్థలో వున్నప్పుడు వారికి సాయం చెయ్యి. సత్పురుషధర్మానికి విరుద్ధమైన ఏపనీ చేయకు. అవకాశం దొరికినపుడు పుణ్య కార్యాలను చేయడంలో ఆలస్యం చేయకుము. అందరిని గౌరవింపుము. వినయ సంపన్నుడవైయుండుము. అతి త్వరితముగ తృప్తి చెందుచుండుము. నీకు దయచూపువారి సద్భావాన్ని ఒప్పుకొంటూ, వారియందు కృతజ్ఞుడవైయుండుము. యుక్తమైన కాలములో, ధర్మబోధను చెవి యొగ్గి వినుము. సహనమును చూపుచుండుము. పుణ్యాత్ములను తరుచుగా దర్శిస్తూ వుండుము. ధార్మిక విషయాలను గురించి వారితో సంభాషించుచుండుము. లాభదాయక

ముగు సద్గోష్ఠిలో పాల్గొని సంతోషించు. పుణ్యాచరణమును అలవాటు చేసుకో, చతుర్గుణ సత్యాలను మనస్సులో నిక్షేపించుకో. మనోదృష్టియందు సదా నిర్వాణ పరమార్థాన్ని లగ్నపరచుకో. ఎన్ని కష్టాలు వచ్చినా కృంగిపోక నిర్భయముగా, నిశ్చలంగా ప్రసన్నుడవై యుండుము.

ఈ పరమోత్కృష్ట నియమాలను పాటించేవాడెన్నడును, పాపమునకు లోనుకాడు. నిత్యప్రసన్నుడై యుండును.

ఒకమారు బుద్ధుడు ఒక గ్రామములో విశ్రమించుచుండ, ఆయూరువారు ఆతని చెంతకుపోయి "ఓ పూజ్యా! నీవు గొప్ప మతప్రచారకుడవని మాకు తెలియదా? నీవలెనే సంసారాన్ని విడిచి సన్యసించిన నీశిష్యులకు,ధర్మాన్ని బోధించావని మాకు తెలుసును; కాని మేము సన్యాసులంకాము. మేము సామాన్యప్రజలము; భార్యాబిడ్డలను ప్రేమించుకొంటాము. పశుపాలనవల్లనూ, వ్యవసాయంవల్లనూ జీవనోపాధిని సంపాదించుకొంటాము; మా స్వల్పావకాశంలో ఉండే అమాయక కులాసాలను అనుభవిస్తుంటాము. వెండి బంగారాలను వాడుకుంటాము. పండుగలలోను వర్షములలోను, ఆభరణాలతోను, పువ్వులతోను అలంకరించుకోడానికి ఉబలాట పడతాము. సువాసన ద్రవ్యాలను, తైలములను మా దేహాలను పూసుకొని మంచివాసన వేసేటట్లు చేసికొని ఆనందిస్తాము. ప్రపంచసరణిననుసరించి పోతాము. ఓ పూజ్యా! ఇహపరముల ఆనందంతో జీవించే విధానాన్ని మాకు తెల్పుము అట్టి బోధను విని మేము తరించెదము" అని అభ్యర్థించిరి.

బుద్ధుడు : ఓ గ్రామవాసులారా! నా వంటి ఆచార్యుడు భిక్షువులకాని గృహస్థులకు బోధింపవలసినవి చతుర్ధ తత్త్వాలు. అవి నేను చెప్పెదను; సావకాశముతో వినండి.

మొదటిది : జీవనోపాధిని సంపాదించడానికై ఏ వృత్తి నవలంబించినను ఆ వృత్తిలో సామర్థ్యాన్ని సంపాదించాలి. నీవు కర్షకుడవైతే, గొప్ప నేర్పుతో నీపొలాలు పండించ గలిగినంత పండించాలి. నీవు వ్యాపారస్థుడవైతే, అతి జాగ్రత్తగా మెలిగి చాకచక్యంతో వ్యాపారం నడిపించాలి. నీవు నౌఖరీలో చేరితే అతి నమ్మకమైన బంటువు కావాలి. చేసేది ఏమైననుసరే, నిరంతరము కృషి సల్పుచు, కష్టపడి పాటుపడుచుండాలి. ఈ విధాన ఆచరిస్తే సిరిసంపదలను ఆర్జించి, సహాయమవసరమున్న వారికి సాయముచేసి దాన్ని సద్వినియోగం చేయగలుగుదువు. కష్టపడి ధనమును ఆర్జించకపోయిన యెడల ఇతరులకు సాయం చేయడంగాని, సత్కార్యాలను చేయలేవు. అట్టివి చెయ్యడానికి నీ కవకాశం ఉండదు.

రెండవది : సంపాదించిన ధనాన్ని జాగ్రత్త పెడుతూ, దానిని దుర్వినియోగం చెయ్యకూడదు. కన్నమున్న కుండలో నీళ్ళుపోస్తే, అది దానంతట అదే బయటకుకారిపోయి నిరర్థకమవుతుంది, ధనమార్జించడం ఎంత మంచిదో అది వ్యర్థమున్నూ దుర్వినియోగమున్నూ కాకుండా చూడడం అంత ముఖ్యం.

మూడవది : సంసారంలో ఉన్నవాళ్లు సత్పురుషులతో మాత్రమే సహవాసం చెయ్యాలి; వారినే మిత్రులుగా చేసుకోవాలి. ఎవరితో స్నేహం చేస్తే. వారిగుణాలే తరుచుగా

అబ్బుతాయి. సాధుసమాగము చేసేవానికి, సాధుపగుటకు ఎక్కువ అవకాశాలుంటాయి దుష్టసాహవాసం చేస్తే, దుష్టుడవడానికేఅధికావకాశం ఉంటుంది. నల్లని మసిగలవస్తువులను ముట్టుకుంటే చెయ్యి నల్లగా అవక తప్పదు. అందుకయిసంసారంలో వుండేవాళ్ళు వివేకులు, సదసత్ జ్ఞానంకల వాళ్ళతోనూ, మంచియందు నమ్మకం కలవాళ్ళతోనూ సహవాసంచేస్తూవుండాలి; అపుడు వాడుకూడా సత్పురుషుడు, వివేకి, ఉదారస్వభావుడు, మంచియందు నమ్మకం గలవాడు అగుట కెక్కువ అవకాశం వుంటుంది.

నాల్గవది: అతిని, విసర్జిస్తూ, సక్రమంగా మితితప్పకుండా నియతవృత్తితో జీవించాలి. అధిక వ్యయమును, దూబరా ఖర్చులు కాని చేయకూడదు. రాబడినిమించి ఖర్చు వెచ్చములను చేయకూడదు. అలాగుచేస్తే వచ్చేనీరుకంటె పోయే నీరే ఎక్కువగా వుండే చెరువులాగ మనిషి తయారవుతాడు. రాబడినిమించి ఖర్చుచేస్తే, వచ్చి లోపలబడేనీరుకంటె వదుములుగుండా పోయేనీరు ఎక్కువగా వుండే చెరువువలె అవుతాడు. అట్టి చెరువు కొద్దికాలంలోనే నీరులేక ఎండిపోతుంది. రాబడికంటె ఎక్కువగా ఖర్చుచేసేవాడు నిర్ధనుడయి, దరిద్రుడగును కాని సంసారి తన మీదను తన కుటుంబముమీదనూ, దాన ధర్మాల్లోను రాబడికంటె కొంచెము తక్కువగా వెచ్చిస్తే అతని సంపద అనే తటాకము నిర్జలముకాదు. ఎప్పుడూ కొంత నీరు, అనగా కొంత ధనము మిగిలివుంటుంది. హఠాత్తుగా అనుకోని ఖర్చు తటస్థిస్తే అలాగపెట్టడానికి అతనికి అవకాశము ఉంటుంది. ఆలాగునని, తన సంపదను సంపూర్ణంగా వినియో-

గించకూడదని కాదు. ఊరికే ధనాన్ని కూడబెట్టి దానిని వినియోగించకుండా లోభివలె దాచుకోవాలని నేను చెప్పడం లేదు. తన తోటలోని చెట్టున పండిన ఫలాలను తినక వాటిని పెట్టి దాచుకొనే వ్యక్తివలె, లోభి తన సంపదను అనుభవించ లేడు. అలాంటివాడు పళ్ళన్నీ కుళ్ళిపోయి, తినడానికి పనికిరావని తెలుసుకుంటాడు.

ఓయీ, గృహమేధులారా! ఈ చతుర్గుణ ధర్మమును అనుసరిస్తే, మీకు మంచి చేకూరుతుంది; జయము కలుగుతుంది. భావిలో కూడా మీకు మంచిని కలుగజేసే, ఆ నాలుగు ధర్మాలూ ఇవి: (1) మంచి చేస్తే మంచి సంభవిస్తుంది. చెడుగుచేస్తే చెడుగు కలుగుతుంది. దీనిపై మీకు విశ్వాసం వుండవలెను. (2) సత్కార్యాలను నిరంతరమూ చేయుటయు, వధ, తస్కరణము, అసత్యవాదము, వ్యభిచారము, సురాపానమువంటి చెడ్డపనులను చేయక వుండుట (3) సంసార విషయములయందు, అమితమైన కాపీనము వుండకుండా, దానధర్మాలను చేయడం. (4) నిర్వాణమునకు దారిచూపే మార్గాన్ని తెలిసికొని దానిని అవలంబించడానికై తగిన వివేకాన్ని సంపాదించుకొనడం."

ఈ బోధను భిక్కులుకాని సంసారులమంచికై బుద్ధుడు కావించాడు. ఒకమారు, అజాతశత్రు అనే మహారాజునకు తథాగతుడు ఒక ఉద్బోధను చేశాడు. అజాతశత్రుడు మంచి వాడు కాడు; దుష్టుడు ఇతను తన తండ్రి అయిన బింబిసార మహారాజును, రాజ్యలోభంవల్ల ఖైదుచేసి అన్నం పెట్టక

చంపివేశాడు. సిద్ధార్థుడు బుద్ధుడైన మొదటిరోజులలో, బింబిసారుడు ఆయనకు మిత్రుడయ్యెనుకదా!

ఒక పౌర్ణమినాడు, అజాతశత్రుమహారాజు, తన ప్రాసాదపు అందలముపై కూర్చొనివుండెను. సత్చికిత్సకుడు జీవనుడు సమర్పించిన వనములో బుద్ధుడు శిష్యులతో బసచేసివుండెను. అచివిని బుద్ధుని దర్శించిరావలెనని అజాతశత్రుడు ఏమిూతో చక అక్కడకు బయలుదేరివెళ్ళెను. ఆ వనములోని ధర్మోపన్యాస శాలలో బుద్ధుడు బౌద్ధభిక్కులమధ్య ప్రసన్నుడై మౌనముగా కూర్చొనివుండెను. తథాగతుడును అజాతశత్రుడును అన్యోన్య గౌరవములను చూపుకొనిరి. తనను బుద్ధుడు కుశలప్రశ్నలడిగిన పిదప అజాతశత్రు మహారాజు ఒకచోట కూర్చొని యిట్లు శంక చేసెను. "సంసారమును పరిత్యజించి సన్యాసియై జీవించుటలో ఏమి లాభమున్నది? అనేకమంది ఇతర మతాచార్యులను యీ ప్రశ్న నేఅడిగితిని కాని వారెవ్వరునూ సమమైన సమాధానమును ఇవ్వలేకపోయిరి. పనసపండు గురించి అడిగితే మామిడిపండును గురించి చెప్పినట్లుండేవి, వారి సమాధానాలు. పూజ్యా! ఈ నా, ప్రశ్నకు తమ జవాబును విన కుతూహల పడుచున్నాను"

ఇటూ అటూ కొంత చర్చ జరిగిన తరువాత, బుద్ధుడు, ఇహపరములలో కూడా భిక్కువగుటవలన సంభవించే మంచి గురించి విపులంగా ఉపన్యసించాడు. తథాగతుని ప్రత్యుత్తరములు యథార్థములైననవనియు, తన ప్రశ్నకు అవి సరియైన సమాధానములనియు అజాతశత్రుడు గ్రహించుకొన్నాడు. యథార్థంగా భిక్కువుకాగలిగి, బుద్ధునివంటి మహాచార్యుని

అనుసరించ గలిగినచో గలుగు మంచిని మించునది లేదనియు, అప్పటినుండి తాను బౌద్ధమతావలంబకుడనైనాననియు, అజాతశత్రుడు బుద్ధునికి విన్నవించి శెలవుగైకొని వెళ్ళిపోయెను.

మహారాజు నిష్క్రమించిన పిదప, బుద్ధుడు "ఓ భిక్షులారా! నేనుపన్యసిస్తూంటే ఈ మహారాజు మనస్సు కరిగి పోయింది. ఈతడు తన ధర్మాత్ముడైన తండ్రిని చంపకుండా యుండియుంటే, తాను కూర్చున్నచోటులోనే తత్త్వాన్ని నిర్మలంగా తెలిసికొని, రాజ్యపీఠాన్ని, సంసారాన్ని విడిచి భిక్షువై అర్హనుడైయుండియుండును" అని చెప్పెను.

ఒకడొకమాటు బుద్ధుని "బిచ్చముకింద ఇవ్వదగిన అతి ప్రశస్తమైన వస్తువేది? అతిరుచికరమైన పదార్థమేద్ది? ఏది ఎక్కువ సంతోషాన్ని కలుగజేస్తుంది? కామరాగాలను అణగద్రొక్కే వానిలో ఏది అతిప్రశస్తమైనది?" అని ప్రశ్నింప వాని ప్రశ్నలు నాల్గింటికినీ ఒక్కమాటలో సమాధానము నిచ్చెను. అది "ధర్మము"

అది సమంగాబోధపడలేదు, కావున కొంచము విపులంగా వివరించమని అతను ప్రార్థించాడు. అప్పుడు బుద్ధుడీ క్రిందివిధమున చెప్పెను. "బిచ్చమిచ్చుట మంచిపనియేగాని, అది ఒక్కటే మోక్షమార్గానికి గొంపోవదు; ఒక్క ధర్మమే అది చేయగలదు. ఇతరులకు ధర్మమును శ్రమపడి బోధించుటయే, ధర్మబోధ. దానము అన్నిటిలోను బహుప్రశస్తమైనది.

"ధర్మజ్ఞానమును సంపాదించడంవల్ల, మనస్సు ఆనందపూరితమయి; ఆ తీపితో తన్మయత్వమును చెందును; ఏలయన

దుఃఖమును కలిగించే రాగకామాలను నాశనంచేసి, అన్ని దుఃఖాలను అంతరింపజేసే పరమనిర్వాణావస్థకు అది గొంపోవును. రాగకామాలను అంతరింపజేయునది అతి దివ్యానిదీ అతిరమ్యమైనదీ ధర్మమే. ఓ శిష్యులారా, మానవకోటికి ధర్మబోధ చెయ్యండి. చేయగలిగిన దానములన్నిటిలోనూ దీనిని మించినది మరిలేదు!"

# 15

ఒకనాడొక గ్రామములో బుద్ధుడు విశ్రమించి, అచట ఒక ధర్మోపన్యాసమును చేయ బయలువెడలెను. అచటకు దగ్గరిగా ఒకబీద బ్రాహ్మణ వ్యవసాయదారుడు ఆ ధర్మ ప్రబోధాన్ని విన కుతూహలపడియుండెను. ఉపన్యాస దినమున ఉదయమున లేవగానే, బ్రాహ్మణునికి తనయెడ్లలో ఒకటి కనిపించ లేదని తెలియవచ్చెను. ఇంకొక ఎద్దును కొనుక్కొనుటకు అవకాశములేని ఆ బీదబ్రాహ్మణుడు, చుట్టుప్రక్కలనున్న అడవిలో దాన్ని వెదకిపట్టుకోవచ్చునని బుద్ధోపన్యాసము ప్రారంభము కాకమునుపే అచటకు చేరుకోడానికి వీలుండునని అనుకొనెను.

కాని ఆ ఎద్దు త్వరగా దొరకలేదు. వెదికి, వెదికి ఆ బ్రాహ్మణుడు ఇంటికిచేరుకొనేసరికి మధ్యాహ్నమయింది. వెదకడంలో అక్కడక్కడ తిరిగి అలసిపోయి, ఆకలితో అతను బాధపడుచుండెను. కాని, తథాగతుని అమృతవాక్కుల

వినుటకు అత్యంతమూ కుతూహలపడుచుండిన ఆ బ్రాహ్మణుడు భోజనముచేయకుండా, కొంచమైన విశ్రమించకుండా ఉపన్యాసస్థలానికిపోయెను. అప్పటికప్పుడే ఉపన్యాసము అంతమగునన్న భయముతోవున్న ఆ బ్రాహ్మణుడు అచటకు చేరుకొనుసరికి, తథాగతుడు ప్రశాంతంగా భిక్కువుల గ్రామవాసుల మధ్యను కూర్చునియుండెను. ఏదో ఒకమూలను జాగాకై చూస్తూ, ద్వారమునుదాటి లోనికి ప్రవేశించేసరికి, "ఏమైన తింటివా" అని బుద్ధుడాతనిని ప్రశ్నించెను. బ్రాహ్మణుడు జరిగిన దాన్నంతా తెలిపెను. అదివిని తనదగ్గిర కూర్చొనియుండిన శిష్యునొకని ఆ బ్రాహ్మణునకన్నముపెట్టుమని భోజనమునుఆదేశించి పూర్తిచేయువరకునూ ఉపన్యాసమును ప్రారంభింపనని చెప్పెను. బ్రాహ్మణుడు భోజనమునుచేసి బుద్ధుని చెంతనుచేరి కూర్చొనినపిదప తథాగతుడు ఉపన్యసింప ప్రారంభించెను. బ్రాహ్మణుడు మాత్రము, బుద్ధుడు తనకొరకే ఉపన్యాసమును ప్రారంభింపక తన రాకకై వేచియుండెనని యోచించెను. కాని అక్కడ చేరిన గ్రామవాసులును, భిక్కువులునుకూడా, భగవానుడు ఒక్క గృహస్థుడు, తత్రాపి బౌద్ధుడుకాని బ్రాహ్మణుని భోజనము గురించి అంతగా ఔత్సుక్యాన్ని కనపరుచుట అసమంజసమని గుసగుసలాడిరి. ఆ బ్రాహ్మణుడుమాత్రం బుద్ధుని కృపాళుత్వానికి మెచ్చుకొని, అతిశ్రద్ధతో అతని ఉపన్యాసమును విని, వాని ధమ్మప్రబోధంలోవున్న యాథార్థ్యాన్ని తెలిసికొని, బుద్ధుని శిష్యుడై, జన్మాంతమువరకూ బౌద్ధుడైయుండెను.

ఇంకొకమారు, ఒకపురముదగ్గిర బుద్ధుడు విశ్రమించుచుండెను. ఆఊళ్ళో ఒక సాలివాడుండెను. అతనికి

ఒక్కర్తే కూతురు. ఆపిల్లయే సాలివానికి పనిలో సాయం చేస్తూ వుండేది. ఈపిల్ల బుద్ధోపన్యాసాన్ని విన, బహు కుతూహలపడుచుండెను. ఇంతలో ఆసాలివాడు ఉపన్యాసదినాన్నే, తానునిత్యం నేసిబట్టలనిచ్చే పెద్దగృహస్థునికి నేస్తూయుండిన ఒక గొప్పబట్టను నేతముగించి యీయవలసియుండెను. ఆ పిల్ల తాను చేయవలసినపని తొందరగా ముగించి, బుద్ధోపన్యాసాన్ని వినుటకు పోవలెనని నిశ్చయించుకొని, దారాన్ని బుడతకింద చుట్టి తండ్రికి అది నేయుటకు ఇవ్వాలని పోవుచుండెను. తోవలో ప్రజలందరు నిశ్శబ్దంగా తథాగతుని రత్నాల పలుకులను వినుటకు కూర్చుని యుండుట చూచి, అచట వారిలో చిట్టచివరను కూర్చునియుండెను. బుద్ధుడు ఆ బాలిక ఆందోళనాన్ని చూచి, ముందునకు రమ్మని పిలిచెను. బాలికయు ముందుకు వచ్చి కూర్చొనెను. ఆ పిల్లకు ధైర్యమిచ్చుటకై, ఎక్కడనుండి వచ్చుచుంటివని, ఎచటకు బోవుచుంటివని బుద్ధుడు ప్రశ్నించెను. తాను వచ్చుచుండిన స్థలమును, బోవుచుండిన స్థలమును తనకు తెలియవని జెప్పుచు, ఆ పిల్ల "ఓ పూజ్యా! నేను వచ్చిన స్థలముగాని, నే పోవుచున్న స్థలముగాని నా కేమీ తెలియవు" అని పలికెను. అక్కడివారు, అది విని ఆ చిన్నదిబుద్ధునితో వేళాకోళము లాడుచున్నదని కుపితులై, ఆమెను ఆ గదిలోనుండి బయటకు నెట్టివేయడానికి గుసగుసలాడ ప్రారంభించిరి. బుద్ధుడు వారిని చప్పుడు చేయవద్దని వారించి, ఆ బాలికను తన వచనముల కర్థమును స్పష్టపరుపమని కోరెను. అందుల కామె "నా తండ్రి యింటి నుండి

వచ్చుచున్నాననియు; నేత శాలకు పోవుచున్నాననియు నాకు తెలుసును. కాని యేజన్మలోనుండి యీ జన్మలోనికి వచ్చితినో నాకు సుతరామూ తెలీదు. ఈ జన్మ తరువాత వచ్చుజన్మగురించి నాకేమీ తెలియదు. వాటిని గురించి ఏమియూ తెలిసికో లేకుండా వున్నాను" అని తన వచనముల అర్థమును విశదీక రించెను. అది విని బుద్ధుడును, అచటి సభాసదులునుకూడ, ఆ బాలికయొక్క వివేకమును, విజ్ఞానమును కొనియాడిరి: బుద్ధుడు ఉపన్యాసముముగించేసెను. అదిముగిసిన పిదప ఆ తెలివిగలబాలిక, నిర్వాణమునకు నిశ్చయముగ గొంపోవు ప్రవాహములో ప్రవేశమును గావించెను. అట్టి ప్రవేశము గావించినవానిని "స్రోతాపన్నుడు" అని అంటారు.

ఒకనాడు బుద్ధుడు అడవిలోనుంచి నడిచివెడుతూండగా ఒక వేటకాని ఉరిలో తగులుకొని గిజగిజకొట్టుకుంటున్న ఒక జింక, ఆయనకి కనిపించినది. కనిపించిన వెంటనే, బుద్ధుడా జింకను ఉరినుంచి తప్పించగా, అది ఛంగు ఛంగున అడవి లోకి పారిపోయెను అక్కడికి దగ్గరలోవున్న ఒక చెట్టుకింద తథాగతుడు విశ్రమించుచుండెను. కొంతసేపటికి ఆ వేటగాడు అచటకు చేరి, తాను పెట్టిన జాలములో జింక వొకటి పట్టు వడెననియు, ఎవరోదాన్ని విడిచిపుచ్చిరనియు తెలిసికొని, ఆలా గున చేసినవారెవరాఅని అటు ఇటుచూడ, దగ్గరలో చెట్టుకింద విశ్రమించుచున్న కాషాయవస్త్రధారిఅగు ఒక సన్యాసిఅతనికికని పించెను ఆతడే ఆ జింకను తప్పించిన ఆసామి కాబోలునని అనుకొని అతి కుపితుడై "న్యాయమైన వృత్తిచేసికొని జీవితం వెళ్ళబుచ్చుకొనే వారి పనుంచు, తమ సత్కార్యాలవల్ల చెడ

గొడుతూ, అన్ని చోట్లాదూరే, యీ మనుషులు పెరిగిపోతు
న్నారని" లోలోపల విసుక్కొని "అట్టివారి సంఖ్య పెరగ
రాదు; ఒకడు చచ్చినమా మంచిదే" అని నిర్ణయించుకొని ఆ
వేటగాడు తన విల్లును ఎక్కుపెట్టి బాణమును విడిచెను. బాణ
విమోచనములో అతని చేయి వణకింది. ఇదంతా చూస్తూ
అతి ప్రసన్నుడై నిశ్చలంగా ఆసీనుడైవున్న బుద్ధునికా బాణం
తగలలేదు. ఇదివరకు ఎన్నడూ, అంతదగ్గరలోవున్న వస్తువును
కొట్టేటపుడు గురితప్పని ఆ వేటగాడు మరీకుపితుడై యింకొక
బాణమును వదలెను. అదియునూ బుద్ధుని తాకలేక పోయినది.
ఆ వేటగాడు ఉడుకుబోతుతనం పట్టలేక, మరొక బాణమును
గురి చూచివేసెను. కాని లాభము లేకుండెను. ఈ విధముగా
అతను బాణప్రయోగములో మూడు పర్యాయములు విఫ
లుడై, భయకంపితుడై, ధనుర్బాణములను పారవేసి, బుద్ధుని
వద్దకు వెళ్ళి అతి వినయముతో మ్రొక్కి "తామెవరో తెలియ
చెప్పమని" ప్రార్థించెను.

బుద్ధుడు ప్రాణహింసచేయుట పాపమనిన్నీ, ప్రాణము
లను తీయుట బహు సులభముకాని, తీసివేసినప్రాణాలను తిరిగి
యిచ్చుటకు వీలులేదనీ అతనికి అతి మృదువుగా చెప్పెను.
బుద్ధుని గాంభీర్య సౌశీల్యరూపురేఖా విలాసాదులను చూచి
ఆయన మహార్థవంతములగు వాక్యములను విని ఆ వేటగాడు
బుద్ధాదేశానుసారము అప్పటినుంచి నడుచుకొంటాననియూ,
ఇంకో వృత్తివలన, జీవనోపాధిని సంపాదించుకొనగలననియూ
వాగ్దానం చేసెను.

ఇటులనే హింసచేయువాడింకొకడు వుండేవాడు. వాడు జంతువులను కాక, మనుష్యులనే ఖూనీచేయుచు, ఆ హత్య కావించబడిన వ్యక్తి వ్రేలును కోసి, వాటినిమాలగా ధరించే వాడు. అప్పటికతను తొంభైతొమ్మిదిమందిని చంపెను. నూరవవానిని చంపి అతని వేలును తన కంఠమాలలో గ్రుచ్చుట ఎప్పుడెప్పుడా అని తొందరపడుచుండెను. ఈ వింత మనిషి పేరు అంగుళిమాలుడు. ఒకనాడీ నరహంతకుడు ఒక బాట ప్రక్క కాచుకొని వుండగా, బుద్ధుడు ఆ దారిని పోవు చుండెను. ఆ బాటసారి ఎవరో అంగుళిమాలునకు తెలియదు. అతనిని ఎవడో సామాన్య సన్యాసి అనుకొని ఆతనిని చంపి వ్రేలుకోసి, తనమాలను పూర్తిచేయడానికి అంగుళిమాలుడు నిశ్చయించుకొనెను

ఇదివరకు వేటగానివలె, అంగుళిమాలుడునూ బుద్ధునిపై ధనుస్సును సంధించి మూడుసార్లు బాణప్రయోగం చేసెను గాని, ఆ బాణములు తథాగతుని అంటలేదు. అందుకు అచ్చె రువు చెంది ఆ నరహంతకుడు బుద్ధునివద్దకు పోయి పలకరిం చెను. తనను చంపడానికై యింతప్రయత్నము చేసినను, బుద్ధుడు అంగుళిమాలుని ఏమీ అనక ధమ్మమును గురించి వానికి ఉపదేశించెను. బౌద్ధసిద్ధాంతమును విని అతడు పరివర్త నము చెంది తాను అనేకమంది నరులను చంపితిననియు, ఎంతో పాపం చేసినాననియు, ఒప్పుకొని పశ్చాత్తాపపడి, భిక్కుపగు టకు అనుజ్ఞ యీయమని తథాగతుని వేడుకొనెను. బుద్ధుడు అందుకు అంగీకరింపగా, అతిశ్రద్ధతో అంగుళిమాలుడు, బౌద్ధ ధమ్మమును ఆచరించుచు కొద్దికాలంలోనే అర్హనుడయ్యెను.

ఇటుల అర్హానుడైనను, ఆతనికి పూర్వదుష్కృతము లను అనుభవింపక తప్పినదికాదు. ఆతడొకనాడు సావత్థీపురము లోనికి భిక్షాటనమునకై పోవ, అచటిప్రజలు వాడు పూర్వాశ్ర మంలోచేసిన ఘోరకృత్యాలకై రాళ్ళతోకొట్టి చంపిరి. ప్రజలు తన్నుకొట్టినందులకు అతను కోపము జెందలేదు. చావు వచ్చినందులకు, వగవనూలేదు. తానుచేసిన పాపాలను బాగా గుర్తెరిగినవాడు కావున, త్వరలోనే, ఈ జన్మలోనే వాని ఫలాన్ని జన్మపరంపరలలోకాకుండా అనుభవించి రద్దుబరచు కొనుటయే మంచిదని గుర్తెరింగి ప్రసన్నతతోను, ప్రశాంతం గాను ఆతడు మరణించి, నిర్వాణమును పొందెను.

# 16

ఆనందుడు బుద్ధుని బంధువు. శిష్యు లందరిలోను, ఆనందుని, బుద్ధుడు మిక్కిలి ప్రేమించుచుండెను. ఆనందునికి బుద్ధుని యందు అమితమైన భక్తి, ఏబదియైదేళ్ళ వయస్సు దాటినతరవాత, బుద్ధుడు వయోభారాన్ని తగ్గించుకోడానికై, ఆనందుని తన పరిచారకునిగా నియమించి అతని ద్వారానే, భిక్కువుల కీయవలసిన ఆజ్ఞలను యిచ్చుచుండెను. భిక్కువులు కూడ బుద్ధుని ఏ విషయంగురించి అయినా తెలుసుకోదలచి నపుడు, అతని దర్శనమును ఆనందునిద్వారానే అర్థిస్తూవుండిరి. ఏదైనా కోర్కెలను బుద్ధుని అడిగి తీర్చుకోవలసివచ్చినపుడు, వాటిని ఆనందునిద్వారా బుద్ధునికి తెలిపి, ఆయన అనుజ్ఞను పొందుచుండిరి.

బుద్ధునికి యింకొక బంధువుండేవాడు. అతడున్నూ బుద్ధుని శిష్యుడై భిక్షువై వుండెను. ఆనందునివలెకాక. ఇతడు బుద్ధునియందు అసూయ మాత్సర్యములను కలిగివుంటూ, బుద్ధుని చుట్టునూ ఏర్పడిన భిక్షు సంఘాన్ని నాశనం చేసే ఉద్దేశ్యంతో ఎత్తులు వేయుచుండెను. ఇతని పేరు దేవదత్తుడు. తాను కపిలవస్తు రాజకుటుంబీకుడినని విర్రవీగుతూ అతి గర్విష్ఠియై వుండెను. ఇంతలో సామాన్య కుటుంబములలో పుట్టిన సారీపుత్ర, మొగ్గల్లానులు బౌద్ధ సంఘాన్ని చేరిరి. వారి పాండిత్యానికిన్నీ, జ్ఞానానికిన్నీ సచ్చరిత్రకున్నూ, ఆశ్చర్యపడుతూ, భిక్షువులు వారిని అమిత గౌరవంతో చూచేవారు. బుద్ధునికి సారీపుత్ర, మొగ్గల్లానులు ఇద్దరునూ కుడిఎడమ భుజములవంటి వారని అంటూ పూజ్యభావంతో అందరూ మెలగెడివారు. ఈ సామాన్య కుటుంబోద్భవులకు యింతటి గౌరవ ప్రతిపత్తి ఎందుకు కలగవలెనని, రాజకుటుంబీకుడైన దేవదత్తుడు యీర్ష్యపడేవాడు; అసూయయూ మాత్సర్యమున్నూ అతని హృదయమును సదా వేధించుచుండెడివి.

అందరూ తనను త్రోసిపుచ్చి క్రొత్తగా సంఘములో చేరిన సారీపుత్ర, మొగ్గల్లానులపై అమితమైన పూజాభావం చూపించుచున్నందులకు అతను అలిగి పట్టరాని కోపముతో బుద్ధునీ ఆయనను అనుసరించి వుండే సంఘుసాంగత్యాన్నీ విడిచి వెళ్ళిపోయాడు. మగధ రాజ్యాధీశ్వరుడైన బింబిసారమహారాజు పుత్రుడును, యువరాజును అయిన అజాతశత్రుని స్నేహం సంపాదించడానికై రాజగృహనమునకు చేరుకొన్నాడు. అక్కడ అతి ప్రసన్న గాంభీర్యాదులను ప్రదర్శించి, ప్రపంచమును తెలి

యని అజాత శత్రుని మనస్సును ఆకర్షించగలిగాడు. "ఇతను ఎంతో ప్రసన్నముగా గంభీరముగా ఉన్నాడు. గొప్ప భిక్షువై యుండును." అనుకొని పట్టణమునకు దగ్గరగా అతని కోసమై ఒక రమ్య విహారాన్ని కట్టించి అజాతశత్రుడు వానికి దానిని సమర్పించెను. అప్పటినుంచి దేవదత్తుడు వాని అనువర్తియై యుండెను.

ఇట్లు కాలముగడుచుచున్నది. బుద్ధుడు ఒకమాటు తన శిష్యబృందముతో రాజగృహనమునకు వచ్చెను. బుద్ధుని భిక్షుసంఘమునకు వేరుగ యింకొక సంఘాన్ని స్థాపించడానికై తనకు అనుజ్ఞయీయమని దేవదత్తుడు, తథాగతుని కోరెను. కాని సంఘములో యిట్టిచీలికలు కలగడానికి బుద్ధుడు అంగీకరించలేదు. వేరుగ తన సంఘాన్ని స్థాపించుకొనుటకు దేవదత్తుడు అనేకసారులు, బుద్ధుని వేడెను, కాని ఆయనమాత్రం అందులకు అంగీకరించక పోయెను! దానితో నాటినుండియు, బుద్ధునియందు దేవదత్తునకు విద్వేషము, అసూయ అమితము లయ్యెను. బుద్ధుడు అంగీకరించినను, అంగీకరింపక పోయినను వేరే ఒక సంఘాన్ని స్థాపింప కృతనిశ్చయుడై దేవదత్తుడు' అజాతశత్రుని సాయమును పొందెను. కాని బింబిసార మహా రాజు, అట్టిభిన్నసంఘ నిర్మాణానికి ఒప్పక, బుద్ధుని ఉద్దేశ మునే బలపరుచుచుండెను.

దేవదత్తుడు అతిదీక్షతో, నియమనిష్ఠలను పాటించు వానివలె కనిపించుతూ, అజాతశత్రుని విశ్వాసాన్ని చూరగొన్నాడు. దేవదత్తుడు ఏమిచెప్తే అది చేయడానికి అజాత

శత్రువు సిద్ధముగవుండెను. ఈ విధాన అజాతశత్రుని లోబరుచు కొని, తండ్రినిచంపిన తానే రాజై తన యిచ్ఛవచ్చినటుల ఆచరింపవచ్చుననియు, నూతనసంఘాన్ని స్థాపింపవచ్చుననియు వానిబుద్ధికి పితృవధదురాలోచనను ఎక్కించెను. ఒక్కట్రేటున శత్రితోగాని, బాణప్రయోగమునగాని తండ్రిని చంపుటకు అజాతశత్రుడు ఒప్పుకోలేదు. అందుకై బింబిసారుని ఖైదీలలో వుంచి, అన్నముపెట్టక మెల్లగామాడ్చి చంపెను. బింబిసారుని పట్టమహిషి, కావలివారిని ఎంతప్రార్థించినను. మహారాజు బింబి సారునకు అన్నముపెట్టనివ్వరైరి. బుద్ధుడు తన ప్రబోధాన్ని ప్రారంభించిన ముప్పదియేడవయేట అజాతశత్రు పీ అమానుష కృత్యాన్ని గావించి, మగధరాజ్య సింహాసనమును అధి ష్టించెను.

దేవదత్తునకప్పటికి కావలసినంతబలం చేకూరింది. దేశ పాలకుడైనరాజు తనకు అమితభక్తిగలమిత్రుడు. తానేమి కోరిన అది చేయడానికి సంసిద్ధుడు. బుద్ధుడెక్కడుండిన అచటకుపోయి అతనిని చంపడానికై ధనుర్ధరులను అజాతశత్రునిచే ఏర్పాటు చేయించెను. ఈ డబ్బుకై ఖూనీచేసే యీ ఆతతాయిలు, బుద్ధుడున్నచోటునకు పోయిరి. అతిప్రసన్నుడై, ప్రశాంతంగా, అతి గంభీరంగా, సౌమ్యంగా బుద్ధుడు కూర్చొని యుండుట చూచి, డబ్బుకై చంపే యీ ఖూనీకోరులు తథాగతుని మూర్తినిచూచి బాణాలను వానిపై విసర్జింపలేక, వాని పాద ములను అతిభక్తితో సోకిరి. బుద్ధుడు వారలతో సంభాషింప తామే దుష్ట ఉద్దేశ్యముతో అచటకు చేరిరో, ఆ ప్రకారము చేయలేక, తథాగతునిపై బాణములను వదల చేతులాడక,

వాని దరిజేరి, పూజ్యభావముతో వాని పాదములకడ కూర్చుని యుండిరి. బుద్ధుడు వారితో సంభాషింప ప్రారంభించెను. వా రాతని మృదువచనములు మనస్సును సోక, తాము చేయ దలచుకొనిన దుష్టకార్యమునుగూర్చి చెప్పుకొని, అట్టి పాపోద్దేశ ములకై క్షమింపుమని వేడుకొనిరి. శుద్ధదయాళుడగు బుద్ధుడు వారిని వెంటనే క్షమించెను. ఆ ఆతతాయులును బుద్ధుని శిష్యులై జన్మాంతము ఉండుటకు ప్రమాణము జేసిరి.

బుద్ధుని ఖూనీచేయుటకు పంపబడ్డ ఖలులు అది చేయ కుండా బుద్ధుని శిష్యులైనారని విని, దేవదత్తుడు అతి కుపితుడై, తానే బుద్ధుని చంపుటకు నిశ్చయించుకొనెను.

బుద్ధుడు విశ్రమించుచుండిన చోటునకు దగ్గర, ఒక కొండ ఉండేది. ఆ కొండమొదటనే, బుద్ధుడు కాలినడకను షికారుచేయుచుండును. ఒకనాటి సాయం సమయమున బుద్ధుడు అచట షికారుచేయుచుండగా, బుద్ధుని చంపుట కవకాశమును వెదకుచుండిన దేవదత్తుడు, వానికంట బడకుండ కొండనెక్కి, రోడ్డుమీద నేవున్న ఒక పెద్దబండరాయికడ కూర్చొనియుం డెను. ఆ బండరాయి చుట్టునున్న మట్టిని తీసివైచి, బుద్ధుడు దానికిందకు రాగానే వానిమీద పడునట్లు ఆ రాతిని త్రోసి వేయుటకు దేవదత్తుడు సిద్ధముగానుండెను. ఇంతలో బుద్ధుడు ఆ రాతికిందకు రాగానే దేవదత్తుడు రాతిబండను కిందకుత్రోసి వైచెను. అది తిన్నగాదొర్లిన, బుద్ధునిమీద పడి వానిని పచ్చడిచేసియుండును. కాని అది దొర్లుచు ఇంకొక పెద్దరాతిపై పడి తునాతునకలయ్యెను. ఆ తునకల్లో ఒకటి బుద్ధుని కాలిపై

పడి కాలు నొప్పిచేసెను; కాని విహారమునకు తిరిగి బుద్ధుడు కాగలిగెను; చికిత్సకుడగు జీవకుడు వాని దెబ్బకు మందురాచి, కట్టుకట్టెను. మరునాటి ఉదయమునకు కాలునొప్పి మాయమయ్యెను. కాని అంతటితో దేవదత్తుడు బుద్ధునిచంపే ప్రయత్నములను విడనాడలేదు. బుద్ధుని చంపుట కింకొక్క ప్రయత్నముచేసి, అందు సంకల్పసిద్ధిని పొందిన, తానే భిక్కుసంఘమునకు ముఖ్యుడ నగుదునని అతని ఆశ.

రాజగృహములో ప్రతి ఉదయమునను బుద్ధుడు భిక్షాటనము చేయుచుండేవాడు. ఆతడు తిరుగుచుండు వీధిలో మత్తెక్కిన ఏనుగను విడిచిపుచ్చిన, అది ఆతనిమీద పడి కాళ్ళతో త్రొక్కి చంపునని దేవదత్తుని పన్నుగడ. ఆ విధముననే దేవదత్తుడు చేసెను.బిచ్చమును ఎత్తుకొనుచు గడబిడలేక ప్రసన్నతతో బుద్ధుడింటింటకు తిరుగుచుండ, ఆ వీధిలోనికి ఒక మహాగజమును తెప్పించి విడిచెను. అది ఆతనిమీద పడి పాదములతో పిప్పి చేయుటకు బదులు, మామూలు స్థితిలోనున్నట్లుండి, ఆకాషాయవస్త్రధారుని తన ప్రక్కనుండి పోనిచ్చెను.

ఈ విధాన మూడుమాట్లు బుద్ధుని చంపడానికి చేసిన అతని ప్రయత్నాలు నిష్ఫలమయ్యెను. ఇక బుద్ధుని చంపే సంకల్పాన్ని మార్చుకొన్నాడుగాని, ఏ విధాన్నైనా బౌద్ధసంఘము లోచీలిక తెచ్చుటకు నిర్ణయించుకొనెను. అందుకై తన విద్వేషాన్ని బయటకు కనపరచక, వాని మిత్రునివలెనే సంచరించుచు బుద్ధుని దర్శించి, భిక్కువులు ఇతర మతాల సన్యాసులవలె కఠిన జీవితాలను గడపిన ఎక్కువ బాగుండు

సనియు, బౌద్ధభిక్కులు ఇతరమత సన్యాసులకంటె ఎక్కువ సుఖజీవితాలను గడుపుచున్నారని సామాన్యప్రజలు, అంటూ వారిని నిరసించుచున్నారని తెల్పెను.

అందుకై భిక్షువులు, గదులలో రాత్రిళ్ళు విశ్రమింపక ఏ చెట్టు మొదటనో, బట్టబయలులోనో, నిదురించేటట్లు బుద్ధుడు వారిని ఆజ్ఞాపించవలెనని దేవదత్తుడు కోరెను. దీనికితోడు, తమకై గృహస్థులు తెచ్చియిచ్చు మ్రదసోపేతములైన భోజనములను భిక్షువులు స్వీకరింపక, తామే ఇంటింటికి పోయి ప్రాప్తించిన దానినితప్ప వేరేమీ తినకుండా భిక్కులను బుద్ధుడు కట్టడిచేయవలెనని అతను అడిగెను. పరిశుభ్రములైన వస్త్రములను ధరియింపక శ్మశాన వాటికలలోను, పెంటకుప్పలలోను దొరికిన గుడ్డపీలికలను బట్టలుగా తయారుచేసుకొని వాటినే ధరించేటట్లు భిక్కులకు హుకుం జారీచేయమని చెప్పెను. భిక్కువులు చేపలనుగాని, మాంసమునుగాని తినరాదని వాటిని నిషేధించమని బుద్ధుని కోరెను. వినయముతో యీనాల్గు నియమాలను సంఘస్థులందరూ తూచా తప్పకుండా అనుసరించాలనీ, అలాగున అనుసరించనివాడు సంఘ బహిష్కృతుడగుననీ బుద్ధుని అనుశాసించమనెను.

బుద్ధుడది విని, ఈనాల్గునియమాలను అనుల్లంఘనీయాలని అని శాసింప నిరాకరించెను; "కాని ఏభిక్కువైననూ, ఏతరుమూలముననో బట్టబయలులోనో ఎల్లపుడును ఉండదలచుకొన్న అతడటులచేయవచ్చును; కాని అలాగు చేయుట కిష్టపడని భిక్కులు,ధర్మాత్ములు ఉనికికై యేర్పాటుచేయు గృహములలో, అట్టి

గృహస్థుల యిండ్ల దగ్గర వుండకుండా వున్నంతకాలము, కాలము గడుపవచ్చును.” ఆవిధముననే యిష్టముండిన ఏభిక్కువు మిగతా మూడింటిని అనుసరింపవచ్చును. కాని ఆనియమా లను పాటించడంగాని మానడంగాని భిక్కువు యిష్టప్రకారం జరగాలి.”అని చెబుతూ ఈవిధాన సంఘాన్ని చీల్చడానికి ప్రయత్నించవద్దని, నివారించి బుద్ధుడు అట్టి చీలికలు పెట్టే వానికి ప్రమాదం సంభవించక తప్పదని హెచ్చరించెను.

బుద్ధుని నిర్దేశాన్ని తోసిపుచ్చి దేవదత్తుడు కోపంతో మండిపడుతూ, ఆనందునికడకు పోయి, భిక్కువులను ఎక్కువ కఠినశిక్షణకు లోను చేయుటగురించి మాట్లాడెను. ఆనందు డాతనిఉద్దేశములతో నేకీభవింపక, బుద్ధుని భావములనే ఆమోదించెను.

అప్పుడు దేవదత్తుడు, బుద్ధుని చాలకాలమునుండి చూడని భిక్కులున్న దేశభాగమునకుపోయి, వారిని తన ఉద్దే శములతో ఏకీభవించునటుల చేసి, సంఘమును చీల్చెను; అచటి విహారంలో దేవదత్తు డొకనాటి మధ్యాహ్నమున నిదు రించుచుండ, దారితప్పిన భిక్కువుల నుపదేశించి సక్రమ మార్గమునకు తెచ్చుటకై బుద్ధుడు సారీపుత్రుని పంపెను. సారీ పుత్రు డా భిక్కువులతో, ఇందువిషయమై, బుద్ధుని నిజోద్దేశా లను తెలిపెను. జరిగినదానికి పశ్చాత్తాపమును చెంది ఆ భిక్కులు, సారీపుత్రునితో బుద్ధుని విహారమును చేరిరి.

నిద్రనుంచి, దేవదత్తుడు మేలుకొని, విహారము నిశ్శబ్ద ముగావుండడం చూచి బయటకురాగా, అక్కడ ఒక్కభిక్కు

నైననూలేదు. జరిగినదంతయు తెలిసికొని, పట్టరాని కోపముతో చిందులుత్రొక్కుచు,తన శిష్యబృందాన్ని బుద్ధు డెందుకు అపహరించెనని గద్దించుచు, అతనినే అడిగి తేల్చుకొందమని, తన సేవకులను పిలిచి, పల్లకి తెమ్మని ఆజ్ఞాపించెను.

ఇంతలో సారీపుత్రుడును ఇతరభిక్కువులునుకూడ, దేవదత్తుడు రోషావేశపరుడై వస్తున్నాడని తెలిసికొని, ఈసారి దేవదత్తుడు నిశ్చయంగా బుద్ధుని హత్యచేయునని భయపడి అచట నుండి వెళ్ళిపొమ్మని తథాగతుని ప్రార్థించిరి. దేవదత్తుని రాకకు ఎంతమాత్రం భయపడక తనకు అత డెట్టిహాని చేయలేడని చెప్పి బుద్ధుడు, వారి ప్రార్థనను నిరాకరించెను. సారీపుత్రాదులు ఎంత మొఱపెట్టుకొన్ననూ, అటుల చెయ్యనని బుద్ధుడు దృఢముగ పలికెను.

దేవదత్తుని పల్లకి త్రోవలో ఆగిపోయినదని భిక్కులు మొదట వినిరి. ఆ వెంటనే, దేవదత్తుడు మరణించెనన్న వార్త, చేరినది. బుద్ధుని చంపడానికై వస్తూ, దేవదత్తుడు త్రోవలో తానే అసువులను కోల్పోయెను!

అప్పటినుండి బుద్ధుడు భూలోకమున అవతరించి వుండినంతకాలం, సంఘంలో ఎట్టిబాధలులేక వుండెను. కపిలవస్తు, కోసలదేశరాజ కుటుంబములవారందరూ అజాతశత్రునిచే ఓడింపబడి, సమూలముగా వధియింపబడిరి. బుద్ధుని జన్మబంధువుల నాశనము బుద్ధనిర్యాణమున కొక్క సంవత్సరము ముందే జరిగినది.

# 17

అప్పటికి బుద్ధభగవానుడు ఎనుబదియేళ్లు గడిపాడు; వార్ధక్యం అతనిని లొంగదీసింది. మరణకాలం వచ్చిందని బుద్ధునికి తెలుసును. తా నంతరించకమునుపు, భిక్కువులకు తుది ఉపదేశం చేయ నిశ్చయించుకొని, ఆనందుని పిలిచి రాజగృహాధర్మోపదేశ శాలలో భిక్కువులనందర్నీ జమచేయమని చెప్పెను. భిక్కువు లందరూ సమావేశమైరి. బుద్ధుడు, వారికీ క్రింది విధమున బోధించెను :—

"ఓ భిక్కువులారా! మీరందరూ కలిసివుండి, తరుచుగా సమావేశమగుచున్నంత కాలము, సంఘము అభివృద్ధి చెందుతూ, సురక్షితమై వుంటుంది. మీరందరూ సమావేశమై ముఖ్యవిషయాలను ఏకీభావముతో, సంఘంగా మీ తరుణోపాయానికి నేను చేసిన నియమాలను అనుసరించేటంతకాలము, నేను చేయని కొత్త కొత్త కఠిన నియమాలను చేయకుండా వున్నంతకాలము బౌద్ధ సంఘము దిగజారి నశించదు.

మీ కంటె ఎక్కువకాలము సంఘములో వుండిన వారిని గౌరవించండి; వారి ఉపదేశాలను నిరాకరించక పరిగ్రహించండి. మీరు తెలియకముందే మీరు పాపానికి లొంగిపోకుండా ఉండేటందుకు, ఆ పాపానికి దారితీసే ఏ విషయమైనా మీలో అంకురించకుండా వుండేటట్లు అతి జాగ్రతతో వుండండి. అనేకమందితో అఖాడా కోరకండి; ఏకాంతాన్ని కోరండి. ఇతర ప్రాంతాలనుండి భిక్కులు వచ్చినప్పుడు, వారి

అవసరాలను తీర్చుచు, వారికి ఉపచారములను చెయ్యండి. మీలో ఎవరైనా జబ్బు పడునపుడు వానికి మిగతావారు ఉపచర్యలు చెయ్యండి. ఆ విధాన జబ్బుతో వున్న సోదర భిక్కునకు ఉపచారము చేయుట నాకు ఉపచారము చేసినట్లే అని గ్రహించండి. గర్వాన్ని, నిరర్థక డంబాచరణను విసర్జించండి. సాధు సాంగత్యాన్ని కోరండి; దుష్టుల సాంగత్యాన్ని నిరాకరించండి సంసారమున ఉండు ప్రతివస్తువు అనిత్యమనియు, దానియందు మోహముతో నుండువానికి అది దుఃఖమును కలిగించుననియు, అందులో నికరమైన విలువలేదని తరచుగా సంసార వస్తు నైజము గురించి యోచించుకొనుచుండండి.

ఇవన్నీ చేయుచు, మీ నడతకై నేను పెట్టిన నియమములను అనుసరించినంతకాలము, గృహస్థులచేతను, తదితరుల చేతను గౌరవింపబడుచుందురు; సంఘముఅభివృద్ధి చెందును. మీరెనూ నీచ, గ్రామ్య, దుష్టస్థితిలోనికి దిగజారరు. సన్యసించుటకై సంసారమును పరిత్యజించిన వానికి తగని స్థితిలోనికి కృంగరు."

ఇదియే తథాగతుడు సంఘమున చేసిన అంతిమ బోధ. అచటనుండి నలందాపురమునకును తరువాత పాటలీపట్టణమునకును పోయి, అచట గృహస్థులకు అంతిమ బోధను ఈ క్రింది విధాన కావించెను :-

"నాయకులారా! ఎవడు గృహస్థుల మంచినడతకై నేను ఉపదేశించిన సత్ప్రవర్తన నియమములను నిరాకరించునో, లేక వాటి ఆచరణలో అజాగ్రతయు, బద్ధకమును కనపరుచునో,

అట్టివాడు ప్రజలలో మంచి పేరు పోగొట్టుకొనును; ఇహమున అతని సంపదయు సుఖములును క్షీణించి క్షీణించి చిట్టచివరకు నశించును. ఎందులోను అతనికి నిశ్చయముండదు. తనలో తన నమ్మిక మంతరించును; సుఖము లేక; సంతుష్టి లేక, ఖేదముతో నిండివుండి, మరణానంతరమున దుఃఖస్థితిని పొందును.

కాని ఏ గృహస్థులైతే నేను బోధించిన సదాచరణ నియమములను అనుసరించుచు, జాగ్రత్తతో మెలంగుదురో, వారికి గౌరవముండును; మనుష్యులలో కీర్తివంతు లగుదురు; ఆరోగ్యము, సమస్త సంపదలు వారి కుండును. ఎచటకు పోయినను వారికి ప్రజలు స్వాగత మిచ్చుచుందురు. మహాపురుషులు, రాజులు, మంత్రులు, సత్పురుషులు, పండితులు, వివేకవంతులు వారిని సంతోషముతో ఆహ్వానింతురు. వారి కెట్టి శంక లుండవు. వారికి ఆందోళన సున్న. మరణానంతరము వారు ఆనందస్థితిని పొందుదురు."

అప్పటికి బుద్ధునకు ఎనభైఏళ్ళవయస్సు. నలభైఏళ్ళపాటు తనమాతృభూమిని కాలినడకను తిరిగి తిరిగి ఒక్క వర్షాకాలములో తప్ప మిగిలిన కాలమంతయు విశ్రామము లేక ఎడతెగక అతడు బోధించుచు వచ్చెను. వయోభారము హెచ్చినది. దారుఢ్యము తగ్గి దేహము అలసిపోయినది. కాని ఆయన చిత్తము మాత్రము ఎప్పటివలె నిర్మలంగాను, నిశ్చలంగాను, శక్తివంతముగాను వుండెను. ఇక తనకు మరణము ఆసన్నమైన దని బుద్ధుడు తెలిసికొన్నాడు; తాను చిన్ననాడు గడపినహిమాచల పర్వతపంక్తి చేరువనున్న దేశం ఆయనను ఆకర్షించింది.

అత్యుత్సాహంతో సేవించిన భూమిని చేరి అక్కడనే అవతారమును చాలించవలెనని ఆయన కుతూహలం. అందు కోసమై, రాజగహమునువిడిచి, దుర్బలమైన పాదములతోనే ఉత్తరదిక్కునకు నడకసాగించెను. కుసినారయనే చిన్నపట్ట ణాన్ని చేరి అక్కడ మరణమునకై వేచివుండవలెనని ఆయన సంకల్పం. పాటలీపుత్రముమీదుగా ఉత్తరమునకు పోవుచు వేసాలిని చేరెను. అది డబ్బుగల పట్టణము. ఒకనాడు అంబ పాలి అను వేశ్య యిక్కడనే బుద్ధుని దర్శించి, ఆయన కొక విహారమును సమర్పించెను. ఆ విహారమును తాను సమర్పింప ఉద్యుక్తులై వుండగా అంబపాలి సమర్పించినందులకు అక్కడి రాజన్యులు ఆమెపై కినుక చెందిరి.

బుద్ధుడు 'బేలువ' అను కుగ్రామమును చేరినపిదప ఇంత వరకునూ తనను అనుసరించి వచ్చుచున్న భిక్కువులను వంపి వేసెను. వర్షాకాలములో అంతమంది భిక్కువులకు బేలువ వంటి కుగ్రామము భిక్షనిచ్చి నిలబెట్టలేదు; కనుక సంపదగల పురమునుచేరి వర్షాకాలమును వెళ్ళబుచ్చుమని బుద్ధుడు భిక్కు వులకు సలహాయిచ్చెను. ఆయన సలహాను అనుసరించి భిక్కులు, డబ్బుగల వేసాలి పట్టణమునకు తిరిగి పోయిరి. ఇట్లు బుద్ధుడు అందరినీ పంపించివేసి, రేయింబవళ్లు తనను అంటిపెట్టు కొని పరిచర్యలు చేయుచుండిన ఆనందుని తనవద్ద అట్టేపెట్టు కొనెను.

బేలువలోనే తన జీవితములోని ఆఖరి వర్షఋతువును గడపడానికి బుద్ధుడు సంకల్పించుకొనెను. అచట కొంత కాలం

గడపినతరువాత, ఒక వ్యాధి అతనిలో ప్రవేశించింది. వ్యాధి, నొప్పికూడా రోజుకురోజు హెచ్చుకాగా, బుద్ధుడు మరణించునని ఆనందుడు అనుమానపడుచుండెను. కాని బేలువలో బుద్ధుడు మరణించదలచుకోలేదు. సంసార పరిత్యాగముచేసి సన్యాసాశ్రమము స్వీకరించి ధర్మబద్ధమైన పవిత్ర జీవితాన్ని గడప దీక్షబూనిన భిక్కువులను ఒక్కసారిచూచి వారికి ఉత్సాహాన్ని కలుగజేసి, మరొక్కమాటు వారికి ధర్మ ప్రబోధము గావించనిదే ఆయన తన దేహమును చాలించదలచుకోలేదు. బుద్ధుడు అందుకై గట్టిపూనికపట్టి, రోగమును అణగద్రొక్కి, కొంత సుముఖతగని తాను బస చేసిన గుడిసెనీడలో, ఆనందుడు పరిచిన చాపమీద కూర్చొనెను. ఆనందుడు అతని ప్రక్కనుగూర్చొని, "తథాగతుడు సుముఖతతో వున్నందుకు నా కెంతో ఆనందంగావుంది. కొద్దికాలం క్రితం బుద్ధుడెంత జబ్బుతో బాధపడుతున్నాడో చూచి రమారమి మూర్ఛపోయితిని. కాని అప్పుడే, రాబోయే కాలములో సంఘపు విధానము నిర్దేశిస్తూ తుది ఉపదేశమును చేయునిదే నిర్వాణము నకు పోడని' యోచించి నిబ్బరపడితిని." అనెను.

అది విని బుద్ధుడు "ఓ ఆనందా, నన్నిక భిక్కులు అడగవలసినదేమున్నది? ధర్మాన్నంతా బోధపరచితిని నిర్వాణమును పొందుటకవసరమైన జ్ఞానాన్ని అణుమాత్రమైన మభ్యపెట్టక వారికి బోధించితిని. ఉన్నదున్నట్టు, ఏ రహస్యమును ఉంచుకోక, దుఃఖనాశనము చేసికొనేటందుకు అవసరమైన జ్ఞానాన్నంతా బోధించితిని. సంఘాన్ని పరిపాలిస్తూ, దానిని తన చెప్పుచేతలలో వుంచుకోదలచినవాడు, దాని భావి

పరిపాలననుగురించి, ఉపదేశాలను చేయవచ్చును. కాని, ఓ ఆనందా! సంఘమును బరిపాలించడంగాని, దానిని నా వశములో, వుంచుకోవడంగాని నేను చేయదలచుకోలేదు. దాని భావిని గురించి నే నేమి ఉపదేశాన్నియ్యవలెను? ఎనభై వళ్ళ వృద్ధుడనై బలహీనుడనై వున్నాను. దేహము జీర్ణావస్థలో వున్నది. మీ కందరికీ నేను చెప్పదలుచుకున్నది: ఒక్కటే. మిమ్ములను మీరే కాపాడుకోవాలి. మీకు మీరే వెలుతురవాలి. ఇతర వెలుతురును, ఇతరశరణ్యమును ఆశ్రయించకండి. ఓయీ ఆనందా! నా శిష్యులలో ఎవడైతే తనకు తానే వెలుతురై' శరణ్యుడై వుంటాడో, నేను బోధించిన తత్వాన్నే తనకు దారి చూపు వెలుతురుగ, తన శరణ్యముగపరిగణిస్తాడో, అతడే నాకు అసలైన శిష్యుడై సత్యమైన మార్గములో నడుచువా డౌతాడు" అని చెప్పెను.

మర్నాటి ఉదయమున దేహములో స్వస్థతగా వుండడం చేత, బుద్ధుడు, మామూలు భిక్షాటనకై వేసాలికి వెళ్ళెను. సాయంకాలము వేసాలిలో వుండిన భిక్షువులనందర్ని ఆనందుని పంపి, సమావేశపరచెను. తా నిన్ని సంవత్సరములుగా బోధించుచువచ్చిన ధమ్మము, సన్మార్గము, శీలసంపదలను గురించి వారికి ఒక్కమాటు తెలుపుచు బుద్ధుడు "సంసారము అనిత్యము. ప్రపంచములోని వస్తువులన్నియు, నిరంతరము మార్పు చెందుచుండును. మీరు సన్మార్గాన్ని అనుసరించండి. ఎప్పుడూ ఈ కృషిలోనే వుంటూ ఎడతెగకుండా ప్రయత్నించండి. మీ మనస్సులను సదా పరీక్షించుకుంటూ వుండండి. అలాగుచేస్తే, జన్మమరణ పరంపరలనుంచి విముక్తులౌతా"రని ఉపదేశించెను.

తెల్లవారగానే బుద్ధుడు కుసీనా నగరానికి బయలుదేరి త్రోవలో 'పార్థివ' అనే గ్రామాన్ని చేరుకొనెను. ఆ గ్రామపు బంగారపు పనివాని కుమారుడు, చందుడు అనేవాడు, సూకర మద్దరములను వండించి భోజనమునకు రమ్మని బుద్ధుని ఆహ్వానించెను. అడవిపందులకు యీ సూకరమద్దరములనే కుక్కగొడుగులు అతి ప్రియములు. చందుడు పెట్టిన భోజనమును బుద్ధుడు తినగా అతనికి శరీరములో స్వస్థతను, బలమునుపొందినట్లుండెను. జబ్బు పూర్తిగా పోయినదన్నంతబాగా, దేహము కనిపించగా అంతగా ఉపకరించిన భోజనముపెట్టినందుకు బుద్ధుడు సంతసించి, ఇహపరములలో మంచిని పొందుదువని చందుని దీవించెను.

కాని బుద్ధుని స్వస్థత కొద్దికాలమే వుండెను. బేలువలో వచ్చిన జబ్బు తిరగబెట్టినది. అయిననూ ఆయన పట్టుపట్టి మనోబలముతో రోగమును నిగ్రహించుకొని, శక్తి ఉడుగుచున్ననూ లెక్కచేయక తప్పటడుగులు వేయుచు, అతి కష్టముమీద కుసీననగరమునకు చేరగలిగెను. దూరముగా ఆ నగర రాజన్యులకు చెందిన ఒక సాలవనము కనిపించుచుండెను. అది కంటపడగానే ప్రయాణము ముగియనున్నదని తెలిసికొని బుద్ధుడు "ఓ ఆనందా! దూరంగా కనిపించే ఆ మహాసాలవృక్షద్వయము మధ్య నేనువిశ్రమించెదను. అక్కడ కాస్త జాగా తయారుచేయుము. ఆనందా! బాగా అలిసిపోయి వున్నాను. కొంచెముసేపు పడుకొని విశ్రమింపగలను!" అనుచు ఆనందుని పంపెను.

ఆనందుడు, బుద్ధుని కాషాయవస్త్రమును నాలుగు మడతలు మడిచి, ఆ మహాసాల వృక్షాలమధ్య భూమిమీద పరిచెను.

బుద్ధుడు, దానిపై శిరమును ఉత్తర దిక్కు వైపునకు వుంచుకొని, పడుకొని. అప్పటివలె, అతి ప్రసన్నుడై. నిదుర పోకుండానే, విశ్రమించుచుండెను. వార్ధక్యమువలన అతి బల హీనుడై నడవడానికి శక్తిలేక పల్లకిలో తీసుకొనబడుచుండి నపుడు కూడ, బుద్ధి నిర్మలంగాను, నిశ్చలంగాను వుండుటవల్ల తాను ఎట్టి మహా పండితుని ప్రశ్నలకైనను జవాబులుయిస్తూ వారు అలసి సొలసి నిదుర పోయేవరకు సంభాషిస్తూ వుండగల నని ఒకప్పుడు బుద్ధుడు, సారీపుత్తునితో చెప్పెను.

ఇక తన ప్రియ గురువునకు మరణము ఆసన్నమైనదని తెలిసికొని, ఆనందుడు దుఃఖాక్రాంతుడయ్యెను. ఎంత ప్రయ త్నించినప్పటికీ, దుఃఖము ఆగినదికాదు. దగ్గరగావున్న విహార ములోనికిపోయి, బుద్ధునికి కనిపించకుండా, తలుపు చాటున దాగుకొని, వెక్కి వెక్కి ఏడ్చుచుండెను. "నేను ఇతర భిక్కుల వంటివాడనుకాను, నేను ఇప్పుడిప్పుడే, ధమ్మాన్ని నేర్చుకోవడం మొదలు పెట్టాను. అర్హానస్థితిని నేనింకా పొందలేదు. ఇప్పుడు పరమదయాళుడైన పరమాచార్యుడు, దేహము చాలించి నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోతున్నాడు!" ఆనందుని చెక్కిళ్ళ నుండి కన్నీరు చారలుగ కారుచుండెను.

బుద్ధుడు కళ్ళు తెరచిచూచు సరికి ఆనందుడక్కడ లేడు. అతను ఎక్కడున్నాడని తథాగతుడు భిక్కువులను

ప్రశ్నించెను. ఒక భిక్షువు "భగవాన్! పూజ్యుడైనఆనందుడు విహారములోకిపోయి, ఇంకా తాను నేర్చుకొనే అవస్థలోనే వున్నాననీ, అందులో త్రిష్ణాతత్వాన్ని పొందలేదనీ, ఆచార్యుడు అట్టి స్థితిలో అంతరింపనున్నాడనియు చెబుతూ, ఆ విహారములో తలుపుచాటున కన్నీరు కార్చుచున్నాడు" అని చెప్పెను. బుద్ధుడంతట "ఓ భిక్షూ! లోనికిపోయి, నేను పిలుస్తున్నానని ఆనందుని పిలువుము!" అని ఆజ్ఞాపించెను.

భిక్షువు ఆనందుని పిలవగా, ఆతడు వచ్చి బుద్ధుని ప్రక్కనకూర్చొనెను. బుద్ధుడు "ఓ ఆనందా, నీ దుఃఖమును కట్టిపెట్టుము. ఇదిచాలు ఎప్పుడో ఒకనాడు మనము ఒకరి నొకరు విడనాడవలసివుంటుందనీ, మన కతిప్రియమైనదానిని విడిచి వుండవలసివుంటుందనీ, నేనెన్నిసార్లు నీతో చెప్పలేదు. ఇది జరగక తప్పనూ తప్పదు; మనము చెయ్యగలిగినదీలేదు. జన్మఎత్తినది, చావకతప్పునా, ఆది గలిగినదానికి అంతముండక పోతుందా? అట్టిది అసంభవము. ఓ ఆనందా! చాలా కాలము మనోవాక్కాయ కర్మలతో అనన్యసామాన్య భక్తితో, అమితోత్సాహంతో, అతిప్రేమతో నా పరిచర్య చేసితివి. నాకు అతిభక్తితో సేవచేసి, చాలా మంచిని ఆచరించితివి. అర్హానుడు కాకుండా నీకు అడ్డుతగులుతున్న ప్రతి అడ్డంకును తెగకొట్టుకొనుము. నీవు శ్రద్ధతో పాటుపడిన అచిరకాలములోనే అర్హానస్థితిని పొందగలుగుదువు." అని చెప్పుచు, అచ్చటనున్న భిక్షువులకీ బోధచేసెను. "నాపూర్వముండిన బుద్ధులందరూ నాకు ఆనందుడువలెనే, పరిచారకుని గలిగివుండేవారు. ఇకముందు వచ్చే బుద్ధులందరూ ఆనందుని

వంటి భక్తిగల పరిచారకుని కలిగియుండుదురు. ఆనందుడు నన్ను భక్తి శ్రద్ధలతో, వివేకముతో కొల్చెను. నన్ను దర్శించుటకు ఉచితమైన సమయమును తెలిసికొని, ఆ సమయములోనే, నన్ను చూడవచ్చినవారిని నా సముఖమునకు తీసుకువచ్చేవాడు. అలాంటివారిని మర్యాదతోనూ, ప్రియభాషణముల తోనూ గౌరవించేవాడు. వారు, అతని మర్యాదనుచూచి సంతసించేవారు. అతని సంభాషణమును వినడానికి కుతూహల పడుతూ వుండేవారు. నన్ను సదా అతిభక్తితో ఆనందుడు కొలుస్తూవుండేవాడు" అని చెప్పెను.

బుద్ధుని వాక్యములను విని ఆనందుడు "ఓ పరమ పూజారీ! ఈ మారుమూలవున్న జంఘులీప్రదేశంలో ఈ చిన్ని మట్టిగుడిసెలోంచి, నిర్వాణములోకి వెళ్ళకండి. వేసాలి, రాజగృహ, సావట్టి వంటి గొప్పగొప్ప పట్టణములువున్నవి. ఈ పట్టణాలలో ఏదోఒకదానియందు, కాలమునకు శరీరాన్ని ఒప్పచెప్పండి. తథాగతునికి ఉచితమైనరీతిని అంత్యక్రియలు జరిపింపగలిగిన మహాసంపన్నులైన తమ శిష్యులు యీ పట్టణాల్లో వున్నారు!" అని విన్నవించెను.

ఆ మాటలు విని బుద్ధుడు, "ఓయీ ఆనందా! ఆలాగున మాటలాడకుము. ఈ గ్రామము మారుమూల జంఘులీ ప్రదేశంకాదు. బహుపూర్వకాలంలో, ఓ ఆనందా, హిరణ్మయ ప్రాసాదంలో జీవించుతూ, ఈ దేశాన్ని ఒక మహారాజు పరిపాలిస్తూవుండేవాడు. అతని రాజధానియై, బహుశోభతో వెలసిన, మహాపట్టణం యిక్కడేవుండేది!" అనెను.

భిక్షువులును ఆనందుడును మౌనముగ చూచుచుండిరి. తథాగతుడు కొంచెముసేపు పోయినతరవాత "ఓ ఆనందా! ఈ రాత్రి ఆఖరుఝామున తథాగతుడు నిర్వాణమునకు పోవునని, నీవుపోయి, కుసినారనగరములోని పెద్దలకూ ప్రజలకూ తెలియచేయుము. శరీరము చాలించక మునుపు తథాగతుని వారువచ్చి చూచెదరుగాక!" అని కోరెను.

ఆనందుడు, యింకొక భిక్షువును తనతోతీసికొని కుసీనారమునకుపోయి, అక్కడిపెద్దలకు, పౌరులకు బుద్ధుడు ఆ నాడు దేహయాత్ర పూర్తిచేయునని చెప్పగా, వారందరూ కడు దుఃఖితులగుచూ "ఎంత వేగముగా, భగవానుడు, నిర్వాణమును చెందుతున్నాడు. ప్రపంచజ్యోతి ఎంత త్వరగా అంతరించుతున్నది!" అని విలపించిరి. ఆబాలగోపాలమూ, సాలవనమును చేరి, తథాగతుని ఎదుట వంగి నమస్కరించి ఆయన సెలవు గైకొనిరి.

ఆ సమయములో, ఒక పరివ్రాజకుడు కుసీనారమూ దగ్గిర బసచేసి వుండెను. అతని పేరు సుభద్రుడు. బుద్ధుడు అవతారము చాలించుచున్నాడని తెలిసికొని అతడు ఎంతో వ్యాకులపడెను. కొన్నాళ్ళుగా తనకు బోధపడక బాధపెట్టుచున్న ఒకానొక జ్ఞానవిషయమును గురించి బుద్ధునితో ముచ్చటించ వలెననీ, అతనివలన శంకానివారణ చేసికోవాలని సుభద్రుడు ఆతృతపడుచుండెను. బుద్ధుడు అవతారముచాలించక మునుపే తన సందేహనివృత్తికై ఆ మహాసాల వనమునకు తొందరతొందరగా చేరెను. ఆనందునికి తన శంకను తెలిపి,

బుద్ధుని ఆ ప్రశ్న అడిగి శంకను పోగొట్టుకొనుటకు అనుమతించ వలసినదిగా కోరెను.

అతని కోరికను చెల్లించుటకు ఆనందుడు వెనకాడి "ఓ సుభద్రా! తథాగతుడు అలసి వున్నాడు. ప్రశ్నలతో ఆయనను యిపుడు వేధింపకుము" అని జవాబు చెప్పెను. కాని బుద్ధుని కలుసుకొని ఆయన ముఖతః తన అనుమానమును పోగొట్టుకోదలచిన సుభద్రుడు తిరిగి తిరిగి ఆనందుని తనకు బుద్ధ దర్శనం చేయించమని ప్రార్థించెను; కాని అతడందుకు అంగీకరించలేదు. ఆచార్యుడు అతి సుస్తీగా వుండడంవల్ల ఆయనకు అట్టి శ్రమ కలిగించడం భావ్యం కాదని ఆనందుడు నిష్కర్షగా సమాధానము చెప్పెను.

సుభద్రానందుల సంభాషణ ప్రక్కను పవళించివున్న బుద్ధుడు విని, "ఆనందా! ఇటు రమ్మ"ని పిలిచి యిట్లు చెప్పెను. "నన్ను చూడకుండా, సుభద్రుని ఆపివేయకు. ఇష్టముంటే అతడు నన్ను చూడవచ్చును. తెలిసికోడానికే అతను నన్ను కొన్ని ప్రశ్న లడుగుతాడు. కాని నన్ను బాధ పెట్టడానికి అడగడు. అతను తెలివైనవాడు. చెప్పేసరికి గ్రహిస్తాడు!"

అప్పుడు సుభద్రుడు, బుద్ధుని దర్శనంచేసి, భక్తితో నమస్కరించి. "ఓయీ, గోతమా! ఇతర మత సన్యాసుల నాయకులు, తాము చెప్పుకుంటున్నట్లుగా, సత్యాన్ని కనుక్కొన్నారా? లేక కనుక్కోలేదా? వారిలో కొంతమంది కనుక్కోలేదా?" అని ప్రశ్నించెను.

బుద్ధుడు అతని ప్రశ్నవిని యిట్లు చెప్పెను : "చాలును అది. ఓ సుభద్దా ! ఆ ప్రశ్న అలాగుండనీ, నేను చెప్పేదాన్ని జాగ్రత్తగా విను; వింటే నీకు సత్యం బోధపడుతుంది. ఏ యే మతసిద్ధాంతాల్లో అష్టగుణ ధర్మమార్గం లేదో, అక్కడ సోతాపన్నులుగాని, సకదగాములుగాని, అనాగములుగాని, అర్హనులుగాని ఉండరు. ఎక్కడైతే అష్టగుణ ధర్మమార్గం ఉంటుందో, అక్కడ సోతాపన్నులు, సకదగాములు, అనాగములు, అర్హనులు ఉంటారు. ఓయీ సుభద్దా! ఈ నా ధమ్మములో, శిక్షణములో యీ అష్టగుణ ధర్మమార్గం ఉన్నది; అందులోనే, సోతాపన్నులు, సకదగాములు, అనాగాములు, అర్హనులు ఉన్నారు. ఇంకేసన్యాసశాఖలోనూ వీరు లేరు. నా భిక్కువులు శీలంతో ప్రవర్తించుచు, నా బోధనలను అనుసరించునంతకాలం, ప్రపంచంలో అసలైన అర్హనులు ఉండకమానరు!"

అపుడు సుభద్దుడు భిక్కుసంఘాన్ని చేరడానికి కుతూహలపడి, బుద్ధుని అనుజ్ఞను వేడెను. అతని ప్రార్థన అంగీకరించి బుద్ధుడు అతనికి దీక్షనీయవలసినదిగా ఆనందుని కాజ్ఞాపించెను. సుభద్దుడు దీక్షను గైకొనెను. బుద్ధుడు సంఘంలో చేర్పించిన భిక్కువులలో ఇతనే ఆఖరివాడు. కాసీవద్ద మిగదయవనంలో బుద్ధునిచే చేర్చబడిన మొదటి భిక్కువు కొండన్న. సుభద్దుడు అతి శ్రద్ధతోనూ ఉత్సాహంతోనూ ధర్మాన్ననుసరించి ఆచరించడంచేత, అతి త్వరతకాలంలోనే అతను అర్హనుడయ్యాను.

బుద్ధుడు ఆనందునితో "ఓయీ, ఆనందా! భిక్కువులలో కొంతమంది 'మేమికపరమాచార్యుని మాటలను విన

నేరము; మనకు ఆచార్యుడే లేడని' అనుకుంటారేమో ? 'ఆనందా! అది సరియైన భావంకాదు. ఏ ధర్మాన్ని ఏ శిక్షణను మీకు బోధించి అనుసరించమని నేనుచెప్పుతూ వచ్చానో నా అనంతరం అవియే, మీకు ఆచార్యులగును. నేను బతికి వున్నంతకాలం, భిక్షువులందరూ, ఒకరి నొకరు, సోదరా అని పిలుచుకుంటున్నారు. కాని నేను అంతరించిన పిదప సంఘంలో పెద్దలు, చిన్నభిక్షులను సోదరులని పిలవవలెను. చిన్నభిక్షులు, పెద్ద భిక్షువులను 'పూజ్యా' అని పిలవవలెను. నా అనంతరం, ఇష్టముంటే సంఘపు చిన్నచిన్న కట్టుబాటులను రద్దు చేయవచ్చును" అని అనుచూ, ఇతర భిక్షువులతో యిట్లు చెప్పెను: "ఓయీ, భిక్షువులారా! మీలో ఎవరికైనా, బుద్ధుని గురించిగాని, ధమ్మమునుగురించిగాని, సంఘము గురించిగాని, యుక్తమార్గం గురించికాని, ఏవైనా శంకలు వుంటే, వాటిని నన్నడిగి తెలుసుకోండి. నేను మరణించిన తరవాత, 'అయ్యో! ఆచార్యుడు బతికి వున్నపుడే అతనిని అడిగి శంకలను తీర్చుకోలేకపోతిమి' అని విచారించగలరు!" ఈ విధముగా బుద్ధుడు ముమ్మారు అడిగిననూ, వారిలో ఎవ్వరూ ఏమియూ అడుగలేదు. అప్పుడు ఆనందుడు "ఓ, పరమ పూజ్యా! ఇది పరమాద్భుతం! పరమాశ్చర్యకరం! ఈ మహా భిక్షు సంఘంలో ఒక్కనికైననూ, బుద్ధునిగురించిగాని, ధమ్మము గురించిగాని, సంఘముగురించిగాని, యెట్టి అనుమానం లేదని నమ్ముతున్నాను" అనెను.

బుద్ధుడు: ఓయీ ఆనందా! ఈ విషయంలో కేవలం నీవు నమ్మకంపై ఆధారపడివున్నావు. వీరికెట్టి శంకలునూలేవని

నే నెరుగుదును, ఇక్కడున్న భిక్కువులలో ఒక్కడైనను, ఎంత వెనుక పడివుండినవాడైనా, అధమస్థితులకుపోక, పరమజ్ఞానాన్ని పొందక తప్పదు.

ప్రపంచమున ప్రతివస్తువునూ నశించునదియే అనీ, ప్రమత్తతో వర్తించుచూ మోక్షమును సంపాదించుకొమ్మని భిక్కువులకు బుద్ధుడు ఉపదేశించెను. అటు పిమ్మట అతనికి తెలివి తప్పినది. కాని కొంతసేపటికే తెలివివచ్చెను. చిత్తమును లగ్నపరచి ధ్యాన నిమగ్నుడై కోరికలను జయించి మహా పరినిర్వాణమును చెందుటకు కొంచెము పూర్వము బుద్ధుడుఆఖరిమాటు అచట వున్న భిక్కువులను అందరినీచూచి, ఇలాగున ఉపదేశించెను. "ఓయీ! భిక్కువులారా! మీకు నా ఆఖరి ఉపదేశం యిదే: 'సబ్బే సంఖరా అనిచ్చా. అప్పమాదేన సంపదేథా'. సర్వ సంస్కారములును అనిత్యములు. అప్రమాదంతో వర్తించుతూ మీరు మోక్షమును సంపాదించండి!"

అదే బుద్ధుని అంతిమ సందేశము! అదే ఆయన తుది దివ్య దర్శనము!!